శ్రీమత్పరదేవతాయై నమః.

# గీరతము.

## గురుదక్షిణ.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి

మల్లంపల్లి భైరవమూర్తిగారిచే

స్వకీయమగు

శ్రీ భైరవముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

మొదటికూర్పు 1,000 కాపీలు.

మచిలీబందరు.

దీని వెల రు 0—10—0.

1913.




తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము.

చదువరులారా!

గీరతప్రథమభాగము చదివి యుంటిరికదా! సర్వవిషయములును సూత్రప్రాయముగా నందే గతార్థము లగుటచే నిప్పుడు ప్రకటించు ద్వితీయభాగమునఁ గాని ప్రకటింపఁ బోవు తృతీయభాగమునఁ గాని తెలియఁదగు విశేషాంశము లంతగా నుండవు. ఎన్నాళ్లు చదివినను నాయాయీగ్రంథభాగములయందు—

(1) శిష్యుఁడు గురుద్రోహము చేయుటతప్ప (2) అందులో నీ శిష్యుఁడు వత్సరములకొలఁది చదివినశిష్యుఁడు గాని వేఱొకవిధమగువాఁడు కాఁడు (3) పైఁగా నితఁడు కృతఘ్నుఁడగుటతోఁ జాలింపక వదరుఁబోతువ్రాఁతలు, అసత్యములు, అపవాదలు లోనగునవి ప్రకటించుట మొట్టమొదలే తప్ప

అనునీయంశములు దక్క వక్తవ్యాంశము గానరాదు. గురువే దోషియో లేక శిష్యుఁడే దోషియో మీకు మొదటిభాగమువలననే గతార్థమై యుంటచే దీనిప్రకటన మంతయావశ్యక మని మాకును దోఁచలేదు గాని మొదటిభాగమునందు విస్తరభీతిచే వదలినయంశములు కొండొక యుంటచే నయ్యవి యిందు ఖండించుమిషమీఁద గురుశిష్యధర్మములు కొన్ని సంగ్రహించి చూపుటకై దీనిని ముద్రించితిమి. "అట్టహాసము" అనునది ప్రథమభాగమందే యించుక స్పృశించి వదలఁ బడినది పిమ్మట గుంటూరిసీమ పూర్వరంగము 47, 48, 49 వ పుటలలోఁ గొండొక దాని బండారము బయట బెట్టఁ బడినది. ఇందుంగూడ నక్కడక్కడ దానిం గూర్చి ప్రస్తావింపఁ బడినది. "అట్టహాసమే యన నేల మాశిష్యులు వ్రాసెడి వ్రాఁతలెల్లఁ బరికించి చూచినచో.—

(1) మాగురువు పండితుఁడు గాఁడు. (2) పాత్రుఁడు గాఁడు.

అనునంశము సాధించుటకై పాటుపడుటదక్క వేఱొకటి గానరాదు. ఇందులకు వారు చూపుప్రమాణములో? పేరు దాఁచికొని తోఁచినప్రల్లదములెల్ల వ్యయపఱచిన తస్కరుల వ్రాఁతలు, ఆవ్రాఁతలవలననే గీరత ప్రథమభాగము నిస్సార మనియో నిరుపయోగ మనియో కూడ లిఖించి సంతసించుచుండిరి ఆవ్రాఁతలతత్త్వము లోకమెల్ల నెఱుంగును మాశిష్యు లంతకుమున్నే యెఱుఁగుదురు, ఎఱిఁ

గియును వానివలన మాకేదియో న్యూనత కలుగు ననియు నంతలోఁ దమగురుత్వముకూడఁ బోవు ననియుం గాఁబోలును వీ రవి పట్టుకొని సారెకు వ్రేలాడుట,

“శ్లో॥ కతిపయదివసైః క్షయంప్రయాయా, త్రనకగిరిః కృతవాసరావసానః,
ఇతిముద ముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే. (విద్యానాథకృతము)

“తుష్యతుదుర్జన” న్యాయమున నాయీయాతప్పుడువ్రాఁతలెల్ల నిజములేయైనను దమ కవి న్యాయము గావు, అవి మాకుఁ గలయశమును బోఁగొట్టినఁ బోఁగొట్టుఁగాక తమగురుత్వము నెట్లు పోఁగొట్టఁ గలవు? కావున వీరు మమ్ము దోషులనుగాఁ జేయుటకు వ్రాయు వ్రాఁతలేమి యందులకై వ్యయపఱచుచున్న ద్రవ్యప్రదాతల సొమ్మేమి వమ్మే గాని లాభకారిగాదని వారి కిప్పటికేనిఁ దెలిసినచోఁ గొంతయుక్తముగానుండును నానాఁటికి వీరు మఱియును నట్టడవిని బడుచున్నట్లు వ్రాఁతలవలనఁ దెలియ వచ్చుచున్నది మొదట గురుని కపాత్రత్వను సాధించుటకు “గాకి” యని వదరఁ దొరఁకొనిరి,

“పక్షిణాం కాకీ చండాలీ”

అనుటవలన నది యపాత్రత్వమునకు సాధకమే, ఇటీవలనో? ఈ వేంకటేశ్వరుఁడే యా వేంకటేశ్వరుఁ డని యభేదాధ్యవసాయము చేసి కొని పడఁదిట్ట నారంభించిరి, అతివిస్తరమెందులకు, ఏదో విధమునఁ దిట్టుట వీరిముఖ్యోద్దేశము, ఏదోవిధమున నీతి గఱపుట మాముఖ్యోద్దేశము, వా రందులకును మే మిందులకును బాటుపడవలసిన దని భగవంతుఁ డేర్పఱచియుండుటచే నేవో వ్రాసికొనుచుందుము. రసారసవిచారముతో మాకుఁ బని లేదు కావునఁ జదువరులు మమ్ము నిందింప కుందురుగాక, ముందు ప్రకటింపఁబోవుభాగములలో ‘తిరుపతి వెంకటేశ్వరార్థశతకమును’ గూర్చిన పద్యములుండును. 78 వ పుటలోని 237 వ పద్యము వలన నీ భాగము వెలువడు నప్పటి కది మేముచూడనే లేదని తోఁచును గాని, ఆపుట ముద్రిత మగునప్పటికే చూచియుండలేదు గాని యిటీవలఁ జూచితిమని యెఱుంగునది, వెంటనే కొన్నివందల పద్యములతో ఖండింపఁ బడినది గాని విస్తరభీతిచే నవి యిందుఁ జేర్ప లేదు, దేవునితో నభేదముచేసి తిట్టుటవలన వారికిఁ బాపమున్నదో లేదో గాని దానిని ఖండించుటకుఁ జెప్పకవిత్వమువలన మాకొకింత పుణ్యముగూడఁ గలుగుచున్నదని యానందించుచున్నారము. ఇది ముందు రాఁబోవు భాగమునఁ జర్చింపఁ దగిన దగుటచే నిందు విస్త

రింపక ప్రకృత మగు 'కోకిలకాకమును గూర్చియు, నింతకుమున్న ప్రచురించిన గీరత ప్రథమభాగముపై వారు ప్రకటించిన శంకలను గూర్చియుఁ గొండొక వ్రాసి విరమించెదము. "కోకిలకాక" మన్యాపదేశముగదా? దానిని మీపై నేల పెట్టుకొంటిరి. అని ప్రశ్న రావచ్చును, అందులకుఁ బ్రథమభాగపీఠికలో మాశిష్యుల వ్రాఁతలనే బోధకములనుగాఁ జూపి యున్నారము. ఇందుఁగూడఁ గొండొక చూపెదము.

(కవితలోని ప్రభాకరపరామర్శమునుండి)

చ॥ ...... మీగురులకుఁ దెల్లమే,...... మాగురులశక్తి ... ... ఉండిలు బద్ధ
శక్తి ...... దెబ్బఁదిను కాకియె కాక నిసుంగెఱుఁగునే॥

ఈ పద్యము 47 వ పుట మొదలుకొని యుదాహరించిన వేటూరి ప్రభాకర శాస్త్రి సతీర్థ్యసంప్రార్థన పద్యముల కిచ్చిన ప్రత్యుత్తరములోనిది, అతఁడు గురువును గాకి యని వ్రాయుట తప్పని మందలించిన పైని వ్రాసిన వ్రాఁతలో మరల నదే పాటపాడుచు లేదని బొంక మొదలిడిన వీరి తెల్విని, వీరి దైవానుకూల్యమును జదువరులే విచారించుకొందురుగాక. ఈ బొంకులను దమ పేరితోఁ బ్రకటింపక శిష్యుని పేరఁ బ్రకటించుటవలనఁ దా మతని మందలింపున కుత్తరమీలేమి స్ఫుటమగుచున్నది, ఏ శిష్యుపేర నీ ప్రల్లదములను వీరు ప్రచురించిరో ఆశిష్యుఁడే యిటీవల "పాణిగృహీతా శ్రవణానందశృంఖల" యను పేరితో 120 పుటలకుమించిన బూతుఁగూఁతలను వ్రాసి లోకుల స్తోత్రముల కర్హమైన గుణవంతుఁడు. అతని పేరా పొత్తముననే చూడఁదగు, అతని శంకలకుత్తరములు "శృంఖలాతృణీకరణము" చదివిన విస్పష్టముగఁ దెలియఁగలవు ఆబూతుల వ్రాఁత వెం॥ రా॥ లయొఱుక మీఁదనే జరిగినదనుటకు సాక్షీభూతము లగునంశములు బోలెఁడుకలవు అవి గూడ నన్యత్ర చూడవలయును మఱియుఁ బ్రకృతమగు "ప్రభాకరపరామర్శమునుండియె మఱికొన్ని యసందర్భప్రలాపములను జూపుచున్నారము

"మ॥ ... వ్రాయఁగ నాయంబె సతీర్థ్యులంచు ... కొద్దిగ శ్రీరామకవీం
ద్రుఁ డొకర్ఁడె విద్దె నేర్పె ...యిర్వురకు బిలిచెదే,

ప్రభాకరశాస్త్రి "సతీర్థ్యులార" అని వెం॥ రా॥ ల నిరువురను బిల్చుట తప్పఁటని ఈతప్పిట్లు సమర్థింపఁ బడుఁగాక. ఏండ్లకొలఁది వెంకటరామయ్య శిష్యుఁడు, రెండవయతఁడో కొన్నాళ్లు మాత్రము శిష్యుఁడు దీనిం గూర్చి భావిమహా

కావ్యములోని ద్వితీయసర్గమును, రామకృష్ణశాస్త్రి తండ్రిగారగువృద్ధులు, బ్రా॥ శ్రీ రామచంద్రశాస్త్రులవారును సాక్షు లగుదురుగాక, మఱియు నీవిషయము 70వ పుటలోని యుత్తరములోని 4, 5, 6. వ పంక్తులవలనఁ గూడఁ దెలిసికొన వచ్చును ఆయుత్తరము రామకృష్ణశాస్త్రి పినతండ్రికుమారుఁడు వ్రాసినదే, అగుఁగాక అతఁడు గూడ వేంకటశాస్త్రికే దగ్గఱబంధువని రామకృష్ణశాస్త్రి యపలాపింపక మానఁడు. ఇట్టియపలాపమునకు రోసి యొక రిట్లు వ్రాసిరి.

(1912 సం॥ సెప్టెంబరు అభినవ సరస్వతినుండి.)

ఓకృష్ణకవిగారూ? మీరుగీరతవిమర్శనమని వ్రాయుచు నందు నన్ను మీకిరువురకు సరిపడిన బందుగుడననియు మీకుగల్గిన తంపియంతయు పెట్టినవాడను నేననియు, నుడివితిరి. అసత్యములేయాడ గంకణముగట్టికొనిన మీకిదియొక వ్యత్యానముగ దోపకున్నను నాకు గడుగడు నసహ్యముగనుండుటచే లోకులెఱుంగుటకై నాసత్యమును జెప్పుచున్నాడను అది మీరునుగ్రహింతురుగాత నేనుమీకే సమీపబంధువుడగాని బ్ర॥ శ్రీ॥ వెంకటశాస్త్రులు శతావధానిగారికి అంతబంధువుడగాను మీవాదసారస్యమునకై మీరు వేరుగా చెప్పనప్పటికి మన బాంధవ్యమెఱుంగువారెవ్వరునొప్పరు....... పల్లెపాలెం.

M. V. Subba Row. 16-8-12.

---

ఈయపలాపములను గూర్చి గ్రంథములో నచ్చటచ్చటఁ గొండొక చర్చింపఁ బడుచునే యుండును, ఇది యటులుండుఁగాక. అతఁడు 'సంప్రార్థనము' అనివ్రాయ వీరు 'పరామర్శము' అని వ్రాయుటవలననే కొంతవఱకు యోగ్యత స్ఫుటమగుచున్నది, దానివలన వచ్చు దుర్ధ్వని నివారింత మన్నను నివారింపఁ బడదు, అది యటులుండె, దాని నిండఁ దిట్లు శరపరంపరగా నున్నవి.

(1) ఉ॥... కోకిలకాకము వెల్లడించుటల్, మంకుతనంబటంచుఁ బలుమాఱికిలించితిరి...,, (2) చ॥... భ్రాతృఁడ వెంకటరామకృష్ణ ధీవరులకటంచు మ్రొక్కుఁడు,, (ఇట్టివనేకములు.)

వ్రిభాకరశాస్త్రి 'మీ యడుగుల్ మ్రొక్కె, అనివ్రాసినది చాలదఁటే? పైగా! భ్రాతృఁడ, ననవలె నఁటే?

"చ॥... రామకవివీరుఁడె నీకు సతీర్థ్యుఁడైనచోఁ దిరుపతిశాస్త్రిగారును 'సతీర్థ్యులె"

తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రివద్దఁ జదివిన దేదియును లేదు. అట్లే వెంకటరామయ్యకూడ నని శిష్యనివ్రాలుతోఁ బ్రకటించు మా శిష్యులసాహసమును లోకమే పరికించుఁగాక. తిరుపతిశాస్త్రి వెంకటశాస్త్రియందు గురుత్వమును జూపుటకుఁ గారణము, అతనికంటె నితఁడు ముందుగాఁ గవనము రచించు నలవాటు గల్గినవాఁడగుటచే నేకరదపద్యలక్షణమునో యే యొకనిమిషమందో యితనివలనఁ దెలిసికొనుటతప్ప వేఱుగాదు, ఇఁక వెంకటరామశాస్త్రికిఁ గల యావద్గురుత్వములో నెన్ని వంతులలోనో యొకవంతుమాత్ర మితరులదియుఁ దక్కినదెల్ల వెంకటశాస్త్రిదియు నగుటకు భగవంతుఁడే సాక్షి కాఁగలఁడు. దీనింగూర్చి మూఁడవభాగములో విస్తరింపఁదలఁచి యిందు సూత్రమమాత్రము వ్రాసి విరమింపఁబడుచున్నది. అప్రస్తుతప్రశంసలో మూఁడుమాసము లని కృష్ణకవి వ్రాసినను, కోకిలకాకములో 'చాలఁగాలమ్ము వినివి, అని యిరువురచేవ్రాళ్లతోఁ బ్రకటించి యున్నారు, "చాలఁగాల" మనఁగా? మూఁడుమాసములే యని పోట్లాడుదురా? అయినచో 'స్త్రీప్రత్యయాంతము కౌముది' చదువుట పొసఁగదు, ఎక్కువబుద్ధిమంతులకు మూఁడుమాసములలోనే స్త్రీప్రత్యయాంతము కావచ్చునని వాదమునకు దిగినను నిలువదు, మూఁడుమాసములు శుశ్రూష చేసెను, మాసము 1కి ననధ్యాయములు 10 దినములు, అదిగాక మధ్యమధ్య నైమిత్తికములు గొన్ని యుండును. అవియెల్లఁ బోఁదోసినచో సుమారు 45 దినములు చదివినట్లు తేలును, ఆదినములలోనే స్త్రీప్రత్యయాంతము చదువుటకు వైయాకరణు లెవ్వరును నొప్పరు, పైఁగా నా నలుబదియైదు దినములేని పాఠము జరుగుటకు.—

"తా" నెప్పుడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచునుంట నేమియుం జెప్పడు కాకి కోయిలకు,, (కోకిలకాకము.)

అనువారివాక్య మొప్పి కొనదు కావున విమర్శించుచో మాశిష్యులు వ్రాయువ్రాఁతలెల్ల నింతసారము కలవి, వారియదృష్టము మంచిది, కావున వారికి గురుదూషణ, దేవదూషణ 'అనృతోక్తులు' ఇఁక నేమి కావలెను, కలియుగమునకుఁ గావలసిన సామగ్రి యంతయుఁ దటస్థించినది 'దానితో' బోలెఁడు గ్రంథమును వ్రాయుచున్నారు. వ్రాయఁగలరు, ప్రతిగ్రంథమును నిట్లు విమర్శించి నిగ్గు తేల్చువారెవరు? ఎవరికిఁ గావలెను, స్థూలదృష్టిచేఁ దిలకించువారో, "కాఁబోలును" అని యనుకొందురు, ఇది యిటులుండె, "పరామర్శము" నుండి యిఁక నొకమాట నుదాహరించి దానిసారమును దేల్చి వదలుచున్నారము.

"సీ॥ దయమీఱ నైషధాంతము కావ్యములు చెప్పి సాహిత్యయుతుని గాఁ జల్పినాఁడు"

వెంకటశాస్త్రికి శ్రీశ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు నైషధాంతము కావ్యములు చెప్పిరనియుఁ గవిత్వము మొదలైనవి నేర్పిరనియు వారియెడల వెంకటశాస్త్రి కృతఘ్నుఁ డయ్యె ననియుఁ జైపద్యమునందలి సారము, శ్రీకృష్ణమూర్తిశాస్త్రులవారివద్ద వెంకటశాస్త్రి చేసిన విద్యాభ్యాసాదికము నీక్రింది పద్యములవలనఁ దెలిసి కొనఁ గోరెదము.

(జాతకచర్యనుండి)

చ॥ కదలి యనంతరం బచోటుకాట వరంబను నొక్కపల్లె కింపొదవగనేగ...,,

కాటవరమనునది శ్రీశాస్త్రులవారి నివాసస్థానము శ్రీవారిటీవలఁ జాలకాలముక్రిందట రాజమండ్రి ప్రవేశించిరి.——

(మఱికొన్ని పద్యములు.)

తే॥ గీ॥ అచట శ్రీపాదవంశజుఁ డనఘమూర్తి, కృష్ణమూర్త్యాఖ్య సుకవివరేణ్యు నొద్ద, మొదలిడి కుమార సంభవమునను రెండు, సర్గలుపఠించె మూడుమాసముల కెలమి,... తే॥ గీ॥ గురువుఁ దత్సహపాఠియుఁ గూడితఱుచు, 'నాడుచుందురు చదరంగ మట్టియెడల, లక్షణంబెట్టు లట్లు తల్లక్షణంబు, నితఁడు గ్రహియించె నాదరమెనక మెసఁగ.... తే॥ గీ॥ అంత మేఘ సందేశ కావ్యమును మొదలు, పెట్టి చదువుచు నున్నంత విఘ్నకార, ణం బుదయమందెఁ దత్స్వరూపంబు దెలియఁ బలుకెద...,, చ॥ -- గురునింతి మృతింగనె నాత్మదేహమం, దొదవె నొకించుకంత జ్వరరోగము, --- గురునికిఁ వచియించి యానమాఖ్యపురముం జనెఁ దల్లిని దండ్రినింగనన్,....

నైషధము శ్రీశాస్త్రులవారివద్దనే కాదు మఱియొకరియొద్దఁగూడ నిప్పటికిని వెంకటశాస్త్రి చదువనే లేదు ఇంక ముందు చదువవలసియుండును, ఆయాయంశములకు శ్రీ శాస్త్రులవారే సాక్షులు, శ్రీశాస్త్రులవారు వెంకటశాస్త్రిని కృతఘ్నుఁ డనియందురో యే మందురో 57 వ పుట, 11 వ పంక్తి లోని గాడె జగన్నాథస్వామిగారి పద్యములోఁ జూడఁ గోరెదము, గీరతప్రథమభాగమున 27 వ పుటలోని సీసపద్యమునఁగూడ శ్రీశాస్త్రులవారి విషయము కొంతకలదు. చదువఁగో

రెదము, అథవా, శ్రీశాస్త్రులవారికి వెంకటశాస్త్రి కృతజ్ఞుఁడు గాఁడు, అంతమాత్రమునఁ దమకేమి లాభము. అతఁడే రౌరవాదినరకముల కర్హమై పోవుఁగాక, అతనిత్రోవ నింద్య మని యెఱిఁగియు వీరేల పట్టవలెను.

'యాన్యస్మాకꣳ సుచరితాని' తానిత్వయోపాస్యాని. నో ఇతరాణి.

అని చెప్పిన వేదవాక్య మేరెఱుఁగనిది, అతనిమంచిని గ్రహించినచోఁ దమ్ము లోకము మెచ్చునుగాని యందులకుఁ బరాఙ్ముఖులై యతని చెడ్డను గ్రహించినఫలమేమి, ఇది యిటులుండుఁగాక, ఇఁక వీరిగీరతవిమర్శనపుశైలి నించుక ప్రదర్శింతము.

'గీరత' శబ్దము సాధువుకా దని కొంత చర్చ వ్రాసి దూషించిరి, అది పండితులు చేయవలసినది కాని జ్ఞానలవదుర్విదగ్ధులెల్ల దానికి నధికారులు కారు, వీరు జ్ఞానలవదుర్విదగ్ధు లనుటకు వారి "శతఘ్ని"యే మొదటిసాక్షి, ఈవిషయమును దెలిసికొనఁ గోరువారు పాశుపతమును జదువఁ గోరెదము, పాశుపతమే యక్కఱ లేదు. వీరొకకవితాపత్రికలో నెవరో మేజస్ట్రీటుగారు కాళిదాసకృతమగు "శృంగారతిలకమును" దెలిఁగించి రని వ్రాయుచు వారివద్దెములను మెచ్చుటకుఁగా మా 'రసికానందమును, దెగఁ దిట్టి మొదలిడి కొన్ని పత్రికలు దానితోడనే నించి కాలక్షేపము చేసిరి, అందెన్నో యసంగతప్రలాపములను వాలిడిచిరి, దిఙ్మాత్ర ముదాహరించుచున్నారము.

ఉ॥ రాతిరి మబ్బుచేతఁ దిమిరమ్మధికమ్ముగ నుండె, వ్యాప్తి మై! నాతత
కష్టుఁడై పతిరయమ్మున నిద్దురవోయె దొంగలీ । రాతిరి యూరుచొచ్చిరి కరమ్ము
ను ఖాలనుగాన నెంతయుఁ । భీతిలుచున్న దాన నిఁక వేగమె నిద్దురమాను
పాంథుఁడా?. (రసికానందము)

పైపద్యమును విమర్శించుచు నందు "రాతిరి" అనుపదము రెండుసార్లు వాడుట తప్పని వెక్కిరింపఁ జొచ్చిరి

(వసంతతిలకము).

ఈబాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నుఁ, నాబంధులందఱు మనంబున నేమిసనారే, ఈబాలు సూర్యనిభు నిట్టులపెట్టిపోవఁ, గాబుద్ధి పుట్ట దని కన్య మనంబులోనన్ —భారత - ఆది - ౫-౮

దీనింబట్టి యట్లు వాడుట భారతసమ్మతమని స్ఫుట మగుచున్నది. ఇంత స్వల్పవిషయమును గనిపెట్టని వీరు పెద్దపెద్ద విషయములలోనికి దిగుట 'క్షట్టి

కెగుర లేనియమ్మ స్వర్గమున కెగురుటవంటిది. గాన వీరి విద్యావిషయక మగు శంకల కిట నుత్తరము లిచ్చుటకుఁ బ్రారంభించి కొన్నిపుటలు వమ్మొనర్పఁ దొరఁకొనము. అదిగాక గీరతమువలనఁ దమ నెత్తినిబడు సంశములేవియొ వానిని ఖండించుకొనుటకన్న శబ్దవిచారమేమి ముఖ్యము, కృతఘ్నత్వమును గాని యసత్యతత్పరత్వమును గాని లేకుండఁ గాపాడుకొనఁ బ్రయత్నించ వలయునే కాని యా శబ్దము బాగులేదు, అంపలియుత్తరములు వ్రాసినవారు 'తి॥ వెం॥ కవులకు బందుగులు' మఱియుం గొందఱు స్నేహితులు లోనగు నపలాపములవలన ఫలమేమి, ఒకరిద్దఱు మువ్వురు లేక నలుగురైదుగురు వెం॥ శాస్త్రికి బందుగులే యగుదురు గాక వారువ్రాసినవ్రాఁతలో నున్నవిశేషమేమి? వెంకటశాస్త్రికిఁ బిచ్చియెత్తిన దని యెవరేని ప్రచురము చేసినప్పుడు దానింగూర్చి క్షేమసమాచారము తెలిసికొనుటకు వ్రాయువారు బందుగులు కాఁగూడదా? అంతమాత్రమున నందలియుత్తరములెల్ల బందుగులవియు స్నేహితులవియు నని బొంకినఁ బోవునా? మఱికొన్ని.

“తమంతఁ దామే కల్పించినవి”

యని కూడ వ్రాయ మొదలిడిరి ఈమాట కర్థమేమైనఁ గలదా? అట్లుకల్పించినచో నయ్యైవార లూరకుండుదురా? ఈత్రోవ కొప్పరపుఁద్రోవ, దీనింగూర్చి గుంటూరిసీమ, ఉత్తరరంగపీఠిక చూడఁదగు ఇట్టివే యనేకములు ప్రల్లదములందుఁ గలవు, ద్విభాష్యం పుల్లకవిగారు వీరియం దభిమానముకలవారా? కారా? ఆయన వ్రాసినయుత్తరము నీగురుదక్షిణలోఁ బ్రచురించితిమి. 52 వ పుటలోఁ జూడఁదగు. ఆయనకు వీరియందుఁ గలయభిమానము స్ఫుటీకరించుచున్నారము

(కవితాపత్రికనుండి.)

క॥ శ్రీవేదమూర్తులై తగు, శ్రీవేదుల రామకృష్ణశేఖరునకుఁ, దద్యాఖ్యుకుఁ డొలేట్యన్వయుఁ, డా వెంకట రామకవి సదంఘ్రిద్వయికిన్॥౧॥...మ॥ ఒకచో ముద్దులు మూటఁగట్టు నొకచో నొయ్యారముల్ చూపు నిం, కొకచో మంజులశయ్య లందు నొకచో నుత్సాహముల్ పెంచు నిం, కొకచో నిండు నలంక్రియాదులను; బ్రాజ్ఞుల్ సంతసింపంగఁ గొం, కక రాజిల్లెడు రామకృష్ణకవితా కళ్యాణలీలాగతుల్॥......

యిట్లువిధేయుఁడు

ద్వి॥ పుల్లకవి, దుర్గాడ. 22-9-1910.

ఈయనకట్లు మనమేల వఱిగి పోవలెనో? యోజింపుఁడు. తా మొనర్చు దురుద్యమదుష్ప్రసంగాదికములు తల్లివెనుకఁ దల్లి యనఁదగిన పెద్దతల్లిలోనగు

వారికే రుచింతనియప్పు డితరబంధువుల కెట్లు రుచించును, ధర్మముబంధుత్వాదికము ననుసరించునది కాదుగదా, ఈ పుల్లకవిగారు వెం॥రాల భావిప్రయత్నము ను గూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

30-7-1913.

......తే॥ గీ॥ గిరతమ్ము విమర్శించు గిటిప్రియొకటి, వెలువడుచు నున్నయది దాని వెనుకనుండి, నిజవిశేషమ్ములను గని నెగడవచ్చు...కుకవి కాండ వేదండఖండవిఖండనాథ్య.

ద్విభాష్యం పుల్లకవి,

గోదావరి, డి॥ పిఠాపురం, డి॥ దుర్గాడ.

---

ఇదియిటులుండె, మాశిష్యుని పెద్దతల్లు లిరువురు, వీరుకడుధర్మతత్పరురాండ్రని మాబంధువులెల్ల నెఱుఁగుదురు, ఆయిరువురలో నొకరికావ్యదయము పత్రికృతవిషయమున ననంతుష్ట మని కనిపెట్టఁబడినది, అందులకు సూచకమగులేఖ 86 వ పుటలోఁ గలదు, అది వారిసౌహార్దమునే తెల్పునుగాని తక్కినవిషయములను దెల్పదు, దానింబట్టి తక్కినయంశము లెఱుఁగుదురుగాక, దానినివ్రాసిన కాఁకరపర్తి నారాయణమూర్తి మాశిష్యునికిఁ బెదతల్లి కుమారుఁ డని యెఱుఁగఁదగు, వేఱొక పెద్దతల్లిగారి తీరని ప్రకృతోద్యమమునకు మొదలేనమ్మతింపరు గాని ఆవిషయమున నేమిట వ్రాయనాధారములులేవు. ఆధారమే యక్కఱలేదనుఁడీ, ఏమాత్రమేని మనస్సునది యొకటి యుండెనేని కృతఘ్నత్వ దోషము నది యెవ్వరినిగాని నంతసింపనీయదు కాన వారు వీరననేల, మాశిష్యుఁడు కృతఘ్నుఁ డేయగునేని యిటఁడొనర్చుపనులు మనుజజన్మమెత్తినయేరికిఁగాని యసహ్యములు గాకపోవని చెప్పసాహసించుచున్నారము. అదియటులుండె.

---

(1913 సం॥ అగస్టు 27వ తేదీ ఆంధ్రపత్రికనుండి.)

ఆంధ్రచంపూభారతము.

ఈ గ్రంథమిపుడు కవితాపత్రికయందు ముద్రితమైనది. పిఠాపురసంస్థానకవు లగురామకృష్ణకవు లీగ్రంథమును సాదరంబున తమకవితలో బ్రచురించుటచే గ్రంథోత్కృష్టత చాటుచున్నది...,, (తిరుమలవెంకటరమణకవులు).

పైపంక్తులవలన నాకవులకు వెం॥ రా॥ లయందుఁ గొండొక ప్రేమకల దని విస్పష్టమే, వీరు మాకడకంపిన పద్యములను 58 వ పుటలో ముద్రించి యుం

టిమి, వీరికృతఘ్నతాదుల విషయమున వారికింగలయోపము నవి పూర్తిగా వెల్లడించితిని, సారమేమనఁగా వీరి వాక్పారుష్యాదికమును బట్టి బంధువులేమి లోకులేమి వీరిని మందలించు తలఁపుగలవారగుచున్నారు. శ్రోతలేక వారిని వీరు మూఁడు మిత్రులుగ నవలాపించి తన్మూలమునఁ దమకు శత్రుత్వమును సాధింపఁ జూచుచున్నారు.

(కవికర్ణరసాయనమునుండి.)

క॥ కాకేమి తన్నుఁ దిట్టెనె? కోకిల తన్నేమి ధనము కోకొమ్మనెనే, లోకము పగ యగు పరుసని, వాకునఁ జుట్టమగు మధురవాక్యము కలిమిన్.

మాశిష్యుల పరిస్థితి వైపరీత్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. మొదటఁ దా మవలంబించిన పికత్వమే కాకత్వముగాఁ బరిణమించుచున్నది. దానిని వారింప నెవరితరము? ఇతరకారణములచే శత్రువులగువా రిట్టివట్టుల నేవేని యప కతవకలు తమ్మనుగూర్చి వ్రాసినచో నవి త్రోసివేయ నగును గాని యట్టిది లేశమును లేనివారు శత్రువు లగుచుండఁగా వారించుట యెట్లు? ఈవిషయమును సమర్థింపఁదగు సంశములు పెక్కులున్నను దిఙ్మాత్రము సూచించి వదలితిమి. వీరికి గురుద్రోహ మనిన బెల్లమునుంగాడు. ఇది మాయెడలమాత్రమే యనుకొనుచుంటి రేమో? అట్లు కాదు, సార్వత్రికము, దీనిని సూచించి వదలుచున్నారము.

“భగీరథశాస్త్రులుగారు, వీరు సత్తములు,...యీయన యింజరములో నున్నప్పుడు భారద్వాజఘట్టములోని విశేషములు తెలిసికొనుటకై వెంకటరామశాస్త్రిగా రాయన యొద్దకు వెళ్లినమాట సత్యమే”

ఇది కృష్ణకవివ్రాఁత, చదువుకొనుటకు వెళ్లెనన్నచోఁ బరువు దక్కువ యని యెంచి కాఁబోలు, “విశేషములు తెలిసికొనుట” కని వ్రాసి పావఫుబంది తోల మొదలిడినాఁడు, ఒకవిశేషము మాత్రమున్నది, కృష్ణకవివ్రాఁత నాఁగఁ జాలకున్నను వెంకటరామయ్య తానుగూడ నిందుఁ జేవ్రాలు జేయకుండుటచేఁ గొండొక సంశయింప వలసి యున్నది, ఈగిరతవిమర్శన ప్రకరణమేమి, అట్టిహీన మేమి, కృష్ణకవిగారి వ్రాలుమాత్రమే కలవి యని చదువరు లెఱుఁగరే యున్నారు, ఆయనయొద్దకు విశేషములు తెల్పుటకై వెళ్లినట్లు లిఖించినను లిఖింపఁ గలసాహసి సుండీ కృష్ణకవి, అతని కసత్యమువలన లవమును భీతి లేదు, ఈ యంశము శృంగభంగాదికము వలనఁ దెలిసికో వచ్చును. అతనికి దీటు[illegible]వాఁడు

చర్లచలపతి; అతఁ డతని బావమఱఁది, అతనింగూర్చి వ్రాసినచో మాలేఖిని కెంతేని పనిగలుగఁ గలదు, 'యతో వాచో నివర్తంతే' శ్లో॥ కథాపీఠులు... ఆశ్రియ సేయతః,, ప్రకృత మనునరాముః, భగీరథశాస్త్రులవారి యొద్దఁ జదివికొన్న సంగతిసుప్పికొన్నచో నావిద్యాభ్యసన కాలము ప్లవంగ సంవత్సరమగుటచేఁ దదనంతర భావియగు కీలక వత్సరములోనే వ్రాసికొన మొదలిడిన

ఉభయశాస్త్ర ప్రవీణత్వము,

ప్రతుకఁడు, ఇందునుగూర్చి గీగత ప్రథమభాగపీఠిక ౧౮ వ పుటలోఁ గొన్ని పంక్తులు చదువఁగోరెదము, దానిని బ్రతికింప వలయునని భగీరథశాస్త్రులవారి శిష్యత్వమును బృచ్ఛకత్వముగా మాకృష్ణసుకవియపలాపింపఁ జూచ్చెను, తన బావమఱఁది యగు చర్లచలపతి పెద్ద పండితుఁడని లోకమునకుఁ దెలియునట్టి కృష్ణశాస్త్రి కొండొక యపలపించెను. ఆసోదెవలననితనికిఁ బ్రయోజన మెంత యున్నది. "శృంగ భంగ" "సత్యసందేశముల" కవిత్వము తనదికాదని లోకము విశ్వసించుటయే దానికి ఫలము, ఎన్నియని చూపుదుము. ఇతఁ డసత్యమునకుఁ బుట్టినిల్లు. భగవంతుఁడును, దజ్ఞులును, ఇందులకు సాక్షులు, ఆచలపతి వ్రాఁత కీతఁ డిట్లు వ్యాఖ్యాన మొనర్చుచున్నాఁడు.

"వెంకటశాస్త్రిగారి బండారమెంతో కృష్ణకవి తేల్చుననియు, నాపిదపఁ దిరుపతిశాస్త్రి వెంకటరామశాస్త్రులుగార్ల సంగతి చూచుకోవచ్చుననియు నందు గల యర్థము యథార్థమని ముమ్మాటికి వారు విశ్వసింతురుగాక."

("రాను రప్పింపఁ బనిగాన రాదు మాకు")

అను సప్రస్తుత ప్రశంసావాక్యము నెఱుఁగనిలోకులు దప్ప నీవ్యాఖ్యానము నెవ్వరు విశ్వసింతురో.

ఉ॥ వేదుల రామకృష్ణులఁటే వెంకనసంటే జయించునంటే యెం, దోచి చరితంపుబండి నొగిఁ దోలెడిసాహసమందు; నింక నెం, దోచి దుడు కంఠిశాప్రిని పయిఁ దోఁపక మి న్గనుటందు, నింక నెం, దోచి దెలియంగరాద యది యొక్క౯టియే పథ తేల్పఁగా వలెఁ"

అది యటు లుండె, పాపము! ఆచలపతి *క్షమాపణపాత్రిసికొని నిర్దోషి యగుటకుఁ బ్రియత్నింతఁగా మరల నాతని నితఁడు దోషదూషితుని జేయఁజూచ్చెను జూచితిరా?

---

* క్షమాపణ, ఇది నింద్యగ్రామ్యమని వెం॥ రా॥ లతతఘ్న. శ్లో॥ క్షమా

"చర్ల వెంకటాచలపతి శాస్త్రి, యను నతఁడు నాకు బావమఱఁదియే, ... యితఁడు వ్రాసినట్లుగా వెం॥ శాస్త్రిగారి ప్రోత్సాహముచే నచ్చటి విద్యార్థులలో నెవ్వరో వ్రాసిరి"

వెంకటశాస్త్రిగారి ప్రోత్సాహ మఁట? దానిపై నచటి విద్యార్థు లెవరో వ్రాసిరఁట? ('వృక్షతాడనాద్దన్తభంగః') అన్నట్లిట్లు వ్రాయు నీతనిఁ దణ్డాలు పండలింప వుండుట కడు నయశస్కరము, తర్కనయసత్వములును బ్రగల్భములును నటులుంతము, ఈ విషయము నేని ధ్రువపఱచుటకు నితఁడు సభలో మా యెదుటికి రాఁగలఁడేమో మా చదువరు లడిగి తెలిసికొందురు గాక యని హెచ్చరించుచున్నారము. అక్షమాపణ చలపతి పేరితో నితరులే వ్రాసినచో వారిని శిక్షింపఁ జేయుట యుక్తము కదా? నేఁడు చలపతి పేర నిట్లు సృష్టించినవారు మఱి యొకప్పుడు రామకృష్ణుల పేరనే వేఱొక క్షమాపణను గాని, నోటును గాని మఱి యొకటి గాని సృష్టింప వచ్చును గదా? కావున నిట్టివట్టిపల నౌదాసీన్య ముచితము కాదని కృష్ణకవికిఁ దెలుపుదురని చదువరులను మఱిమఱి హెచ్చరించుచున్నారము. ఇట్లే 'ముఖమస్తీతి వక్తవ్యము'గాఁ గొంత సోది వెళ్లఁబెట్టెను, దానినెల్ల నూఁచకోఁతగా ఖండించినఁ బ్రయోజనము లేమి నింత విస్తరింపమైతిమి,

"అట్టియుత్తరములు మాయొద్దఁ గోటాన కోట్లు గలవు".

ఎట్టియుత్తరములు? గీరతములో, తి॥ వెం॥ కవులు ప్రచురించినట్టి యుత్తరములవంటివి, ఎన్నియున్నవి? కోటానకోట్లు? పదులు గావు, వందలు గావు, వేలునుం గావు, లక్షలును గావు. కోట్లును గావు, ఇఁక నెన్ని? కోటానకోట్లు? అబద్ధమాడినను నింతబట్టబయలుగా నాడవలయును గాఁబోలు; పోలు? పోలు? కోటాన కోట్లగుఁగాక, అర్బుదములగుఁగాక, కృతఘ్నత్వము సుగుణమని వ్రాయు పెద్దమానిసు లెడదొరకుదురో? అయశమును బోధింపనియుత్తరము లేమి పనిచేయును? లేదా, శిష్యత్వము నేని యాయుత్తరము లపలాపింపవలెను, ఈ రెంటికిని దక్కినయంశముల నెన్నిటిని వానివలన సాధించినను బ్రకృతమున కవి లవ

---

పణైకపదయోః పదయోః శతశిప్రియే (రసగంగాధరము) ఇందులకుఁ బాసు[illegible] కూడఁ జూఁడఁదగు, ఆయీనమర్థన పెల్ల "గుజినీపుస్తక"ములలోని పొరపాటుల[illegible] లన నైనట్లు వావిడుచు మాశిష్యులను సభాస్థానమునకు రప్పించుచూ 'రిశ్రాల[illegible] మ్మన లేకుండుట కడువిచార్యము అప్పుడుగదా నిగ్గు తేలును.

మును నుపయోగింపవని యేమి వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు, ప్రధానవిషయ మును వదలికొని యప్రధానవిషయములకుఁ బాటుపడు వీరిప్రచారము వలన నీక్రిందిలోకోక్తి స్మృతికివచ్చుచున్నది.

“జగతి శిరశ్ఛేదనసమయమందునఁ దనకుండలమ్ముల యాన గొనెననంగ”

(యామినీపూర్ణతిలక.)

వీరు ప్రచురించుసుత్తరముల స్వరూప మొక్కింత చవి చూపి విమర్శించుట ప్రస్తుతము కాక పోదు గాన దిఙ్మాత్ర మట్లొనరించుచున్నారము.

(కవితాపత్రికలోని యొక యుత్తరము నుండి.)

(1) “...రసికత్వలోపమునకు జడిసి మానసముల బెంచి కవిత్వమున మాపరాక్రమమునకుగా నుంచితి మన్న నెవరు సహింతురు...”

ఇతరులు సహింపకుందురుగాక, దానికిఁ దగినఫలముంగూడఁ గాంతురు గాక, శిష్యపరమాణువులు సైఁప కుండుట తప్పగదా? అంత రుచింపనిచో లోలోఁ బరితపింపవలెఁ గాని.

“మీనమ్ముల్ పొలివెట్టి”

అని సత్సభలలో వెక్కిరింపు మని యేవివేకి బోధించును? పైఁగా నెవరో కొంటెతనముగా వ్రాసిన “రసికత్వలోపమునకు” ఇత్యాదియొకసక్కెపు మాటలను శిష్యులు ప్రచురించుట తప్పు గా దని చెప్పవా రెవరు, ఇంతకు నిద్దానివలనఁ దమకృతఘ్నత యేమి నివర్తించినది.

(2) “మీ రింకను గొంతకాల మోపిక పెట్టిన లోకము మి మ్మాంధ్రకవిసార్వభౌము లని యభినందించును”

ఆవ్రాఁతకన్న నీవ్రాఁత యుక్త మన వచ్చును, ప్రసిద్ధులెల్లరు క్రమక్రమముగా గతించినపిదప వీరినే యట్లు గౌరవింపఁ దగ్గకాలము రావచ్చును “దొడ్డెఁదు ... దొంగలు దోలుకొనిపోతే...గొడ్డు ...శ్రీమహాలక్ష్మి” యనునుగదా, ఆభవిష్యత్సార్వభౌమత్వమునకు మొట్టమొదట వీరొనర్పవలసినప్రయత్నము గురుద్రోహమే యగునోటుని? అందులకా యుపూనిక, బాగుబాగు? 1, 2, అంకెలు గుఱుతుగాఁ గల వాక్యములకు స్థానభూతమగు నుత్తరమొక్కటియే గాని,

అదివ్రాసినవారు మాత్ర మిరువురు, అందులో నొకరు బ్రాలుతుదను 'గారు' అని తగులుకొన్నారు, అదికూడ మామీనమువలెనే యుండులకో తగులుకొనిన ట్లూహింప వలసినదే, ఇంతటి తెల్విశేటలు గలవా రేమి వ్రాసినను వ్రాయుదురు, అట్టివారి పేరుల నిందేల ప్రచురింపవలెను. వలయువా రన్యత్ర చూడఁ గల రని యుపేక్షించితిమి.

(3) "గిరతము నేతిబీరకాయగా భావించుకాలము రాకపోదు.

ఈవాక్యముగూడ, ఆ॥ "గారి" గారిదే, వీరభోగవసంతరాయఁడు పుట్టఁగలఁ డని చెప్పనట్టియవ భవిష్యద్వృత్తాంతమును దెల్పి రామకృష్ణుల సూదార్పు పరామర్శించుచున్నట్లు వాక్యముల శైలి చెప్పుచున్నది, పరామర్శించువా రెంతో యాప్తులుగ నుండవలయును. కావున మా వెం॥ రా॥ లిట్టివారియుత్తరములను బ్రకటించుకొనుట స్వవచోవ్యాఘాత మని చెప్పక తప్పక వచ్చినది, మఱియు నిం కెవరో మాకాప్తులుగా నుండువారే యొకసందర్భమున.

"పిచ్చిపుల్లయ్య"

మాల్ అని వెం॥రా॥లకు వ్రాసిరఁట? ఆ వ్రాఁత యితరోద్దిష్టమైనను నయ్యది యెట్లో సోదె కీ సొకరికి సందర్భించునఁట? దానింబట్టి వీరి కేమి ఫలము కల్గెనో కాని యాదనుకొంటిఁ ంత వెళ్లఁబెట్టిరి' ఆయీయనుపయోగ పరితాపమెల్ల నేనందర్భమునందల్లి లోనిది, కా ని? మా 'పాశుపతమును, ఖండింపఁ బోవుటకు వ్రాయను పోద్ఘాతము వలసిన గ స్త్రమ్ము నుపయోగించుటకు వీలులేనియప్పుడు తా మింతకన్నఁ జేయ ర్థము, ఏమి "క్తి కర్యాంతర ముండఁ బో దని యాసోదెకుఁ దాత్పర్య మనునది యావద ఎవరో "పి చ్చిపుల్లయ్యయో యేదియో వ్రాసెను, దానిని ఖండించుట యుక్తమో? యుక్త మే "పిచ్చిపుల్లయ్య" అనిరి గాన మేమును 'పిచ్చిపుల్లయ్య' అనియందుమనునది లు, లేద నా విజ్ఞులకు నొకరు తెల్పవలసి యుండునా?, అదియటులుండె, వెం॥ రా॥ దమయజ్ఞతను నిరసించువారి నెల్ల నేనంబంధము లేకున్నను మాకు మిత్రులను గా నపేక్షించుచుఁ దమకు శత్రువులుగా భావించుచున్నా రని యింతకు ముందే ప్రసంగించి యుంటిమి, అందులకేఁక నొకయుత్తర ముదాహరింపఁబడుచున్నది.

"వెం॥ రా॥ కవులు మేము అశ్వమేధమున పద్యములు ప్రకటించితి మను పరాభిప్రాయముతో కవితాపత్రిక వెనుకటివలె రు 1—0—0 కి పంప మనియు

పూర్తి వెలకు గాని పంప వీలు కాదనియు వ్రాయించిరి. ఇంతకన్న మమ్ము వీ రెవిధమున సాధింపఁగలరో..." శేషాద్రిరమణులు (సోదరులు)

తమయకృత్యముకతమునఁ దమవలని లాభమునుగూడ గణింపక తమమిత్రులు తమకు శత్రులగుచున్నా రనునంశమున కింతకన్న దృష్టాంత మేమి కావలయునో? ఎవరో——

"భంగుమేదుత్తూరులు"

తప్పనుజనులెల్లరుఁ దమయకృత్యమున కేవగించుకొనువారే కద, 61 వపుట 35 వ పంక్తిలోని చామర్తి జగ్గ రాజు తమకెట్టిబంధుగుఁడు, అతనికిగీరతమునం దాసక్తి యుండుటకుఁ గారణమేమి, పైఁగా నితఁడు, వెం॥ రాలకు, సహాధ్యాయి, బ్ర॥ శ్రీ॥ మధునాపంతుల సూరయ్యగారివద్ద వీరు మాగురును గాళిదాసత్రయమువఱకో, అంతకొకింత తక్కువగనో చదివినవారలు, అట్టిచో నతఁడు గీరతమునభిలషించుట కర్థమేమి? అంతకన్న నెక్కుడుగ వారియాత్మబంధువు లేమి వ్రాయఁ గలరు,64 వ పుటలోని15 వ పంక్తిలోని ఆకొండి సుబ్రహ్మణ్యముగా రెంతమర్యాద కలవారు,ఆయన మాశిష్యుని పెదతల్లికుమారుఁడగు బ్ర॥శ్రీ ఆకొండిరామమూర్తిగారికిఁ బినతండ్రి, అట్టివారెల్ల మాగీరత కావ్యము నేలయాదరింతురో?,63వ పుట 24వ పంక్తిలోని, ఆకొండివెంకటశాస్త్రిగారు, దూరదేశస్థులు, మాయుభయులకునుశాఖామాత్ర బంధువులే కాఁదగువారు, బాగుగవిచారించినచో బ్ర॥ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రులవారికి దూరపుజ్ఞాతులేని కాఁదగువారు, వారినిబట్టి వెం॥ రా॥ లకే బాంధవ్య మెక్కుడనక తప్పదు, వారు మా 'గీరతము' నందేల ప్రేమ చూపవలయునో?, ఇట్టివారికెల్ల నేదో 'పక్షపాతిపదమునో' మూర్ఖపదమునో, నివేదించి తమమార్గమును దాము వదలక మాకుఁ బనిగల్పించు మాశిష్యుల నెవరు సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలుగుదురో కదా, వీరెల్లరును మాయొద్దఁ బుస్తకములు వెలలేకుండ సంగ్రహించుట కట్లువ్రాయుచున్న వారలఁటే? ఆమాటకే యొప్పికొందము, తమవద్ద నట్టిలాభమును బొందువారుమూడఁ దమమార్గము నేల నిందింపవలెనో? నరము లేనినాలుక యెచ్చవచ్చినట్లుదిరుగును, అంతియ కాని ప్రాజ్ఞులగువారు మాలికి వినమెన్నఁడును వ్రాగరు, అందులో నొకపుస్తక మూరకవచ్చునంతలోఁ గలుగు ఫలమెంతటిది, అదిగాక

వెం॥రా॥ ల, గీరతవిమర్శనమునకుఁ గృష్ణాపత్రిక చూడఁదగు.

# XVI

'అపుస్తకమును "శుక్రవారి పిండి" గాని రసవత్తరమైనది కూడఁ గాదుగదా, అట్టిపాడు కాగితపు చెత్తకట్ట కాసించి యేప్రాజ్ఞులుగాని తమ్మును గర్హించి మమ్ము నర్హించుచున్నారని వ్రాయుట స్వవచోవ్యాఘాతము గాక మఱియేమి, దాని తత్త్వమిది. ఎవరుగాని పాపకార్యమునకు ననుమోదకులుగా నుండవెఱతురు, పుణ్యకార్యమునకో? నిస్సంశయముగాఁ దోడ్పడుదురు, ఇందు లాభాలాభముల కించిత్కరములు, అదిగాక, స్వల్పలాభములతోఁ బనియేమి, వారలకు మహాలాభ మొకటికలదు, అది పుణ్యపాపసంపాదన రూపము, దేనిని గోరువారు దానికను మోదకు లగుచుందురు.

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః,

ఇంతతో నీవిషయము ముగించి విషయాంతర ముపక్రమింతము. చదువరులారా! వీరి "కోకిలకాకము" మునకై యేము వ్రాసిన పద్యములకుఁ బరిమితియే లేదు. కాని నానాఁటికి వీరి గోలనుండి విరమింపవలెనని యూహాపోహముట ..నను, సత్యమిదివఱకే ప్రాజ్ఞలోకమునకు విస్పష్టమయినట్లు వారి వారి లేఖల

మూలో మా మదికిఁ బూర్తిగా వచ్చుటవల్లను, జాలపద్యములను దిగవిడిచితిమి,

సోదె కి ..గాన్ని మచ్చుచూపుచున్నారము.

దనుకొంటి

లోనిది, శా..గునే వికస్వరపికస్వర మంటివి, వారిదార్భటీ

వలసిన గ..తాంతరంబగు నభస్సు "గుభాలు గుభాల్ గుభాలు" మం

ర్థము, ఎ..గ విద్యుదుద్యదను లుల్లసిలం గరుసౌనొ? సారెకుఁ

ఎవరో "..సనో? పికధ్వని కపిధ్వనియై తలక్రిందు లాడునో?"

యుక్తాపార్యంబది యున్నయంచుఁ దెలిపెఁ గాకీ పికత్వ, మ్మిదే

లు, ..ం, బెకబెకడనేర్చి తీయనృతవాక్తత్త్వంబొ? బెవంబిచ్చెనో? నీ

..ంభో వాహావిహార ఘోర విపుల వ్యాహార బాహుళ్యది

కుంభి శ్రీవతి ఘీంకృతుల్ వినియు మీ "కోకో" ధ్వనుల్ నిల్పునే.

మ॥ నభలో లేవడు పావకున్ గళము, తత్ప్రాపనంబు మహార్హామం

ప్రభమై తెచిన వెంటనే తపులు దుర్వారం బవధ్యాన దూ

రభసం, బయ్యది నిల్వనీయదు సుమీ? ప్రాజ్ఞశ్రీవాంనిష్ఠ సా

రభ సౌభాగ్య వరంపరాగ్రహణ మాత్రి స్వైర సంచారులన్,

క॥ కమ్రనఁగ శిరము, కుకవుల కమ్రనియను కొందమాని "అకవియనఁ గొ
టిల్యమ్రపరు గతి యగుఁగా ది, ద్దిమ్రని కుకవితలదిమ్ము దింపుట తేలెగా.

---

కవిత్వపుఁ బోలికకు నుదాహరించితిమే కాని పైపద్యములందు నూతాంశము లెవ్వియు లేవు. మాశిష్యులను గృతఘ్నతాఘము నుండి తప్పింతమనియు, దానివలన నితరులట్టిత్రోవ తప్పని తెలిసికొందు రనియు, మే మీపనికిఁ బూనితిమి కాని క్రమముగా వారది బలపఱచుకొనుచుంటచే నింతవఱకు మాపరిశ్రమకు సార్థక్యమే కనుపట్టదు, వీరివిషయమున నింక నొక రహస్యము తెలిసికొన వలసి యున్నది, వీరికిఁ జెడ్డమంచిగను, మంచి చెడ్డగను గోచరించుచున్నట్టు మఱికొన్ని వీరి వ్రాఁతలు బోధించుచున్నవి, వీరికి వ్యాసకృతభారతము తప్ప, ధర్మరాజపాతృఁడు, దుర్యోధనాదులు పుణ్యాత్ములు, ఈ యంశము వీరుప్రచురించిన "కౌరవ గౌరవము"లోఁ జూడఁదగు ఈ విపరీతజ్ఞానమే వీరు సర్వత్ర వినియోగింపఁదగువారు, దానిచేఁ గృతజ్ఞుఁడు మహాపాపాత్ముఁడుగను గృతఘ్నుఁడు మహాపుణ్యాత్ముఁడుగను గోచరింపక తప్పదు, వీరికీవిషయము ప్రకృతముగదు ముఖ్యము, కావున వీరు భారతమును వదలుకొనక తప్పదు. అది గురువును నిందించుట కొప్పదు.

(మహాభారతశాంతి పర్వమునుండి.)

భీష్మః॥ శ్లో॥ మాతా పితోర్ద్గురూణాంచ పూజా బహుమతామమ,...గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః, ఉభౌహిమాతా పితరౌ జన్మనేవోపయుజ్యతః,...ఆచార్య శిష్టాయాజాతి స్సాదివ్యాసాఽజరాఽమరా॥ శ్లో॥ విద్యాం శ్రుత్వా యే గురుం నాద్రియంతే, ప్రత్యాసన్నా మనసా కర్మణావా, తేషాం పాపం భ్రూణహత్యా విశిష్టం, నాఽన్యస్తేభ్యః పాపకృదస్తిలోకే,...శ్లో॥ మాతృతః పితృతశ్చైవ తస్మాత్పూజ్యతమో గురుః,...శ్లో॥ మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య గురుఘాతినః, చతుర్ణాం న్వయ మేతేషాం నిష్కృతిర్నానుశుశ్రుమ.

(విస్తరస్తు తత్రై వద్రష్టవ్యః)

గురుశిష్య ధర్మబోధకము లగు మఱికొన్ని శ్లోకములు 32, 80, 81, 82, 83, 84; పుటలయం దుదాహరింపఁబడి యున్నవి, ప్రకృతము మాశిష్యు లవలం

# XVIII

బించినది గురుద్రోహయజ్ఞ దీక్ష, దానికి వ్యతిరేక మగుధర్మమును బోధించునది వ్యాసభారతము.

"భారతః పంచమో వేదః"

అని దానిని పూర్వ ప్రాజ్ఞులేమి నవీనవిజ్ఞులేమి శిరసావహింతురు గాక, ఇతరపంచమవేదములయం దభిరుచి నించి తిరుపతి వెంకటేశ్వరాది దేవగురు నిందల నొనరించు వీరి కాపంచమవేద మెట్లు ప్రమాణము కాఁగలదు, కావుననే వారిప్రవృత్తి కనుకూలముగా వేఱొక భారతమును మాశిష్యులు వ్రాసికొనఁ దలఁచిరి.

ఉ॥ వ్రాయఁగ వచ్చువ్యాసముని వర్యుఁడు వ్రాసినయట్టి భారతా, మ్నాయములోనియంశములు మాఱిచికూరిచి వేఱెభారతా, మ్నాయము ... నమ్మరుగాక, పండితుల్" (ఆంధ్రభాషా పరిషత్పత్రికలోని కౌరవగౌరవము చూ.)

ఇంతకు మున్న "తుక్ర—మూతిపిందె', అని మాగీరతమునే వీరు దూషించి నట్లు ప్రథమభాగపీఠికయందుఁ జూపితిమి, ఇప్పటికి వీరికి భారతముగూడ నట్టిదశకే వచ్చినది, ఇంతతో నేమయ్యె, ఇంకను వీరిచర్యలు వీరివ్రాఁతలు ముందు చూడ వలసి యున్నది, పండితులు నమ్మరఁటని కాని లేకున్నచోఁ దలక్రిందు సంగతులతో వీరు వేఱొకభారతము వ్రాయుదురంటని.

శ్లో॥ ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం,,

అని కాళిదాసంతమహాకవి వాక్రుచ్చినది వీరికిఁ దృణప్రాయమే, ఏగ్రంథ ముగాని పండితులమెప్పునకును, అపండితుల తిప్పునకును, నాస్పదముగా నుండఁదగు. ఆయీయంశము ప్రథమభాగ పీఠికలోఁ గొండొక వివరించితిమి, ఇఁక నస్మచ్ఛిష్యావజ్ఞకమగు కృతఘ్న మతమున కనుకూలించు నొకవ్రాఁతయు దానికి మారకమగు నింకొకవ్రాఁతయు నుదాహరించుచున్నారము.

"ఈకాలమునం దొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వ మైనది, ఆతిశ్లే యామ్నాయము లైనవి, భారతామ్నాయముతోఁ దుల్యములఁటని, మూర్ఖులు వానినే యాసక్తితోఁ బఠించుచున్నారు.

ఇటువంటివా రిట్లే వ్రాయుట యుక్తము, ఇతఁడు లేశమును సహృదయుఁడు గాఁడనుట కాఘట్టనందలివే యీక్రిందివంక్తు లుపోద్బలకములు.

“......ఈవాక్యములీ కాదంబరిలోనివి,...ఇవ్విధమున సందర్భము లేనియుప మలయొక్కయు, శబ్దశ్లేషలయొక్కయు, జాబితాలు కొండవీటి చేదత్రాళ్ళవలె ...నొప్పారు కాదంబర్యాదులు...”

---

కాదంబర్యాదులే నీరసగ్రంథము లని తలపోయు జ్ఞానలవదుర్విదగ్ధులకు మాగ్రంథము లేల రుచింపవలెను? రుచింపనక్కఱలేదు. అది యటులుండె, సహృదయులిట్లు శ్లాఘించుచున్నారు.

(సుదర్శినీపత్రికనుండి,)

“గీరతమహాకావ్యములోఁగాని యింటివల గుంటూరిసీమలోఁ గాని యొక్క పద్యమునకు, ఈచదువరి మున్నగువారియుపనిషదుపన్యాసములు తుదకు “అసావాదిత్యోబ్రహ్మ” చేయించుటకైనఁబనికిరావు, మెదడులో నేమాత్రపుగ్రహణపుసిర లున్నను, సమానబుద్ధి యున్నను, గీరతకావ్యము లోని శాంతింపు పర్వములో నొక్కపద్యముఁ జదివి భారతీముక్తిసౌధ మెక్క తరించఁగలరు, లేనిచో సన్నిపాతరోగికిఁ జక్కెరయుఁ జేదే, యెవ్వరేమి చేయఁగలరు?

వా రట్లు నిందించుటకు హేతు వేదో గాని వీ రిట్లభినందించుటకు హేతు విది, భారతము సకలసుకవిజనవినుత మేల యయ్యె, కేవలకవిత్వ ధర్మమును బట్టియా? కాదు, దీనింగూర్చి వ్రాసినచో నింతట సంతటఁ దేలదు, భారతమునఁ బ్రధానరసమేదియో, తెల్పుఁడన నీనాఁ డెందఱో చేతులునలుపవలసినవారు కలరు, స్థూలదృష్టికి నందు వీరరస మేమో ముఖ్యమని తోఁచను వచ్చును, అది యట్టిదియే యగుచో దానికి నేతాదృశగౌరవము రాదు అందలి ప్రధానరసము శాంతము, ఈయంశమునకు,

“...భారతే శాంతిః, రామాయణే కరుణ, ఇతి, ఏవం రసాదిధ్వనయ ష్షడ్విధాః॥

అను సాహిత్యకౌముదియు, మఱియు ధ్వన్యాలోకమును ప్రమాణములు, అట్లు కొన్నిపట్టుల వివాదప్రధానముగా స్థూలబుద్ధులకుఁ బొడకట్టినను, మాగీరతముకూడ శాంతరసప్రధాన మనుట నిర్వివాదము, కావుననే యిది ప్రాజ్ఞులనుతికిం బాత్రమైనది. తదితరులు విద్వల్లోకమునకు సహజశత్రువులు.

(1) శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః” (భారతము.)

(2) శ్లో॥...బుధజన ఇవ గ్రామ్యసదసి, (కాళిదాసః)

ప్రకృత మనుసరింపుదము మాశిష్యులకు సన్మతప్రాకృతగీరతమే కాక వ్యాసకృతభారతముగూడ గర్హ్య మగుచున్న దనునది వికృతాంశము, వీరి కెవరో కొంద ఱనుయాయులుగూడ నుండుట సహజమే, ఏమతమేని యొకరితో నుండుట యెవరును గని వినునది కాదుగదా? అది యటులుండె, వీరిమతమున దుర్యోధనుఁ డెట్టివాఁడు? కడు యోగ్యుఁడు.

మ॥ ... దుర్యోధనుఁడు...గలియంశమ్మునఁ బుట్టినాఁ డనుచు వక్కాణింపఁగాఁ జెల్లునే, (కౌరవగౌరవము)

ఇట్టినిషధయోగ్యుఁ డగుదుర్యోధనునితో వీ రొక్కటఁ దమమతమునఁ గేవలాపాత్రుఁ డగునొకని కభేదము చేసి ప్రకృతసందర్భమునందే కొంత నిందించి యున్నారు, దాని కర్థ మేమో? వీ రపాత్రుఁడనుకొనుచున్న మానిని నిషధయోగ్యుఁడు కావలని వచ్చుచున్నదే? లేదా దుర్యోధనుఁ డపాత్రుఁడగును, విమర్శించుచో వీరితప్పుడు సాక్ష్యపు వ్రాఁతలెల్ల నింతటిసారము కలవియేగద, వీరికిఁ దామొనరించిన గురుద్రోహాపరాధమును సమర్థించుకొనుట కీతప్పుడుతోవ లావశ్యకము లగుచున్నవి, కాని మొట్టమొదట వీరిమత మెట్టిది? ప్రాచీనార్యసమ్మతమైనదియే, దానిని ఋజువుచేయుట యెట్లు? ఇట్లు.

శ్రీశాంకర్యైనమః

(అసలుకు సరియైన నకలు)

చ॥ కులము ద్యజించి శాస్త్రములను బ్రతికూలత సంఘటించి య
న్యులధనముల్ హరించుటకు నూహలఁ జేయుచు పొట్టకూటి వి
ద్యలఁ గని నాస్తికత్వపుమ, తంబున సంచరణంబుఁ జేయు వా
రలదరిఁ జేరఁబోకుము ప, రాకున నైనను మూఢచిత్తమా. ౧

ఉ॥ యాచకపాళి కొక్కతృణ, మైన నొసంగక యింటిమూలలో
దాచి వృథాప్రయాసము లె, దఁగనఁ బోక ధనంబటన్నచో
గాచముతోడుతన్ సమముగాఁ గనుఁగొంటయె మేలు, చచ్చుచోఁ
బూచికపుల్లయైనఁ గొనిపోదువె చెప్పుము మూఢచిత్తమా. ౨

ఉ॥ విత్తము వెంట రాదుసుమి, వేదనతప్పదు మీ భవంబు పె
న్గత్తులబోనుమీ నిజము, గాఁ దలపోయుమి యిప్పుడున్న నం

# XXI

వత్తులిటుండఁబోవు సుమీ; పాపము నొందెదు సుమ్మి పైన నీ
చిత్తము చేతనైనటులఁ, జెప్పితి నించుక మూఢచిత్తమా.

ది 27-6-03 సం॥రం.

ఓలేటి వెంకటరామయ్య.

పైపద్యములు మాశిష్యుఁడు మాకడఁ జదువుచునుకొనఁబోవు దినములలో రచించినవి, అందులకందుఁగల తేదీప్రకారము ఆతేదీ శోభకృత్సం॥ ఆషాఢ శుద్ధ తృతీయా శనివారమునకు సరిపడును, ఆసం॥ జ్యేష్ఠములో వెంకటశాస్త్రి యింటి యింజరములో నూతనగృహప్రవేశము, అంతవఱకితఁడు శ్రద్ధగాఁ జదువుచున్నవాఁడే, ఇందుల గృహప్రవేశమునకు వచ్చినవారెల్ల సాక్షులే, విద్యాభ్యాసారంభము శార్వరి సం॥ శ్రావణము, ఈమూఁడువత్సరములును, అప్రస్తుత ప్రశంసలో మూఁడుమాసములుగాఁ గృష్ణకవి యుపలపించెను, దానింగూర్చి యిందు ప్రస్తావించుటకన్నఁ బ్రశంసాఖండనముకుఁగా నేర్పడిన లోకాభిరామాయణములోనే ప్రసంగించుట యుక్తము, పైపద్యములకాగితము మాశిష్యుని వ్రాలుంటయే కాక యతని స్వహస్తలిఖితాక్షరములు గూడఁగలది. కృష్ణకవి దీనినెట్లో యుపలపింపక మానఁడు, చర్లచలపతి క్షమాపణలేఖకన్న దీనియెక్కువయేమి.

"న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి"

ఈకారిక నతఁ డసత్యవిషయమునఁ జేయూఁతగా గ్రహించుచున్నాఁడు అది యటులుండె, ఆపద్యము లిప్పటియితని 'దేవగురు నిందాత్మకమగు మతమునకుఁ దోడ్పడవు' ఈమత నిటీవలకుక్షింభరిత్వ ప్రయుక్తమైన గురుదూషణను సమర్థించుకొనుట కవలంబించినదియే, దీనిపేరేమి? వివేకదారిద్ర్యము, అదియవలంబించినవారి కొకమతమేమి, యొక్రతోవయేమి, యొకతెన్నేమి.

"శ్లో॥...వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః"

అనుభర్తృహరి బుద్ధివిహీనుఁడాని, శాంతం పాపం, ఇట్టివీరివ్రాఁతలనేల విమర్శింపవలెనని విమర్శించుమావంటి మూర్ఖులను.

"కొయ్యతోఁటకూరకును సిగ్గు లేదు, కొడవటికిని సిగ్గు లేదు"

అని చదువరులు విసిగికొందు రని మే మెఱుఁగుదుము, కాని మాశిష్యపరమాణువు లిరువురలో రెండవవానిని లిఖియించు నన్నృతములకుఁ బాగము లేక యుం

దుటంజేసి సత్యవ్రతశాస్త్రికిఁ దత్ఖండమునకు దిగక తప్పనివిధి యగుచున్నది, వేయేల, అతఁడు వ్రాఁత యని ప్రారంభించినది మొదలు నేఁటివఱకును బ్రచురించిన యక్షరములలో నేయొకటిరెండు నిలుచునో గాని తక్కినవెల్ల 'హు'ప్పని యూఁదిన నెగిరి పోయెడివేకదా? ప్రకృతవివాదవిషయ మటులుంతము. ఈకృష్ణకవి

"ఆభాష్యాంతమధీతం"

అని వ్రాసికొనియున్నాఁడు, ఈయొక్కమాట కీతఁడు స్వగ్రామమునుండి యేని తగినసాక్ష్యమును దెచ్చుకోఁగలఁడేమో చదువరులు ప్రశ్నింతురుగాక, కౌముది చెప్పినగురువెవరు? వ్యాఖ్యానములు చెప్పినగురువు లెవరు, భాష్యము చెప్పిన గురు వెవరు, అతనివ్రాఁతలో—

'వీరేశ్వరాత్'

అనియున్నది, ప్రకృతము యశః కాయుఁడగు నావీరేశ్వరుఁడు మాయిరువురకు నొకింతరో మఱికొంతరో శిష్యుఁడే, అతఁ డీతనిగురువులలో నొకరుఁడగునారాయణశాస్త్రి గారికిని గురువు, ఆనారాయణశాస్త్రిగారికి భాష్యాంతమును జెప్పి యితనికిఁ జెప్పెనో, లేక యిరువురకును గల్పి చెప్పెనో, కాక యితనికిమాత్రమే రహస్యముగాఁ జెప్పెనో, ఈవిషయము నొకదానినేని శ్రద్ధ కలిగి తెలిసికొని యితనివ్రాఁతల తత్త్వమును లోకము గుఱుతించుఁగాక, తుద కీవిషయమునకుఁ బ్రకృతము వీరింబట్టి మాకు శత్రుకోటిలో నొకరుగా నున్ననారాయణశాస్త్రిగారేని యంగీకరించినచోఁ జదువరులు విశ్వసింప వచ్చును, లేదా కృష్ణకవితండ్రిగారేని 'మాఅబ్బాయి రామడుగుల వీరయ్యశాస్త్రులవద్దఁ గాని వేఱొకరివద్దఁగాని భాష్యాంతము చదివికొనియె నని చెప్పినచో విశ్వసింప వచ్చును ఇతనితోఁ జేరుటచే మాశిష్యుడు వెంకటరామయ్యకూడ నసత్యతత్పరుఁడుగఁ దోఁచుచున్నాఁడే కాని వాస్తవమున కతఁ డట్టివాఁడు కాఁడు, వెంకటశాస్త్రిగారియొద్ద నీవెంతవఱకుఁ జదివితివి, ఎన్నాళ్లు చదివితివి, చెప్పు మని యడుగువారున్నచో నిప్పటికేని నిజము చెప్పియే తీరును, పైఁగా గురుత్వగోపన మొనర్చుటకుఁ బ్రకృతము చెప్పహేతువులను జెప్పఁడు, కృష్ణకవివెంటనుండుటచే నిట్టికర్మము తటస్థించిన దని యే చెప్పను, కృష్ణకవికి వెంకటశాస్త్రి గురుపరంపరలో వాఁడయ్యును బరిగణింపఁ దగినంత గురువు కాఁడు, కావున నతఁ డెవరినో పేర్కొనియెను, ఇతనికిఁగూడ వారే గురువులు గావలసి వచ్చినది, దానితో లోకము

లోఁ గలకల ముదయించినది, అది తుదకు వీరేశ్వరవేరు, లగుటకుఁ గారణ మైనది, దానివలన నింత మునిఁగినది, ఇది సంగ్రహము, ఎన్నిగ్రంథములేని దీనికే పెరుఁగుచున్నవి, ఎన్నియసత్యములేని యిందులకే వినియోగించుచున్నారు, అసత్యము నుపేక్షించుట పాడి గాదని మేము పరిశ్రమ చేయుచున్నారము, ఆయాయీవిషయములు ముందుభాగములలో విస్తరించి యుండును గాన నిఁక ముగింపనెంచుచున్నారము. ఇందక్కడక్కడ నుదాహరించిన

'గురుగీత'

అనువ్రాఁతప్రతిని మాకు యాదృచ్ఛికముగా నొసంగిన బ్రి॥ శ్రీ॥ నైషధం భాస్కరరావుగారికి మాకృతజ్ఞతావందనముల నర్పించుచున్నారము, ఆయాగీరతభాగములు గదువునప్పుడు చదువరు లచ్చటచ్చట నుదాహరించిన యుత్తరరములయందలి విషయములను బరిశోధించుచోఁ గాఁకరపర్తికి సంబంధించినవాని నెక్కుడుశ్రద్ధతోఁ దిలపింపవలయు ననియు నందునను గృష్ణకవికి సంబంధించిన దేహబంధువు లవి మఱియును శ్రద్ధగాఁ దిలకింపవలయు ననియు, ఆయాయుత్తరముల కీతఁడు చెప్పుతప్పుటర్థములను జాగరూకతతో విమర్శించినఁ దత్త్వము బోధపడఁగలదనియుం దెల్పుచున్నారము, ఇం దుదాహరింపకున్నను మా 'వేమన రాగసాహసశతావధాన పీఠికలో, 67 వ పుటలో నుదాహరించిన 'అణివిళ్ల సీతారామశాస్త్రులవారి యుత్తరమును జదివితిరేని కాఁకరపర్తిని బురస్కరించుకొని కల్పించి కృష్ణకవివ్రాయు తప్పుడువ్రాఁత లెట్టివో తెలియఁగల వని హెచ్చరించుచున్నారము, ఆగ్రామము పండితగ్రామ మగుటకుఁగాని, అన్నదాననిరత మను ప్రతిష్ఠకుఁగుదురగుటకుఁ గాని, మఱియేయితర యశస్సునకుఁ గాని మూలకందమాణివిళ్లవారు, అందులో సీసీతా రామశాస్త్రులవారు సర్వవిధములఁ బూర్వులను బోలినవారు, అట్టియోగ్యునకు మాయెడల నెట్టిగౌరవప్రపత్తియో, ఆయుత్తరము చెప్పును, ఈకృష్ణకవికిని, ఆయనఘునకును గలతారతమ్యము సర్వబంధుజనవిదితము. ఇతఁ డేయుక్తపువ్రాఁత వ్రాసి యేమి చేయఁగలఁడు కాని, ఆయావరస్పరసందర్భము తెలుఁగని దూరస్థులకొఱకై తత్త్వనిర్ణయమునకుఁ గొంత సామగ్రి చూపవలయును, గాన దిఙ్మాత్రప్రదర్శనమునకై యీచిన్నిపొత్తములును, చిన్నిపీఠికలును మేము ప్రకటించుచుంటిమి, సత్యముకొఱకుఁ బరిశ్రమ చేయుట ప్రాజ్ఞులోక సమ్మతముగదా?

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయమితభాషిణాం, యశసే విజిగీషూణాం, ప్రజాయై గృహమేధినామ్.

(ఇతి కాళిదాసః)

ఓమ్, సత్యం తపః, నాఽనృతం వదేత్.

ఇట్లు

తిరుపతి వేంకటేశ్వరులు.



## శుద్ధాశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 3 | దురా | దురాత్మ |
| 7 | 2 | జాంప | జాప |
| 7 | 25 | పిట్ట | బిట్టు |
| 12 | 26 | దగ | గద |
| 14 | 19 | ధీర్ఘ | దీర్ఘ |
| 30 | 1 | గుభక్తికి | గురుభక్తికి |
| 31 | 15 | శ్లో దివం | శ్లో॥ దివం |
| 33 | 20 | సాంకు | సాకు |
| 45 | 23 | పగుట | వగుటనె |
| 45 | 28 | మెత్రి | మైత్రి |
| 52 | 15 | ఋుండి | యుండి |
| 56 | 8 | వ్యంముత్ర | వ్యముత్ర |
| 56 | 17 | రిష్టంత్వ | రిశిష్టత్వ |
| 75 | 10 | ప్లైడిసం | ప్లైడియం |
| 84 | 16 | అపరశి | అవరశ్మి |

స్థూలదృష్టిచే దిద్దిన వీనివలన వీని సజాతీయములను గూడ దిద్దికొనం గోరుచున్నారము.



శ్రీమత్పరదేవతాయైనమః.

# గీరతము, గురుదక్షిణ.

(రెండవభాగము)

## (1) ఆశీర్వచనపర్వము.

క॥ కౌత్సుఁడు గురుదక్షిణ యిడ, నుత్సాహం బెంతయేనియును జూపఁగ "నో
వత్సా! వలదనియెడిగుణ, వత్సలు వరతంతుమౌనివరుఁ బ్రణుతింతున్ ౧

ఉ॥ తప్పక వైకొనంగఁ దగు దక్షిణ దేవర యంచు వేఁడు చే
తప్పగ నెంచి శిష్యుఁపయిఁ దాఁగను లెక్కఁగఁ జేసి "పొమ్ము నే
మిప్పుడ కొన్నికోటు"లని యేగురుఁ డానతివెట్టెఁ దత్కథన్
జెప్పిన కాళిదాసకవి శేఖరుఁ డెల్లజగమ్ము నేలుతన్. ౨

తే॥ గీ॥ అంతముకోఁపి నంత దయార్ద్రచిత్తు
నంత నిస్పృహు నంతధనైకలుబ్ధు
శాంతు సంతోషవంతుఁగా నలుపుకౌత్సు
చరిత దురితాపహము సర్వసమ్మతంబు 3

క॥ గురుశిష్యధర్మముల నెఱుఁగరు పల్వురు పెద్దలిపుడు కలికాలవశుల్,
తిరుపతి శాస్త్రివారల, కొఱకుఁజూమీ! గీరతాఖ్యగురుఁ డేర్పడియెన్॥ ౪

క॥ గురుదక్షిణనూఱార్లు *శి, వరామకవి నాకు నిడఁగ వచ్చినకంటెన్,
బరమానందమునంగెడి, గురుదక్షిణ చూవె "కాకకోకిలము"నఖా.॥ ౫

---

(బెజవాడ శతావధాన పీఠికనుండి.)

*......అట్టిబహుమతిని నవధానిగారు (శివరామశాస్త్రి) తమకుంగల గురుభక్తిం బ్రకటించుచు బ్ర॥ వేంకటేశ్వరశాస్త్రులగారి కొసంగిరి కాని వారు నీళ

క॥ *కోకిలకాకముఁ గంటివె, యేకళగా నున్నదో యిఁకిఁ? యని నగరే
కోకిలకుఁ గాకియెడ గురు, తాకల్పన మెట్లుకుదురఁదగునో యకటా. ఉ

సీ॥ తాను నాయొద్ద వృథాగ శుశ్రూష చేసెనె కాని విద్దె చెప్పనఁటని నేను
విద్దె చెప్పుటకేమి కొద్దిగానైనను జ్ఞానంబు గలవాఁడ గానఁటేను
పొరబాటుచే నాదు పరణ మంటెనె కాని తా నంతమున్న విద్వాంసుడంటని
పొట్టకై తిరుగు నెప్పుడు నాదుపనియంట! యక్రితమ్ము వసన రవంతయైన
తే॥గీ॥ విద్దె చెప్పనె లేదంట! వినిగిపోయె, నఁట! చెప్పినముక్కె నంతమంచి
ముక్క గాదంట! చప్పనిముక్క యంటని, పసపఁదియ్యనిముక్కలు చదివెనంట

సీ॥ పసితనం బరిగినపై నేను మూర్ఖుఁడ నని తాఁ దెలిసెనంట! యంతమీఁద
భంగపడితిఁగదా! భగవంతుఁడా యంచుఁ జింతించి చనెనంట! యంతలోన
సంతంబు బులుపంట! జాతి సులభమైన విద్దె యబ్బినదంట! వీను లలరఁ
గవిత చెప్పెడి నేర్పు కలిగి రసాలంబు నాశ్రయించిన దంట! యకట! కంచి
తే॥గీ॥ గరుడ సేవయె కాని నాకాళ్లఁబడిన, ఫలము లేదంట! యెందుకో తెలియదిట్టి
పాడు వ్రాఁతలు, విన్నవార్జోడుపంక, దృష్టి నిగిడింతురనియేనిఁ దెలియఁబడదొ

---

క్కియు నాకు వేయిన్నూటపదారులని గ్రహింపరయిరి......

ఇట్లు, గొల్లపూడి లక్ష్మణశాస్త్రి.
బెజవాడ, సి- యం- యస్- హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు.

---

☞ ఈక్రిందిపద్యములను గడుశ్రద్ధగా మదికెక్కించుకోవలయును

(నవంబరు 1910 వ సం॥ కవితాపత్రికనుండి.)

# * కోకిలకాకము

గీ॥ బలిమనకు మఱంది; కృష్ణుని బావ జెట్టి,యు నగు భీమునకోడి సుయోధనుండు, ధైర్యమునుగోలుపోయి యెద్దానడాఁగి, నాఁడో యదియొందు ద్వైపాయన హ్రదంబు. 1. గీ॥ ఆమడువుచెంత నీరసంబైన చింత, కొమ్మపైఁ గూర్చిమోఁ గులాయమ్ముకొఁడు, గట్టుకొని యందుఁ బలుగాకి కాకియొకటి, లాఁతికవులోక కొన్ని గొల్వఁగ వసించు 2 క॥ కాకవులు వాఁడు నాఁడును, నీకంఠస్వరము వర్ణనీ

తే॥గీ॥ ధనికుల గృహమ్ములఁట! యేను గునికి పాటు,
లచటఁబడుచుండునఁట! ద్వారమందుఁ దాను
భక్తితో నప్పుడునుగూడఁ బాయకే యె
నర్చునఁట! సేవ, ఫలము సున్నయఁట! తుదకు. ౯

సీ॥ తనసిరికోర్వక తప్పులు తనకబ్బములను బట్టెదనంట! యెలమి నొకట
నెట్టులేనియు నన్ను నీవు దేశికునిగాఁ జెప్పికొమ్మంచు యాచించితినఁట!
తాను గోకిలమాటఁ దప్పంట! కాకినేనను గురుగాఁ జెప్పికొనెదు నెడల
నయిన నను జెప్పట కంగీకరించెనం టామీఁద లోకు లీయంశము విని
తే॥గీ॥ "కాకమఁట! తాను గురువఁట! కోకిలకఁట!,
యిందులకుఁ గోకల మొకింత యేని సిగ్గు
లేక యెటు చెప్పికొనియె సుశ్లోకులకడ,
నంచు నచ్చెరువడి రంట! యనఘులెల్ల ౧౦

---

యాంబని త, న్నెకొని యాడఁగ నదిసిజ; మేక దెగియనితలఁచి వాయసేశ్వరుఁ డెగయుఱ్ఱె. గీ॥ క్రమముగా గర్వమధికముగాఁగ గాయ,కోత్తముఁడ నేనటంచు నూరూరఁదిరుగు, కాకి పలుగాకిమూఁకలఁగలసిమెలసి, కడకు గాయకబిరుదమ్ము గట్టుకొనియె 4 సీ॥ ఒకసారిపొగరెక్కి శుకశారికాదులఁ గయ్యంబునకుఁబిల్చుఁ గాఁబుదర్వివ్వనొకమాఱు కాకవిక్రికరంబు తనతీరువినుతింపమత్తిల్లు విఱ్ఱవీఁగి,యొక వేళ వెడఁగుబాలకులుగాలికిముఖ్వఁ గట్ట మిన్నులుముట్టుగంతువైచి,యొకనాఁడు తనపాటలకుమెచ్చు పక్షులఁ జేరి "కా" యని హాయి నోరుదెఱచి గీ॥ వేఱొకప్పుడు తనరూపవిభవమెల్ల, వారుఁ గనుఁగొని యచ్చెరుపాటునొందఁ,దలఁచి పటపట ఱెక్కలుదులుపుకొనుచు నొక్క యెండిన చెట్టుపైనెక్కినిక్కు. 5 క॥ ఏకడకునేగినప్పుడో, రాకొమరుల సౌధశేఖరంబులప్రాలుం, గాకవికటంబుగా మన, కాకేశ్వరుఁడంతమాత్ర గరుడుండగునే? 6 చ॥ కొలఁది యెఱుంగలేని యెలకోయిల యొక్కఁడువాయసేశ్వరు, న్వలఁతియకాఁదలంచి తనవారలఁ జీరికిఁగొక ముద్దుగాఁ, బలుకునదయ్యు గానమునఁ బాండితినెక్కుడు సంగ్రహింపఁగాఁ, దలఁపునఁ జేసివాయన పదంబున కేగె ముదంబు పెంపునన్. 7 ఉ॥ జ్ఞానము లేని వాయసుఁడుగాయకుఁడంచుఁదలంచివానితో, గానము నభ్యసింపఁగఁ బికంబనభిజ్ఞత నేగుదేరఁగాఁ, దానునుగాయకుండనని తత్త్వము మార్పడఁజేసి ధానికిం

క॥ అచ్చెరువిటఁ జెందెడి,యోసచ్చరితులు! మీరుఁగూడ జగమునఁ గలరే!
పొచ్చెములేక వచింపుఁడు, చచ్చెనె? మీ యెడలఁ గూడ జ్ఞానలవంబుల్ ౧౧
క॥ గురువుల్ "గురువని" చెప్పిన,దురితమ్ము సహింపరోటు! దురాగ్గముగాఁ
బరికింతిరే మీరలు, సరిగా వచియింపుఁ డయ్య! సజ్జనులారా ౧౨
క॥ క్షమియింపుఁడు మీరును లో,కమునం దున్నారటంచుఁ గాంచనుజుం డో
యమలాత్ములారః యీయ, క్రమపుల్ వ్రాఁతలకుఁ జేయి కదలుట యెట్లో ౧౩

---

గానము నెప్ప సిద్ధపడెఁగాకము లోకమువారు నవ్వఁగన్ 8 క॥ లోకోత్తరమగుగానము,కోకిలడింభకము చదువుకొన వచ్చుటనెం, తో కుతుకుచుమన్నించెను, గాకిగుణంబెవ్వఁడేని కాఁదనగలఁడే 9 గీ॥దినదినము మేఁతకై దేశదేశములకుఁ,జనుచుఁగలవారిముంగిళ్ళఁగునికిపాట్లు, పడుచునుండినవిమువకభక్తితోడఁ,గొలుచుఁ గోయిలవిద్దెపైఁగలుగుపేర్మి" 10 ఉ॥గొప్పకు నెందుఁబోయినను గోయిలఁ దోకొని పోవుఁగాని దా,నెప్పుడుఁబొట్టకూటికొఱకేతిరుగాడుచునుంట నేమియున్, జెప్పదు కాకి కోయిలకుఁ, జెల్లియొకప్పుడునెప్పఁజూచినన్, జప్పని కూఁతదక్క సరసంబగు పల్కొకఁ డైన రాదుగా. 12 గీ॥ ఎన్నఁటికినైనఁ జెవులకునింపునింపు, నొక్కపలుకేని తెలుపదాకోకి యటంచుఁ, గోకిలము పుట్టెఁడానతోఁ గొలిచెఁగాని, యెప్పటికిదానికోర్కి యీడేరదయ్యె 13 క॥ ఎఱుఁగదు పికపోతముదన, గురువునకుం గలుగువిద్య కొలఁదిఁ బసితనం,బరిగినపిఱుందనే య,త్తెఱఁ గంతయు దాని కొయ్యఁ దెలియఁగనయ్యెన్ 14 గీ॥ కాకివైఖరి మనమెఱుంగనిది కాదు,కాకి గానము క్రొత్తదిగాదు మనకు, గండుఁగోయిలపిల్ల యకార్యమందుఁ, బసితనంబొటఁ దెలియక భంగపడియె. 15 గీ॥ చాలఁ గాలంబు వినిగి వేసారి తుదకుఁ, గాకవికిగాణతన మెల్లు గలుగు ననుచుఁ, దెల్లమగుటయు మిపులఁ జింతిల్లిపికము. కాకమును వీడి తనవారిఁ గలసి చెలఁగు 16 గీ॥ అంతఁ గోయిలపిల్ల వసంతకాల, మవతరింపరసాలమునధివసించి, సరసులెల్లరు మెచ్చ స్వజాతి సులభ, మయిన గానంబు కర్ణపేయంబు సేయు 17 ఉ॥ కోయిలపిల్ల మేలుతనకున్ లభియింపకయుంటఁ జేసి య,త్యాయత మానసూయ హృదయంబుఁ గలంప నహర్నిశంబు న, వ్వాయసమూర్తి భూమిఁగలవారికిఁగోయిలపాటఁ జేఁదుగాఁ, జేయుతలంపునం జెవులు చిల్లులు, వోవఁగ గూయు నీగతిన్. 18 గీ॥ విబుధవరులార! కోయిలపిల్లపాట, కర్ణపరుషంబు; మున్నునాకడనె విద్య, నేర్చె;దీని కొకింతయు నేరుపు; కల,కంఠములు

సీ॥ నాకంఠరవము వర్ణన చేయుమీరెల్లఁ గాకవులంట! యకట! తన నాకు
గర్వం బెడిగెనంట! కాలికి మువ్వంట! గట్టినారఁట! పలుగాకినంట!
పటుతరంబుగ నేను బటుపటు టెక్కులు దులుపుకొంచు సంచరింతునఁట! యకట!,
తాను నాయొద్ద విద్యను నేర్చుకో రాఁగ మన్నించి చెప్పినమ్మంచితనము
తే॥గీ॥ గూడఁ గూడనిపని యంటని, గొప్పకంట!
తన్ను నే వెంటఁ దోకొని తరలుటెల్ల
నంతియేకాని చెప్పలేదంట! యక్క,
యెక్కడున్నాఁడొ భగవంతుఁ డెందు లేఁడొ!, ౧౪

క॥ ఓరా! భగవంతుఁడ! నీ, నేరుపు మెచ్చంగ వచ్చు నేఁటికి సృష్టి
ప్రారంభ మాది యిప్పటి, కీర్తి మహాత్మ్యు జగతి కిచ్చిన కతనన్ ౧౫

---

గౌరవార్హముల్ "కావు కావు" 19. గీ॥ చాలఁగాలమునుండి ముచ్చటగఁ బాడు, కాకములసామ్ము గానము; గాని మొన్న, మొన్న నాయొద్ద నేరుచుకొన్న పికము, కలరవమ్ములు మధురముల్ "కావు కావు" 20 గీ॥ కాకియోర్వఁగలేక యిక్క రణినెపుడు "కావుకా"వని కూయునకాని ధరణి, నెఱుఁగరొకొ కలకంఠమునెల్ల వారు, వినరొకో? దానిగానము వీనులార. 21 క॥ కాకము దనకొక గురువని, యే కోయిల నెప్పుడైన నేమి యనూయం, జేకొనిపికముం గాకం, బేకరణిని నిందలాడనేతలఁపోయున్ 22 గీ॥ కాకి యొకనాఁడు కోయిలకడకు వచ్చి, యోర! పికపోత! నీగర్వమధికమయ్యె, తొల్లి గానంబు నెల్ల నాతోడఁ జదివి, కృతమెఱుంగవు నీ కింత కేరడం బె?. 23 క॥ అంచుం గించనంబుగఁ, జంచువుఁగదలించి వాయసము దన్నున్ యా, చించిన నుజ్జటికిముఁ బ్రచు, రించెదనని కోకిలమ్ము రేపున్ మాపున్ ఉ॥ తేఁకువ గల్గువాఁడు పరదేశములం జరియించు వాఁ డతి, శ్లోకుఁడు వేఁపపండ్లు దిని చొక్కెడు కాకవిసార్వభౌముఁడే, నాకు గురుండు నమ్ముఁ డనినన్ మనకోకిలపాక; మేలొకొ, లోకము వారు నమ్మరది లోపము కాదుగ వాగ్బుద్ధికిన్. 25 ఉ॥ కాకము గాయకుండఁట? పికంబునకుం గురువంట? తన్నును, శ్లోకులలోన వాఁ డనని లోపము కోయిలపిల్ల దంటని తా, నేకదు ధర్మవర్తియఁట? యిద్ధగుణుండఁట? వింటిరయ్య! యీ, సాఁకుఁ టంచుఁ జెప్పుకొన సాగిరి లోకులు వింత వింతగన్. 26 క॥ కోయిలకుం గురుఁడను నే, నేయని యెప్పుడును జాటు నెల్లెడలం గా, నీయేదును బాటింపమిఁ, బాయనిరోసమునఁ గలఁత వడు వాయసుఁడున్. 27 క॥ ఈయున్న తటిని

క॥ మంతనపు సంగతుల నలు,సంతయుఁ దూచాలు తప్ప కంతయు నేను
స్వాంతుం డెఱుంగు నాథగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు నిజముల్

క॥ ఎంతో నీచ మగు తటా,కాంతరమున నేస్గపాద మల్లనఁ గొనుదు
శ్చింతము మొసలి నెఱుఁగుభగ, వంతుండున్నయెడఁ దెలియవలయు నిజముల్

---

గండుం, గోయిల కాకమున నుంగుఁగొంగం గని యెం,దోనొత్తిలిన గెనఁట, యది,యేయొక రంధ్రముగ విగ్రహింపఁగఁదొడఁగెఁ. 28 ఉ॥ కోకిలమట్లు కయ్యమునకు న్మది గొల్పదు ముద్దులొలకఁగా,వాకొనియెల్లలోకులను వశ్యులఁజేసినదయ్యు నెప్పడో,కాకము నొద్దనొకపరి గానము నేర్వఁగఁ బోయియుండుటఁ, గాకికిఁ గోకిలమ్మునకుఁ గయ్యము తియ్యము గాక యుండుటన్. 29 క॥ అదికారణమ్ము గాఁ ద,న్నెదురఁగలే దని తలంచెనేమొ? కాకం.బొదిగిపికకూజితమ్ముల, వెదకి వెదకి చూవసాగె వెఱ్ఱిదొసంగుల్. 30 చ॥ ఎఱుఁగదుగాక కాక మొకయుంచుకయేనియు నాత్మశక్తి; వా,దెఱవ నపస్వరంబులుగదే? తనకుం బొడసూపు! గాయకో, త్తరకలకంఠనాదమునఁ దానును దప్పలు వట్టఁజూచినఁ, గరుసగు నే వికస్వర పికస్వరమెవ్వరికేని యంతలోన్. 31 క॥ కాక మొకవక్త కోయిల, మూకంబని మదిఁ దలంచు మొఱకులఁదెలుపన్,లోకోత్తర మగుఫణితిని, కోకోయని కూయసాగెఁ గోకిలమంతన్. 32 ఉ॥ చేసెడుచేఁత యుత్తములచిత్తముసు త్తలపెట్టుచుండుటం, గూసెడుకూఁత కర్ణములకుం బరుసంబుగఁ దాఁకుచుండుటన్ వానియు వన్నెయుం గలుగువారలు "హుం" షనిపాఱఁదోలినన్, నాసరివారు లేరనియె నమ్మను వాయసుఁడేమిసెప్పదున్. 33 క॥ కొంగొంగురనుచుఁ గూసెడు, కొంగను ముంగిళుల మెలఁగు కొంచెపుఁగాకిన్,బంగారు పంజరమ్మున సింగారింపఁగ నెవఁడు చిత్తముఁ గొలుపున్ 34

(కోకిలకాకము)

తెలిసిన తాను గానమును దెల్పిన దేయగుచోఁ,
గొలువకయున్న దోసమది కోయిలపిల్లదె కా,
తలఁపఁగ రానికూఁతలను దత్వమెఱుంగక కో,
కిలమును దాఁటి వాయసము కీరితిఁ జెందునొకో? 35

శ్రీపీఠికాపుర సంస్థానవిద్వాంసులు, వేంకటరామకృష్ణకవులు.

క॥ ఇంతి ద్రుపదాత్మజాత స,భాంతరమున దుస్ససేనునవమానంపుం
గంతులకుఁ బాఁపఁగల భగ,వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ భ్రాంతిన్ బ్రాజదువులద, న్వంతుని లోఁ డాఁచుదొంగవాని నసురదు,
శ్చింతుని గనుఁగొనునాభగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ ఇంతి జగన్మోహిని దా, సంతర్పణఁ జేయ సురలసందున నరి య
ల్లంత నిఱుకుటెటఁ జేఁగిన భగ, వంతుండున్నయెడఁ దెలియవలయున్నిజముల్

క॥ సంతమసములోన నుద, న్వంతునిలో నుండుకొండ ప్రక్క జరుగు వృ
త్తాంతమ్ము నెఱుఁగునాభగ, వంతుండున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క॥ ఓయీ తిరుపతి శాస్త్రీ!, నాయీ శిష్యుండు కాకి నామము నాకున్
వేయాఱు లిచ్చుటకు బదు, లాయుర్భాగ్యములు గోరి యర్పణఁ జేసెన్. ౨౨

ఉ॥ ఏనును నీవు నిక్కపుఁ గవీంద్రులమే యగు టొప్పనేని దు
ర్మాని మదీయశిష్యునపరాధ మ దెంతటిదైన నేమి య
జ్ఞానకృతంబుగాఁ దలఁచి కాచి నిను న్నను నద్యశఃపరా
ధీనులఁ జేయుఁగాతఁ బరదేవత శిష్యుఁ జిరాయుఁ జేయుచున్. ౨౩

మ॥ మనలన్ దిట్టినఁదిట్టుఁ గాక తగ నస్మచ్ఛిష్యుఁడో నీతనిన్
ధనధాన్యాదిక మాయువున్ సిరియు విద్యాబుద్ధులన్ గూర్చి వృ
ద్ధిని నందించెడేఁ గాత మాత గురుభక్తిన్ వచ్చు జన్మానకే
ననుసంధించుతఁ గీర్తియుంగలుగుఁ గాకానాఁడె యవార్యగన్. ౨౪

మ॥ కలుగున్ గావుత సూర్యరాడ్విభునకున్ గళ్యాణపారంపరల్
దెలియుంగావుత మేరికన్నఁ గవులే దేవాంశసంభూతు లం
చిల నీకేఁ డొనరించు పుణ్యములె మాయీశిష్యదుర్దోషపుం
గలికాలంపుఁ బ్రివర్తనం బుడిపి పైఁ గాపాడి రక్షించుతన్ ౨౫

సీ॥ మొదలంట నడఁగంటి మూలమూలలనుండు వేదశాస్త్రమ్ములు వెలికి వచ్చె
మనకు దిక్కెవ్వరో యని కుందు నాంధ్రికవులకవిత్వము నేఁడు వెలికి వచ్చె
నెందుకు సృష్టించె నీమమ్మ నని బిట్టవందురునదలవంత లడఁగె
నెట్లునిల్చెడినొకో? యీపాఠశాల లిమ్మల నన్నశాల లుజ్జ్వలత కెక్కె

తే॥ గీ॥ నెవని కతమున నట్టిమనీషిపాద, రేణుపావితసత్సభాశ్రీవిశాఖుఁ
డార్యసూర్య రాయేంద్రుననర్ఘసుకృత, మగునుగాక మాశిష్యుని కంగరక్ష.

క॥ ఇఁక నీయవస్థవినుమా!, బకస్థైతివి నీవు; నిన్నుఁ బకపక నెపుడో
పికపోతము పొగరున నెం, దుకొ నవ్వినదంట! యెఱుఁగుదువె యదిసఖుఁడా.

క॥ అదియే కారణ మఁటొ? నీ, మది గలఁగుట కక్రూతము సమచ్చరమునఁ ద
మ్మెదిరింప రండటంచున్, గదనమునకుఁ బిల్చె తంట! కంటివెయిదియున్.

క॥ ఎదిరించెడి నేర్పది యు, న్నది యఁట! చదు వబ్బకున్న నదియే పోయెన్
గదనము గురుతోఁ జేయఁ ద,గదు పొమ్మని మానెనంట! కంటివెసఖుఁడా!.

క॥ ఎంతటి తెల్వియొ చూడుమ!, యంతే వాసిత్వ మాతఁ డంతో యింతో
యెంతో నా కొనరించెను, జింతింపఁగ నేల నిన్నుఁ జెనఁకుట కనఘా. ౩౦

క॥ గాంగేయు నెఱుఁగఁడో? పా, ర్థుం గనఁడో? భారతమున; దొంగ ప్రసంగం
బుం గనలేరే లోకులు, "మంగలి మాధ్యస్థ్య" మనుచు మది నెంచెనొకో!.

క॥ వందియ మందెను సరియే, పందవలెన్ వదరుపట్ల భయ మది లేదో!
యెందుల కీవ్యాస మ్మిది, పందతనము తెలుప దొక్రొ బాలునకేనిన్. ౩౨

క॥ భారతమున నున్నదొ యిది, గీరతమునయందుఁ గలదొ కేవలముగ ని
చ్ఛారతి వ్రాసినదేకద!, మోఱకు లనరొక్రొ? వినిన బుధవరులెల్లన్. ౩౩

క॥ అన్యాపదేశ మన ని, ట్లన్యాయపు వ్రాఁత యగునె యకటా? విద్యా
శూన్యులకుఁ దెల్వి, ధీర,మ్మన్యులకున్ మంచి చెడ్డ మహిలోఁ గలదే. ౩౪

క॥ ఎవఁ డేడ్చెఁ దన్ను, శిష్యుఁడ "నవుదును నే.,నని వచింపు మని లేదని బొం
కు విధము దీనికి నెంతో, నవిశేషము గాక యున్నె జడుఁ డెఱుఁగు నెటుల్

చ॥ "దధివిలి నిక్రమే గురుఁడు చప్పనికూఁతలు నెప్పినాఁడు నే
నదివఱకే కళావిదుఁడ" నంచు వచించి పికత్వ మూని దు
ర్మదమునఁ గాకిగా గురుని వాటికిఁ జెప్పటకన్న నొప్పదే
"చదువనె లే"దటన్న నిది సత్య మటంచుఁ దలంచెనో కదే. ౩౬

ఆ॥ వె॥ వల్ల కాటిసత్య మిల్లు న ట్టేటిలోఁ, గట్టి కొన్న పగిదిఁ గానఁబడెడి
– నెల్లవారు నకరె "యిహిహి" దురాగతం, బనరె యేరు చెప్పి రకట! యిట్లు!

ఉ॥ కొంగగ నిన్నుఁ బేర్కొనిరి, కోరినవాఁడవు నీవు వారితో
సంగర, మందులోఁ జొరఁగఁ జాలమికిన్, "భిక్షమేదః గాకితో
సంగర, మేడ నంచుఁ బెలుచన్ లిఖియించిరి హేతు,వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితొ? గొంగ యనంగను శత్రు వందురో. ౩౮

క॥ అటుమీఁద శత్రువునకున్, దటకావడి మూలఁబడుట తథ్యము కాదే!
యెటు వ్రాసి కొన్ననేమి క,పట మొఱఁగం బడదె జగము పాషాణంబే. ౩౯

గీ॥ దోమ యేనుఁగుకడ కేగె దొరకువఱకు,రక్తమును గ్రోలునిచ్చ, భద్రగజరాజు
నొడలు తనపాలుచేసె నీవెడఁగుదోమ, పాడుతుండంబునకు లేదు పాటవంబు.

క॥ నాకును దుండంబున్నద, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ జొచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!

---

## (2) సూర్యరాయపర్వము.



సీ॥ ఆకొండివారింట నాకంఠముగ మెక్కి సత్రంబు చెప్పినజాణ తనము
మధునపంతుల సూరగబుధు దేశికత్వమ్ము మున్ను చెప్పినరీతి నున్న యెడుట
అటుమీఁదఁ దాఁ భికంబైనన్నుఁ గాశంబుగా వ్యాసములు వ్రాయు గాణతనము
ఆవ్యాసములు గూడ నట నిట గోమటూదక సేచనము గోరు వెకలితనము.
తే॥ గీ॥ గాంచి యేమి "దురాగతం,బంచు నడుగు
వాఁ డొకఁడు లేఁడు గా! యని వగచుచుండ
దొరకె నొకఁడు సూజివీట్పురమునందు
దొర రసజ్ఞుండు సత్కవిచరణ రతుఁడు. ౪౧

క॥ విరవ యను సూరుకాపుర, మరసినవాఁడతడు సకల మగుకావ్యములన్
సరిగారు వెలమలన్ ధీ, వరు లతని కటన్న జడుల వాకొన నేలా. ౪౨

క॥ ఎఱుఁగవె! సంస్కృతభారత, పరమార్థజ్ఞుండు రావు వంగడమున నీ
పరిసరమునఁ గలదొరలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెందున్. ౪౩

ఉ॥ వెంకటసూర్యరాయసుకవిత్వవిదుం డగు రామచంద్ర నా
మాంకుని స్యాలకుండు ధనమం దెటులైనను పీఠికాపురీ
శంకజ బాంధవుం డనఁగ భాసిలువానికి ధర్మమూర్తికిన్
వెంకటసూర్యరాయనికి విందు వివేకి *యథార్థవాదియున్. ౨౨

కం॥ ఆతం డడిగెదననె నిఁక, బూతులపంచాంగములను బొగరుల్ వగలున్
జాతురికిఁ దక్కఁ గోఁతలు, మూఁతలంబడు నమ్మఁ డతఁడు బొంకుంగూఁతల్.

కం॥ దానన్ లాభం బేమని, యానీ నీవడిగెదవు! వారి కాపైనేఁన్
జ్ఞానంబు గలుగు ననియున్, దానన్ యశమబ్బు ననియుఁ దలఁచెద సఖుఁడా.

---

పిఠాపురం.

*శ్రీరామ ది 16-1-11

మహారాజశ్రీ చెల్లపిల్ల వెంకటశాస్త్రిగారికి, శిష్యుడు రావు వెంకటసూర్యారావు కృతానేక వందనములు........ నేను ఇచ్చటకువచ్చి వారంరోజులు అయ్యింది. ఆదిమొదలు ఇప్పటివరకున్నూ- అత్యద్భుత శతావధానుల దర్శనం చాదామని ఎంతయత్నించిననూ నాకు సందర్భించక పోయినందున్నూ రెండుసార్లు వారిబసకే వెళ్లిననూ- సమావేశం కాలేదు- కారణం నేనువ్రాయచాలను. ఇంతమా అట్టిలాభం నాకు ప్రాప్తించినదికాదు అనిఅనుకున్నాను...... ప్రస్తుతం చాలా పశ్చాత్తాపం లోకి వచ్చినట్లు నాఆప్తులవల్ల రూఢిగావిన్నాను- నేనువకసారి సమావేశమయ్యిచో ఎంతఅందముగానైనాయుండును. గాని వీలుపడ్డదికాదు- వకసారి సమావేశమయ్యి యడల మీకు నేను శిష్యుడనైనందుకు గురురుణంతీర్చుకొనిన వాడను అగుదును. ఆపని ఈసమయంలో నెరవేర్చలేనందున్నూ నేనున్నూ వారివలె గుర్వవిషయంలో కృతఘ్నుడనే కావలసివచ్చినది. ... ... నాఆప్తులున్నూ నేనున్నూకూడా మీగీరతమునే త్వరలో చదివి ఆనదించు కుతూహలంలో నున్నాము, గీరతంయొక్క పూర్వోత్తరం పిఠాపురంలో వున్నపండితులు అందరికిన్ని పద్యములు నోటికి రాకపోయినా సంగతి యావత్తున్నూ చెప్పినారు అటువంటి గ్రంథం బయలుదేరితే లోకమునకు ఉపకారమవుతుంది అనిఅన్నారు. అంతా...... వేస్తూన్నారట......

రా॥ వెం॥

గీ॥ ఎఱుఁగు. నీతండు నాయొద్ద నెంతవఱకుఁ
జదువుకొన్నాఁడొఁ పిదప నీసాహచర్యమున
కెట్టులాడిగట్టి పాపంపు గుట్ట నెక్కెఁ
దలఁచుచున్నాఁడొ సర్వమ్ము తథ్యముగను. ౪౭

క॥ నాకడకు వచ్చునప్పటి, కీకవిజ్ఞానం బదెంతొ? యీడెంతయొ? నా
కాకత్వ మితని కోకిల, పాకత్వముగూడ నెఱుఁగుభవ్యుఁ డతండే. ౪౮

ఉ॥ ఏ నలనూజివీడుపురి కేగి వధానము సేయునాఁటి కీ
జ్ఞానిశిరోవిభూషణము ఛాత్రుఁడు గాఁ జనుఁ దెంచెనాకు వి
జ్ఞానము బోధ సేయుటకుఁగా దయ గల్గిన వాఁడుగాన, ని
వ్వానిని సూర్యరా వపుడు వాస్తవ భక్తిని జూచి నాఁ డటన్. ౪౯

శా॥ సూరిశ్రీసకలస్వవేత్త యగుసీసూర్యుండెసూ! పూర్వ మ
ప్పారాయేంద్రుని సన్నిధానమునఁ గాఢవ్యంపువిద్యాఖనిన్
శ్రీరామాఖ్యశతావధానిపసఁ దేల్చెన్ మీఁద నాసూరి న
ప్పారా వొక్కఁడె కాక తన్నగరమే వాకోదు తత్త్వజ్ఞుఁ గన్. ౫౦

శా॥ అప్పారావున నంతరమ్మునను విద్యావేదులైనట్టినా
రప్పారావును సమ్మహాత్మునసుజుం డైనట్టి సింహాద్రి శ్రీ
యప్పారావును జూడ వచ్చె నితఁ డయ్యార్యుల్ "భవచ్ఛక్తి మా
కొప్పన్ బో" దని తండ్రిపోలిక నని రాక్యల్ తత్త్వ మూహింపరే, ౫౧

ఆ॥ వె॥ ఈరసజ్ఞమూర్తియే కాదు శ్రీకూచి, కులుఁడు నారసింహకోవిదుండు,
గూడ నెఱుఁగు నితనిగురుతయు నాశిష్య, భావ మనుగ నతఁడుపలుకు నిజము,॥

క॥ ఎవ్వారుపలుకఁ నేటికి, అవ్వయు రట్టును నిదేల రసికులకు? నసున్
బ్రువ్వఁగఁ దిట్టిన వ్యాసమె, మువ్వలు గట్టికొని యిట్లు మొఱఁగుచునుండన్,

మ॥ ఎవ రీకోకిల! శ్రీమదోలెటికులా హీనాబ్ధిరాకావిధుం
డవుశ్రీ వెంకట రామశాస్త్రి యను లోకాహ్లాది, కాకం బెవం
డెవఁడో యెట్లగు? శాస్త్రిగారి గురు వానీవెంక టేశుం డహా!
యెవఁడీ కొంగ! దివాకరాన్వయమణీ? యీవేసమేమి శ్రీపతీ! ౫౪

సీ॥ నాయొద్దఁ దాఁ గృతఘ్నత్వనామకమహాపాతకి యటంచు విన్నవించు నంట!
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బడవలయుఁ గనుట తప్పనిది యంట
అంతియె కాని నాకాతఁడు శిష్యుఁ డం చని నేను చెప్ప టనర్హ మంట!
పైదానఁ దనకీర్తిఁ బలికించు నే కాని నాకు యశంబు గూర్చు నంట!
తే॥ గీ॥ ఔర! యెటువంటివేదాంత మభ్యసించె?
"నేమి శాశ్వత మాగోడ యుంచుకొంత
యవల జరిగించి పెట్టికొం" డని వచించు
వెఱ్ఱివేదాంతితన మిటు "బట్టు" మునియొ॥ ౫౧

---

## (౩) సంబుద్ధిపర్వము.

క॥ "మావాఁ డతిదుర్మార్గుఁడు, మీవానిశిరమ్ము నందు మేకులు గొట్టుం,
డేవేళ నేమి సేయునొ, కావలమున నన్ను నీతిగనఁ జేసెదవా! ౫౨
ఉ॥ వేంకటరామశాస్త్రి! విను విద్య పఠించితి నంచు నొప్పవో
జంకియుఁ గోకిలమ్మ వయి చక్కఁగ స్పష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "బెప్పెపెపెప్పె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పికొంటి వది చాలు జయం బగుఁగాక నీ కికన్. ౫౩
ఉ॥ "కాక" పటించుఁ దిట్టుదువు గాక శ్వపాకుఁడ వందు గాక యిం
కేకలుషంపుపేరు లిఖియింతువు గాక స్వకార్యసిద్ధి నే
జేకొనినాఁడ నేఁడుగద! చేకురె మోదము; నీవు తిట్ట లే
దీకవి నీతఁడే యురక యిట్టులు తిట్టుకొనెన్ కుమారకా. ౫౪
ఉ॥ "దప్పనిమాఁతలే" యనుము ఛాత్రుఁడవై గద! నన్ భజించుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ వప్పటి కయ్యె నీవు నీ
చెప్పను గానినాదరిని శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బొప్పెనె యిట్టితిట్టుల కహో! యిటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే. ౫౫
చ॥ మొదట "రిజిస్ట్రరుత్తరము" మోటుతనం బగు పట్టుకుండ నేఁ
డగ లిఖియించి తిర్పతిని గణ్యము లై పురికొల్పినాఁడ నీ

వది గని యెంతగా బెదరి తయ్యయొ? పాతకి నైతిఁ దండ్రి! నా
యదయత నైఁపుమయ్య! యిఁక నైనను ఖ్యతిని మాను మర్భకా.॥ ౬౦

చ॥ తిరుపతిసింహ మొక్క-మొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమున నున్న నాపయి "గుభుక్కు-న" దూఁకు నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు; వీ
శ్వర, యను వేరుసుమ్మి నిను జంకఁగఁ జేసిన దేమి సేయుదున్.॥ ౬౧

శా॥ నీయజ్ఞానము నీదులోభగుణముల్ నీదౌకృతఘ్నత్వముల్
నీయల్పజ్ఞతఁ జేసి గాక యకటా? నీమీఁది కే మంచు యు
ద్ధాయత్తుం డయి రాఁగడంగు నొకఁ, డే నవ్వానిఁ బాణాలతో
డాయ న్నిత్తునె? నన్ను వీడిగద! కట్టా! చెట్ట వైతింతకున్.॥ ౬౨

చ॥ తిరుపతిసింహముల్ సరిగఁ దిప్పి ప్రశాంత మొనర్చ వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు గీవకు నోజ గూర్చ నీ
గురునకుఁ జర్లదండ్రునకుఁ గూడ వశం బెటు లయ్యెడిన్ దుర
ద్ధర మది, నేను దానిబలుధాటికి నొక్కొ-కవేళ జంకెదన్. ౬౩

ఉ॥ కాఁకరపర్తిపై కుటుకఁగా గమకించె నెటుంగు దేని "శత
ఘ్ని" కృతి సాహ్యకర్తలును నీవును బావయుఁ బోలె "శృంగభం"
గాకలన ప్రసంగ మది యజ్ఞతమై లిఖియించినట్టి వా
పోకయ పోయినట్టులుగఁ బూర్తిగ డేఁకిరి జ్ఞప్తి యున్నదే. ౬౪

ఉ॥ వెంకన బంటు పోకతన వేఁదుటుత్రాఁత లొకింత సైఁచు మీ
ర్జంకుటగాఁ దలంచి పెలుచన్ గుటుచల్ లిఖియించుచుండ్రు మీ
పెంకెతనాలు సాగ వల బెబ్బులిపై; వెలనాఁటి సింగ మి
జ్జింకల నింకఁ జేయు నెపుడేనియు; డొంకల నూరి శరణ్యముల్ ౬౫

ఉ॥ ఏదిరి సదుత్తరం బతని యేత్తెటు త్రాఁతకుఁ జెప్పుమా? శిర
శ్ఛేదము కాదె పంచె మిడె సిగ్గు గలట్టి నృజన్ముఁ డేని * "మీ
రే దెనకేని బొం"డనుచు నీయఁగఁ జేయునె యుత్తరంబు దా
యాదుని పేరు పెట్టి; యపురా? యివి రాని చవిరానిబీరముల్ ౬౬

* గీరతము, 1 భాగము శాఖాచంక్రమణపర్వము 81వ పుట 8 వ పంక్తి చూ.

ఉ॥ "పొండల పీఠికాపురికిఁ బొండటుపొం" డని నీదుబావబా
వాండొకలేఖ వ్రాసె నది యూఁతగ నయ్యెడ కేగుదేరన
వ్వాండొకొ యోఁడు "మీ రిటకు వచ్చితి రేటి" కటంచు, నెందుకీ
గండతనంపు వ్రాఁతలు జగంబు మొగంబుల నవ్వచేటు సూ. ౬౭

చ॥ "పిలిచినయట్లు రాక యటు * బెట్టుగ నుత్తర మిచ్చి యెవ్వరో
చలపతి "పీఠికాపురముచక్కికిఁ బొ"మ్మనినట్టు లెవ్వరో
గిలికిన వచ్చువాఁడవె? నగించెడి నీదుప్రసక్తి" యంచు న
వ్వల నలయోఁడు నవ్వలరఁ బల్కిన నుత్తరమేది పుత్రకా. ౬౮

---

* శ్రీపిఠాపురీ రాజపుత్రోదయ విషయిక, పద్యత్రయము.

సీ॥ ఉదయించె రాజు రావూదన్వయోదన్వ దభివర్ధనుండు సూర్యాంశవలన, జన్మించె సంతానశాఖి నందనశుభశ్రీ పెంపుమీఱఁ బిఠాపురమున, వెడలెఁ దనూసంభవుఁడు సూర్యనందు నారాయణాంశం బున్నదంచుఁ దెలుపఁ, బొడమె నాండాలమ్మకడుపు చల్లఁగ రాజసస్యంబు సజ్జన క్షామ మడఁప॥ గీ॥ మంగమాంబ గణించిన మాననీయ, సుకృతపరిపాక మెల్ల నేఁటికిలభించెఁ, గఁటికగవడె రావుగంగాధరోప, పదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తనిపె సాధారణం బసాధారణముగ, మఱియు నఁదును నాశ్వయుజ్మ్నసబహుళ, పక్షముఁ దృతీయయును శుక్రవాసరంబు, మకరలగ్నంబు సూర్యసంభవుని వలన॥ మ॥ గురుడు న్సూర్యుఁడుఁ జంద్రుఁడు న్గుజుఁడు శుక్రుండు న్బుధుండు న్శనై, శ్చరుఁడుం గేతువు రాహువుం గలసి యశ్రాంతంబు నీబాలునిన్, సిరి దీర్ఘాయు వొసంగి ప్రోతురు బుధాశీర్వాదముల్ తోడుగా, నరవిందాక్షునకున్ సహాయు లయి సూర్యారాయ భూపాలకా.

25-10-10
కాకినాడ

దివాకర్ల తిరుపతిశాస్త్రి,
శతావధాని.

శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్రవెంకట
కృష్ణారావుబహద్దరుగారియాస్థాన విద్వత్కవి.

---

True copy of letter from the Private Secretary to the Rajah Pithapuram dated 29th October 10, addressed to

ఉ॥ కరుణ గలట్టి మెత్త నగుకాకిని గేరడ మాడినట్లు గా
దరయఁగఁ గొంగపై కరుగు టంచని పూర్తిగ బుద్ధి వచ్చియున్
దిరిగియు *"జార్జి" పద్దెముల దేఁకువమాలుదొసంగులన్ గనం
బఱుపఁగఁ బూను మీకు బరువా? కఱవా? తెరవాటు దాఁటులున్ ౧౯

ఉ॥ "ఈశ్వర వేరు,, లున్నయెడ కేగుఁ"డటం చొకబంధుమాత్రునిన్
బశ్వవతారః నూఁతగొని పల్కితి రాతని చెయ్యు లన్నియున్'
శశ్వదుదారకీర్తుల ప్రసంగములో బయలయ్యె నింటిలో
కేశ్వరుఁ డెట్టిచుట్టఱికవేర్పడఁ జేసె నెబాను? పోల్ బలి? ౨౦

క॥ నిను నీపినతండ్రికుమా, రుని గనఁగొను మతఁడు చెప్ప రూఢిగఁ; దాద్య
ష్షును నలతిర్పతిఁ దిట్టెం, గను బూన్చితి రెంతకేని గలవారు సుమా ౨౧

---

Brahmasree Satavadhani D. Tirupati Sastri Garu.

"I am desired by the Rajah to convey his thanks to you for your congratulatory verses on the occasion of the birth of his son and heir."

(శుభలేఖ పంపినప్పటి విజ్ఞాపనము.)

మ॥ ఘనవంశావళి గల్గువాఁడవని చక్రిన్నీదరిన్ జేరిపే, రినచిత్యోత్రి
నదుర్గజమ్ముల నఖక్రీడా వినోదమ్ముగాఁ, దునియల్ సేయఁ దలంచుచుండిన మృ
గేంద్రం బందూరకే వచ్చిపో, యిన గర్జింపరె? యెప్పుడేని యితఁ డగ్లే వచ్చు భూభృ
న్మణీ ॥తి॥ శా॥

---

(*కవితా పత్రికలోని "అట్టహాసము" నుండి)

*...ఈపద్యము వ్రాసిన మహాకవి యెతడోయని యాలోచించుచున్నట్టున్నారు ఈయన పోలవరము సంస్థానపండితుండు దివాకర్లతిరుపతిశాస్త్రిశతావధానిగారు...వరి యాచకమున కేమిగాని యీపద్యను వెనుకటిదానికన్నను దుస్థితిలోనున్నది ... ఇట్టితప్పులతడకను బ్రికటించి నందులకుఁ గొంకియే కాఁబోలు విశేష జ్ఞుఁడనిపించుకొనుచున్న వేంకటశాస్త్రిగారీపద్యమును దోసిరాజని కృష్ణాపత్రిక లోఁగకిక్రన 'పద్యములనుమాత్రము ప్రకటించియున్నారు (ఇట్టివనేకహాస్యములు)

క॥ అతఁడేల చెప్పవలె? నం, స్కృతనిశ్శేషావదాతధృతనిద్రానం
గలిగతకాఁకరవర్తి, స్థితసుశ్రుత నేత్రి మదుగఁ జెప్ప నఖిలమున్. ౨౨

ఉ॥ అట్టిఁడతండు కాళున నై యాతనిద్రావాల్ గలయుత్తరమ్ము మా
పట్టుననుండె నం చెఱిఁగి బావ "యతం *డది వ్రాయలే,, దటం
చొట్టులు సత్యముల్ గిలికి యుత్పథచారిగ దూఁక జొచ్చె "వీఁ'
డిట్టిఁడు బొంకి యాత్మ కెటులేని యశం బొడఁగూర్చు,, నం చొగిన్ ౨౩

క॥ తాదృశులుదక్క మీదు, ర్వాదములకుఁ దోడు సూప రా రతఁడేనిన్,
ఖాదా క్రాంతత కొడఁబడి, నీదగునఘ మడఁచెఁ గొంతనీతి గలాఁడే ౨౪

చ॥ కలతెలుఁగున్ లిఖించె నలకాతరుఁ డక్కటి? పేరు పెట్టి ;య
వ్వలఁ నెవరో లిఖించు నలపత్రము తన్ను ఘటించి తిర్పతి
జ్వలనము చుట్టుముట్టు నని సందియ మందఁగఁ బోలుఁ బాపి? మే
కొలఁదియుఁ గానిత న్నెదురుకొన్న జగంబు మఱింతనవ్వదే. ౨౫

క॥ తిరుపతి ధోరణి తెలిసెనె, "శర"ణని నీబావకై యశస్కరుఁ దతోస్
దరి నిడినబావమఱఁదినిఁ, బొరిఁబొరిఁబలికించి కాచి ప్రోచెన్ గరుణన్. ౨౬

చ॥ అతఁడు కృతజ్ఞుఁ డౌటఁ జామి యాత్మకు వెంకననామ్ము వీనినీ
చతరపితాభివర్ధనుని $సద్గురుఁగా లిఖియించె దానిచే
నితనికి వాఁడు తక్క వని యెంచుచుఁ దిట్టితి వెంత బేలవో?
కృతమును జూపునంతటనె కేవలనీచుఁ డెవండు గాఁడు సూ. ౨౭

(నవంబరు 24వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

*తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంథకర్తకు రిజష్టరు జాబు వ్రాయుటచేఁగా
ని యాతఁడు వ్రాసినట్లు యథార్థవాది యభినవ సరస్వతీపత్రికలోఁ బ్రకటించిన
యుత్తరము చేఁగాని ప్రయోజనము లేదు. ఆయుత్తరము సత్యాసత్యములు సమయము
వచ్చినప్పుడు తేలకపోవు....

---

$సు॥ భవునిన్ భావపదారవిందభవుఁ జెల్వ ప్పిళ్ళవంశార్ణవో!, ద్భవునిన్ శా
స్త్రపదంపదానహితవున్ ధాన్వద్గవున్ సాహితీ, భవునిన్ మేఘగభీరవిస్ఫుట

ఉ॥ కృతమును జూపకుండునరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ దత్తఱంబునన్
మతి చెడి "కాక,, మంచు నొకమాటును గల్పనఁ జేసి నన్నుఁ ది
ట్టితి వది యేమి కార్యము! గడింది యశమ్ము గడించు త్రోవయే. ౭౮

చ॥ "తిరుపతి నాపయిన్ గవిసెఁ దీవ్రత మద్గురు వైన వేంకటే
శ్వరునికి తానఁగాదె, యని శాంతి నెఱింగిన నీవు తద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము సూటిగ వ్రాయక యేటికయ్య! యా
దురితపు వ్రేఁత; కృష్ణుఁ డెటు దోఁపఁగఁ జేసెఁ గుమార! చెప్పుమీ. ౭౯

క॥ నరులకు శాంతిం గఱపెడి, పరమోత్తమ గురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁగాకి నని నీకుఁ దోఁచినదె కదా! ౮౦

చ॥ "గురు" వని చెప్ప నందులకుఁ గోప మిదేమిటికీపనుల్ యశ
స్కర మగునే?,, యటంటి వది సమ్మతమే! కొమరుల్ గలారు నీ
కరయఁగ వర్ధమాను లిటులా చిరజీవులు నిన్ను నల్పన
త్తరుణమునందు నీహృదయతాప మ దెట్టిది యాను తెల్పుమీ. ౮౧

క॥ గురునకుఁ* దండ్రికి భేదం, బరయంగా లేదు శిష్యుఁడనఁగ? కొమరుండే
యెఱిఁగిన వారికి; వాఁడే, తిరస్కృతిన్ జూప మదికిఁ దెగులు గలుగదే. ౮౨

---

రవున్ ధైర్యప్రభా మేరువున్, గవితాసద్గురు వేంకయాభిధుని వక్కాణింతు నై
క్కాలమున్ (ఇది తి॥శా॥ గారి మొదటికవిత్వము కుమారసంభవములోనిది.)

"సీ॥ తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయి గాఁ బాణినీయాబ్ధి కడచి రెం
డు, భాషలలోఁ దత్కృపన్ గవి యయ్యె ననేకముల్ శతలేఖినీకవిత్వ, తంత్ర
ముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యెనఘుఁ గూడి,
శ్రీపోలవరపురీభూపాలుఁ డాంగ్లేయ భాషాప్రవీణుండు బహుకళాఢ్యు" తే॥గీ॥ గంధ
రుఁడతిశాంతుండు సరసుఁడును నగు, రామచంద్ర వేంకటకృష్ణరాయచంద్రు, నొ
ద్ద బుధుఁడును గవియు మాన్యుండునై చె, లంగు తిరుపతిశాస్త్రి తెలుంగుఁ జేసె.

(బాలరామాయణ నాటకప్రథమాంకము చూ)

(ప్రాస్తావికాభియుక్తోక్తులనుండి.)

*శ్లో॥ దశవిప్రసమో బంధు ర్దశబంధుస్సగోత్రిజః, దశగోత్రసమో జ్ఞాతి ర్ద

క॥ ఇదిగాక నీవు చుట్టమ, వదియు విచారింపఁ బుత్రతాపాదకమే
గద! *"శా" అని వ్రాసిన నీ, సదమల మగులేఖ కలదు చదువుము దానిన్.

క॥ నీజనకు నాయనమ్మయు, నాజనకునితల్లి యొక్క నాయనకును నెం
డే జననికి జన్మించిన, యోజ నెఱుంగుదువో? మఱచితివో? గురునిబలెన్. ౮౪

ఉ॥ ఏ నలచర్ల బ్రహ్మయమనీషియెడన్ గడుభక్తియున్ గృతం
బూనినవాఁడ నంచెఱుఁగు యోగ్యుఁడ వీ వది నమ్మదేని నా
మానసమందు నున్నయది మాత్రము నమ్మక పోవు కాన నీ
శానుని సాక్షిగా వినుము సర్వముదెల్పెద నారహస్యమున్. ౮౫

ఉ॥ ఏ నలపీఠికాపురనరేంద్రుని చెంతను జేరి తన్మహా
స్థానమునందు నుండుటకుఁ దద్దయుఁ గోరినవాఁడ నౌచు నీ
పైని నసూయఁ గొంటి నని పల్కుచు దెల్పితి వీవు ప్రాంతలో
నీనుడి నిక్కమే యగునె? నీవు నెఱుంగుదు నాదుభావమున్. ౮౬

ఉ॥ ఎందఱు రాజు లుండిరి! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియున్
విందుతనంబు గల్గినవివేకులు; వారలయొద్ద నుంటినే!
గందరగోళ మైనమది గల్గినవాఁడ స్వతంత్రుఁడన్ జిదా
నందుఁడ నే $నొకానొకని నాయకుఁగా వరియించి యుందునే. ౮౭

---

శిష్యాతిసమో ऽనుజః, దశానుజసమా మాతా, దశమాతృసమః పితా, దశానాంచ పితౄణాంచ సద్గురు ర్జ్ఞానదో ऽధికః, ... తస్మాత్సర్వ ప్రయత్నేన సదా సంపూజయేద్గురుం,,

పల్లిపాలెం

*బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులబాబుగారి సముఖమునకు, ఓలేటి వెంకట్రామయ్య నమస్కారములు చేసి వ్రాయుశుభలేఖార్థములు ... శుభముహూర్తమునకు సకుటుంబపరివారముగా దయచేయగలందులకు ప్రార్థించుచున్నాడను... తమరురచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒకొక్కటి చొప్పన పంపించగలందులకు ప్రార్థించుచున్నాను దయయుంచవలెను.

ఓ॥ వెంకట్రామయ్య

(చిరకాలము క్రింద రచింపఁబడి 1907 వసం॥ అచ్చయిన మా కామేశ్వరీ శతకము నుండి.)

$మ॥ నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁ గాదు నీవంటి న

ఉ॥ అన్నము లేదొ? వస్త్రమునకై కొఱద వుండెనొ! యున్న దాని నే
మెన్నఁగ నెవ్వఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గాన రాఁడు నీ
యన్నముకోసమై మనమునందుఁ బ్రయత్న మదేల నాకు, నీ
చిన్నతనంపుమాటలకుఁ జేతము పొక్కెడి దుఃఖ మెక్కెడిన్.॥ ౮౮

ఉ॥ నిక్కము గాఁ బిఠాపురికి నేఁ జనుదెంచెడివాఁడ నేని ని
న్నెక్కడఁ గింపఁగా వలయునో! నరపాలుఁడు నిన్ను నన్ను నెం
డొక్కరుఁ గూడ నేలుకొనఁడో టు! సమర్థత లేనివాఁడొ! నా
కెక్కటి యున్న టేనికడ కంతకు మున్ జనుదేర కుందునే.॥ ౮౯

ఉ॥ ఎందఱో భార్య లుండియును నింకొకచాన స్వయంవరంబుగా
నందము పొల్చుజాణ తనకబ్బినఁ గైకొనరే నృపాలుఁ? రా
మందమునన్ మదీయకృతిచందనగంధిని గూడ మీన్ను వుం
గందఱతోటిపాటు తనయాఁ గొని యేలఁగ వచ్చు నచ్చుగన్. ౯౦

తే॥ గీ॥ ఏకపత్నీవ్రతము గూడ నిట్టిపట్టు, నందు రామాదులకుఁ బోలె నడ్డుపడద
గాము పేరిట నెంచఁబు ధీమహితులు, తమకృతికుమారికల నిచ్చి తనియ రయ్యొ?

ఉ॥ జంకితి నందువో! యధిపుసన్నిధికిన్ దగ నందువో! తదీ
యాంకణమందు నొక్కఁడును నక్క టఁ? నాసరివాఁడు లేఁడె, “ని
శ్శంకఁ గాకి పంజరపుసత్కృతికిన్ దగ”దందువే! యెటుల్
బొంకెదు సర్వముం దెలిసి పుత్రిక! తండ్రికిఁ జేటు గూర్చెదే. ౯౨

చ॥ కడియములోనఁ గల్గుజన కాండము సర్వము నెన్నిమార్లు నన్
గడెగడె కానృపాలమణిఁ గాంచఁగ నేగు మటంచుఁ జెప్పఁ? రా
నుడు లవి నేను నూఁకొనియునున్ నృపుఁ జూడమి కేమిహేతు వో
కొడుక? యెఱుంగవే! యెఱింగి కొంకక “కాక” మటంచు గెల్కెదే. ౯౩

క॥ కడియమునకు టేనికి నె, ప్పుడు సంబంధంబు గలదు పుత్రిక! నీయా
ర్పడమికి టేనికిఁ గల దె, క్కడిసంబంధంబుఁ? చెప్పఁ గలవే నాకున్.॥ ౯౪

ఠక్కురుణాశాలిని పెంపఁగాఁ బెరిఁగి విద్యాబుద్ధుల న్నేర్పి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె యంబాదేవి కామేశ్వరీ. ౧౫

క॥ ఎందుకుఁ జన మానితినో, పొందుగ* మున్ను వ్రాసినాఁడ బొంకందువో? లే
కందుల కొవ్వుదువో? నా, కిందులకుఁ జింత లేద యించుక యేనిన్.

క॥ ఎన్నో బూతులు దిట్టితి, వన్నియుఁ గోకిలపుఁగూఁత లనుకొనియెద నా
కున్న యభీష్టము దీర్చితి, వన్నా! "కాక" మన నేమి యదియు ముదంబే.

తే॥ గీ॥ కడుపు నిండిన బేరమ్ము గాని నాకు, నేనృపాలుని జూడంగ నేమివలయు
నట్టిచో మానృపాలకుఁ డాతఁ డతని, నేలదర్శింప రాకుండు నెఱుఁగఁ జెపుమ,

తే॥ ఎలమిఁ బిలిపించి న్యాయముగ నెంతొ పేర్మి, గారవించుచునుండె సూ$ గౌరినాథ
శాస్త్రి, స్కూలున నుద్యోగ సరణినుంచి, యతని విడివత్తునెట్టు లేన వులకపుర.

---

## (4) బందరు పర్వము.

క॥ గౌరీనాథ బుధుండనఁ, గా రాజో? రెడ్డొ? చెప్ప కాకమ? యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కర్మఠుఁడు సుతా.

---

*గీరతము 1వ భాగము ఇతిహాసపర్వము చూ.

$శ్రీవేదమూర్తులైన శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి, జంధ్యాలగౌరీనాథశాస్త్రి అనేక నమస్కారములు...మీవుభయులున్నూ యిదివరకు ప్రతిసంవత్సరం అప్పుడపుడు సంస్థానములలోకి వెళ్లివస్తూ సంచారాభ్యాసంకలవారుగా నస్థాయిగా యేకత్రవుండడం దుష్కరంగా తోచునేమో అని వకరు అన్నారు అందుకు నేను కొంత సమాధానము చెప్పినాను ఇంతకు వెళ్లదగిన స్థలములు అయినవి మీకును సంచారమువల్ల విసుగుకలిగి వుండును పైగా వయస్సుకూడా వృద్ధియగుచున్నది ఇట్టిస్థితిలో స్థాయిగా నిరుపద్రవమైన జీవనోపాధి యేకత్రదొరికినప్పుడు అక్కడనేవుండి తీరిక కొలది గొప్పగ్రంథములుగాని పాండిత్యముతో చేరిన మరివకటి గానిచేస్తూ కాలయాపనం చేయడమందు మీకు తాత్పర్యంవుండవచ్చునని నేను తలుస్తాను మీవుభయులలో నెవరోయొకరు యీఉపాధ్యాయస్థానమును అంగీకరించవలసినదని నా తాత్పర్యము ముందుముందు దేశసంచారముగా కాలయాపన చేయడం దుస్తరంగావుండును మీరు కావలసినప్రతిష్ఠను యిదివరకే పొందినారు కాబట్టి బాగా ఆలోచించి మీజవాబు వెంటనే వ్రాయగోరుతాను వచ్చే ఆది

క॥ స్కూలుకళాధ్యులు మాకై చాలన్ యత్నించి సభను సల్పియు మొగమె
న్నేలాగు గౌరవించిరొ!, బాలకపి పొత్తమున్మనందుఁ బఠియింపవొకో. ౧౦౦

క॥ బంద రన నిట్టి దక్కడ "సందేహము లేదు బావశాబ్దిక జీవుల్
చిందులు ద్రొక్కఁ జనఁగ గో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ.

క॥ బందరనఁగ నిట్టిది యట, సెందఱో యున్నార మెల్లయెడ విద్వాంసుల్
తందర పడుస వధానుల, చిందు లచట సాగి రావు శిష్యుఁడపి వింటే. ౧౦౨

క॥ బందరనఁగ నెట్టిది యని, "సందేహము లేదు బావశాబ్దిక జీవా
నందుని బోలెదు శ్రీరా, ముం దగ సుకమా అడిగి సమూల మెఱుఁగుమీ. ౧౦౩

క॥ బందరులోఁ గోకిలకవి, చందిరులకు బిచ్చ మైన సాగదు కాకం
బుం దిలకింతురు కపటపు, బొందలయత్యద్భుతములు పొసఁగవు సుమ్మీ.

క॥ బందరునకె యొకపరి మీ, "సందేహము లేదు బావశాబ్దిక జీవా"
నందుని నే రమ్మంటిని, జిందులు సాఁగవని యటకుఁ జేరఁడువినుమీ. ౧౦౫

క॥ అప్పటికిఁ జిలుక కాలే, దెప్పుడు పంజర మనఁగ నెట్టిదొ యెఱుఁగం
డిప్ప డొకసారి యడుగుము, చెప్ప నతఁడు ధారణావిశేషము కలిమిన్.

క॥ ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద వచ్చు నేమొ? కృష్ణకవీంద్రా
దప్పక ప్రేరేపింపుము, చెప్పుము నరపాలుఁ 'డేల' 'నెల వీఁడు! సుతా ౧౦౭

క॥ సంగన్నగారు వీణా, శృంగారవతీవినోదచేష్టాహృష్టో
త్సంగులు తత్సన్నాగ్యా, లింగితులై యెటకు నేని లేదే చనుటల్. ౧౦౮

తే॥ గీ॥ ఒకస్కూలుసంస్థానమందు మీయునికి కేమి, ఏటిపోలిక వారికి నెందు మీకు?

---

వారం తిరిగి మీటింగు చేసి యెవరినో వకరిని హేముఅప్పాయింటు చేయవలసి వున్నది రేపుస్కూలు ఆరంభము గాన అంతకంటె విళంబము చేయజాలము త్వరగా జవాబుపంపించకోరుతాను మీయిరువురిలో యెవరుఅంగీకరించితే వారు హిందూహైస్కూలు కమిటీవారిపేర వకదరఖాస్తుకూడా వ్రాసినాపేరపంపకోరుతాను మీజవాబురాకపోతేయీఆదివారంనాడు దాటజాలను, చిత్తగించవలెను

జంధ్యాలగౌరీనాధశాస్త్రి

అకటా! *వీణరూపంబునడుగఁ బాడు, చేసినది చూచినే నెంతొసిగ్గువడితి.

క॥ ఈసిగ్గున కేమయ్యెడఁ, జేసినయవధానమందుఁ జెప్పినకవనం
బేనరసముగాఁ బడినదొ, యీసర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్.

క॥ ఆనరపతికిని మనయవ, ధానులు గండ లనఁ గీర్తి దవులునదియుఁ గా
కేనాఁడు నాజ్ఞ గొని వి,ద్యానిధు లెక్కడికిఁ గాని యరుగుట లేదే. ౧౧౧

క॥ ఇది యిటులుంతము బందరు, పద నెట్టిదొ రామశాస్త్రిఁ బరమాద్భుతవుం
బదము గలశతవధానిం, గదిసి యడిగి తెలిసికొన సకలమును దెలుపున్.

క॥ అప్పండితు నవధానము, నప్పుడు జడ్జీ కలెక్టరాదులు సభలో
నొప్పరిసూ! వార్ నీ! యనఁ, జెప్పెపెయాని యొకనమున్సు పెట్టె నదుగుమీ.

క॥ ఇది యప్రస్తుత మతఁడును, నదయత నిసుఁబోలెఁ గాక నక్కఁగఁ గొన్నా
ళ్లొదిగెం గాకము కడ బ,ల్లిదుఁ డగు మీకృష్ణ సుకవి లీలన్ హేలన్.

---

## (5) సమృద్ధి పర్వము.

---

క॥ ఇఁకఁ బ్రకృతము వినుమయ్యా, పికరాజమ! వెనుకఁ బోలెఁ బృథివీపతులన్
నక నక లాడెడి పొట్టకుఁ, గకవికఁ గనుఁగొను ప్రసక్తి కలుగదు సుమ్మా.

ఉ॥ పొట్టలు మూడు మావి, నరిపోవును బుట్టెలు మూడు మాకు; ని
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదొక్కొ-, నీ
కెట్టులు దోఁచె! లోకు లిది యెట్టులు నమ్మెద రంచు వ్రాసి తీ
చెట్టుతలంపుమాట! యిటు చెప్పుట పాపము కాదె పుత్రకా. ౧౧౬

---

(వెంకటరామకృష్ణగ్రంథమాల 74వ పుట నుండి.)

*వీణాస్వరూపము, కందము

క॥ వీణాస్వరూపమెన్నఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికులనభినుతింపఁగ, వాణియె యసమానురాలు వసుధాధీశా

(సంగమేశ్వరశాస్త్రి.) గారుకోరినది.

చ॥ నెల కొకనూటయిరూపికలు నీదయకల్మి "కసినపక్ష" మొ
ప్పలొలుకు నాదుపుస్తకపుఁబుత్రులు దెచ్చి యొసంగువారు పై
నెలమిని రోజు కొక్కొకటి యిత్తురురూపిక నూర్లులోన నెం
దుల కిఁక దేవిరింపవలెనో? ననుఁ గోరని కోండ్ల సన్నిధిన్. ౧౧౭

ఉ॥ ఎక్కడి కేగ కూరకయ యింటనె యుండ మటన్నఁ గాని నా
కెక్కడినుండియో సభల కెన్నియొ *జాబులు వచ్చుచుండు నం
దొక్కసభన్ బొనర్చినను నొక్కశతానకుఁ జావు లేదు నీ
కెక్కడియూహ పుట్టెని నిది యెవ్వరి కిత్తును తెల్పు పుత్రికా. ౧౧౮

---

## ది 30-1-10 ఆటపాక పోస్టు కృష్ణాడిస్ట్రిక్టు

*విధేయుబందాశ్రీశయిలంకృతానేకశిరస్సాష్టాంగనమస్కృతులు... తమతా
వునుంచి V. P. P. గారాబడిన నానారాజ సందర్శనమును శనగ్రహమును చదివి
మిగుల ఆనందమును పొందినాను తమకీర్తిని యిదివరకేవినియున్నందున్న యిప్పుడు
తమ దరిశనంచేసితమవల్ల చేయబడు శతావధాన అష్టావధానములు కాంచన
గునా అనిమనస్సులోయోచించుకొనుచుండగా తమరుపంపించిన పుస్తకములలో
నానారాజసందర్శనముయొక్క 10 పేజీలో 3పద్యమును 11 పేజీలోని 8పద్య
మును చదివిన దాది నాయాశమరింత వృద్ధి యగుచున్నది గాని ... తమరునం
పూర్ణవిద్యావంతులని యెరిగివుండిన్ని తమవల్న జరుపబడు అష్టావ ధానశతావధా
నములయొక్క కష్టము తెలిసి వుండిన్ని అవి తమవల్లజర్పబడిన పిమ్మట తమకున
రియయిన్న మన్నన రాజలోకమువల్ల జరుగవలయునేగాని మాబోట్లు యేమిచేయ
గలము అనేభయము ముందుగా కలుగుచున్నది అయితే చంద్రునకు నూలుపో
గను సామెత ప్రకారం మాయొక్కశక్తిని గనిపెట్టితమవంటి మహనీయులు య
ట్లయినను మాకోరికతీర్చుడమె ముఖ్యముగాఆలోచించవలశిన దయివున్నది యింత
యందుకనియెదరాని ఆశాభంగము చేయుట న్యాయము కాదుగనుక బందరువచ్చివి
నకూడదనియెదరాని నావకస్సికే బందరువచ్చివినుటకు సాధ్యమగునుగాని యిం
కాకొందరు కూడా ఆశాబద్ధులయి వున్నందున రావీలుకాదనినావుద్దేశ్యం గనుక
నామ్నవిసంపూర్ణదయతో అంగీకరించి యిప్పుడయినను దరిశనమిచ్చి నాగృహ
పావనముచెయ్యేలాగు యీబీదవానిగు -- కు విజయం చేసి కోర్కెనుతీర్చగలందులకు
ప్రార్థించుచున్నాడను సర్వజ్ఞులయిన తమకు నేను వ్రాయునంతటి వాడను కాన

ఉ॥ ఇంతటి దనక్క వ్రాసికొనుటే విషయమ్ము స్వకీయ మాటచేఁ
గొంతదొనంగు, దాత, నని కూడ లిఖించుట యెట్లు లోప్పఁ గా

---

ని తెలిసియుండిన్ని వ్రాశినయీలోపమునుమన్నించి తిరుగుజవాబు దయచేయవేడు కొనుచున్నాను, దివ్యచిత్తముక్క తేవలెను. శేవక్డు బందా శ్రీశయిలం.

---

సే॥ పండ్రంగి రామారావు అనేకనమస్కారములుచేసి చేయంగలవిన్న పములు. . ,వెనుక నేనుమనవిచేసుకొన్నప్పుడు తమరుశతావధానం చేసెదమని సెలవుయిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు ఇప్పుడుతిరిగి యిక్కడకాలేజీ విద్యార్థులు చాలామంది తమశతావధానము నేచూచి సంతోషించవ లెనని అతి కుతూహలముగానున్నారు వచ్చేపట్టాభిషేకమునకు మాకు డిశంబరు 7వ తారీఖునసుంచి వారంరోజులు శలవులువచ్చుచున్నవి గనుక అప్పుడు యీ కార్యము జరిగించగలందులకు మాఅందరిప్రార్థన అయియున్నది ఈవిషయ మైయిప్పుడు తిరుపతి శాస్త్రులవారిదగ్గరకు వెళ్లివారిఅనుమతిని పొందినాము వారుత మఅభిప్రాయముకూడా కనుగొందమని శెలవుయిచ్చినారు కాబట్టి మాయందుదయ వుంచి మాప్రార్థన కనుకూలమగు జవాబు తిరుగు టపాలో వ్రాయగలందులకు గో రుచున్నాము.

చిత్తగించవలెను
తమవిధేయుండు
పండ్రంగి రామారావు
27—11—11

పిఠాపురం రాజవారి
కాలేజిహాస్టలు
కాకినాడ

ఇక్కడ కాకినాడలో స్టూడెంట్సు అవధానము చేయించెదమని అడుగుచు న్నారు మీకును వ్రాయుదురు మీఅభిప్రాయము చెప్పుడు.... ది॥ తి॥

---

V. V. SUBBARAU, B. A., B. L., గుంటూరు.

12 ఆగస్టు 1911,

...కర్ణాకర్ణి వినియుండి మిమ్ముఁ బ్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రుల గారునహా మీరు వస్తారనునమ్మకముతో నిచ్చట నీనెల 19, 20 తేదీలను తమరు భయలును శతావధానము నల్పుటకు నేర్పాటు చేసినారము గాన మీరు దప్పక 18 తేదీకే దయచేసి మమ్ము నానందింప జేయ మిక్కిలిగా బ్రార్థించుచున్నాము.

సంతయుదారతాగరిమ యంటనిశిష్యులు బ్రహ్మశాస్త్రిన
త్రాంతర భోక్తలందుఁ గల రంచనుకోకు కుమారి! చెప్పితిన్. ౧౧౯

## (6) బ్రహ్మగురుపర్వము.

ఉ॥ అమ్మహనీయు పేరహరహమ్మను నీవును బావయాన్ జప
మ్మిమ్ముగఁ జేయుచోఁ గృతము నీగతిఁ జేసిన పాపమెల్లనున్
నమ్మయి పోవునట్లో నరువన్ బ్రియతింపుము రామదేవుపా
దమ్ములు వాల్చు క్షేత్రమునఁ దాన మొనర్చి పొనర్పు మిక్రియన్. ౧౨౦

---

తిరుపతి శాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పక వత్తురని నమ్మకముతో కొన్ని ప్రయత్నములును జేసియున్నారము. కావున తమరు తప్పక రావలయును. చిత్తగించవలయును.

ఇట్లు విధేయులు

రంగాచార్యుల హనుమయ్య
(జిల్లాకోర్టుప్లీడరు.)
వేలమూరి వెంకటసుబ్బారావు,
జిల్లాకోర్టు శిరస్తాదారు.

గుంటూరు. 15-8-1911

...రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రమములఁ దీసికొనిపోవలయునని కుతూహలపడుచున్నారు. గనుక తాముభయులు సమకాలముననే వత్తురని యెంతును.

శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి.

....తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని ప్రత్యుత్తరము చేరలేదు. మరచినారనితోచెడిని. తమరు రేపుసాయింత్రము బయలుదేరి యల్లుండి గుంటూరికి చేరెదరని వుత్తరము వచ్చినట్టు తెలిసినది. తమరు శ్రీతిరుపతిశాస్త్రిగారు ఒకసారిగా గుంటూరుకు దయచేసినయెడల వుత్సవరూపకముగా గ్రామములోకి తమరిని తీసుకరావలయునని నాకోరిక. దీనిచేతనే యీసాయంత్రము శ్రీహనుమచ్ఛాస్త్రిగారిని యీవిషయమై తమకు వ్రాయమంటిని. శుక్రవారము సాయంత్రముకు బెజవాడరయిలు స్టేషన్ వద్ద సత్రమువద్దకు తమరుదయచేసిన యెడల నేను శ్రీతిరుప

చ॥ ధవళగిరిన్ మహామహుఁ డతం డొకసత్రము వెట్టి శిష్యులన్
గవులను జేయుచున్ సుఖముగా మఱి వారికి నర్థికోటికిన్
బ్రవిమల మన్నదానము నపారముగా నొనరించెఁ దద్గురున్
దవిలిన శిష్యుఁ డించుక యుదారత నేర్పు టదేమి లెక్కయా. ౧౨౧

ఉ॥ అమ్మహనీయునింట నెల యయ్యెడు నంతకు నొక్క పుట్టెడి
య్యమ్ము సుమారు వారుఁ దమదైన కుటుంబముగాక శిష్యసం
ఘ మ్మతిథివ్రజమ్మును సుఖమ్ముగ భోజన మాదరింపఁ బు
ణ్యమ్మన బ్రహ్మపండితునికన్న మఱొక్కని కెన్న నున్నదే. ౧౨౨

ఉ॥ ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి, దాని కె
న్నెన్నియొ యోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించు దానిలోఁ

---

తిశాస్త్రిగారు కలసి అందరము శనివారము ఉదయము గుంటూరు చేరుదము. గుంటూరు స్టేషనువద్ద స్నేహితులందఱు తమరాకకు యెదురు చూచుచుందురు గనుక యీ ప్రకారము చేయుదురని నాకోరిక. గుంటూరు. 15-8-11

మజుందారు వెంకటహనుమంతరావు.

---

...తామున్ను ఆరోజుకు యిచ్చుటకి దయచేసి సభ జరుపగలందులకు మిక్కిలి వేడుకగలవారమై యున్నారము. ఇట్లు విధేయుడు,

15-9-1911. తూములూరి కోటయ్య,

పినపాడు, మారీసుపేటపోస్టు.

---

గుంటూరు.

4-11-11

...12-12-11 అద్దంకిలో అవధానమట వత్తురా? నత్తెనపల్లికి వచ్చే ఆదివారం రాగలరా? .. రంగావఝ్ఝులహనుమయ్య.

---

☛ ఇట్టి యాహ్వానపు టుత్తరములు కొల్లలు గాని గ్రంథ విస్తరభీతిచేత నేమి చాదస్తులనుకొందురనియేమి, యింతతో విరమింపఁ బడుచున్నవి.

విన్నది గాక తా రయితుదెచ్చి యొసంగుఫల మ్మదెంత హా
చ్చున్నను వీరికొక్క నెల యూపునె? యూవదా సందియ మ్మగున్, ౧౨౩
క॥ ఆయనమహాత్ముని భార్య గ, దా? యిల్లాలనఁగ నాఖ్య యన నేల? నిజం
బే యన్నపూర్ణ యాపె వ్వ, ధాయుంతురె యట్టి పేరు తజ్ఞులు పెద్దల్. ౧౨౪
ఉ॥ చెన్నఁటి చూపు చూచి యొకశిష్యుని నేనియు నేమిరా! యటం
చు న్నిరసించి పల్క దిది చోద్యము, దేశిక భార్య లిట్టివా
రున్నది వింటిమే? మఱియు నొక్కటి, లోకులు తన్నుఁ దిట్టినన్
సన్నుతిఁ జేసినన్ సమము సాటి మ ఱెవ్వరు? బ్రహ్మరాణికిన్. ౧౨౫
ఉ॥ "జాతకచర్య" యందు గురుసంతతిఁ దెల్పెడుపట్ల వీరివి
ఖ్యాతిని విస్తరించితిని నక్కడఁ జూడఁ గలాడఁ విందులోఁ
బాతకహారి తచ్చరిత పాఠము నీకును నాకు బావకుం
బ్రాఁతదానంగులన్ దొలిచి భద్రములన్ గలిగింప నెత్తితిన్. ౧౨౬
శా॥ ఏ నే కాదు మఱొక్క శిష్యుఁడును మాయీసద్గురుబ్రహ్మవి
ద్యానాథున్ సురభాషలోఁ దెలిపి కార్తఘ్నాఘభారాపహా
ధీనానూనవచస్కతన్ బరఁగెఁ దద్వివ్యద్వచోధార, ని
త్యానందాత్ముఁడు సద్గురూత్తముఁడు,ని న్నత్యంతమున్ బ్రోచుతన్. ౧౨౭
ఉ॥ ఎంతటి పాపమేసి రచియించును గాక కృతఘ్నుఁడై ఋజు
స్వాంతు గురూత్తమున్ దెగడి వర్తిలుఁగా కలచర్ల బ్రహ్మవా
క్కాంతుచరిత్రమున్ జదివి కాఁగలఁ డుత్తముఁడంచు నెంచు మ
త్స్వాంతము, తచ్చరిత్రము కృతఘ్నుఁ గృతజ్ఞు నొనర్పఁ జాలదో. ౧౨౮
క॥ ఆచరిత వ్రాసినతఁడును, నాచినతండ్రి కొమరుఁడును నాకడఁ దిర్వ
త్యాచార్య నొద్ద శిష్యత, నోఁచి పిదప బ్రహ్మసేవ నోఁచి రెఱుఁగు మీ.
క॥ కాన నతండు సతీర్థ్యుఁడు, మానిజశిష్యుండునగుట మాకడకల*బ్ర
హ్మనూన చరిత నంపెను, దీనిని ముద్రింపుఁ డని విధేయతకలిమిన్. ౧౩౦

---

*శ్రీచర్ల బ్రహ్మగురువరచరిత్ర సంగ్రహము.

...శ్లో॥ విద్యావాసగృహం పరోపకరణోత్పత్తిస్థలం సత్కృపా। పుఞ్జం పుంజిత
సత్త్వ మున్నతయశఃకాయం ప్రతిష్ఠాలయం। రాజత్సద్గుణరత్నరోహణగిరిం ధర్మ

చ॥ అలచరితంబునీకుశుభసూచని కెంతయుఁ జాలు నంచు ని
మ్ములఁ గొనికొంత యియ్యెడల ముద్రితముం బొనరించువాఁడ రో

---

స్వరూప మ్మృదా। విద్వద్బృన్దవతంస మాత్మని భజే బ్రహ్మాఖ్యవిద్యాగురుం॥ 3॥
శ్లో॥యచ్చాకృత్య మనుష్ఠితం యదనృతం ప్రోక్తం యదంహః కృతం। వాక్చి
త్తావయవై ర్నిసర్గఖలసంసర్గప్రమాదాదిభిః। వక్ష్యే బ్రహ్మగురోః పవిత్రచరితం త
త్పాపవిచ్ఛిత్తయే। నాఽన్యస్యాస్య దధికో గురో రితి ఖలుజ్ఞానప్రదాతా యతః॥4॥
...శ్లో॥గోదావరీమండలరాజమాన్యో నీలర్ష భగ్రామవర (కటియెద్దు) శ్చకాస్తి।
ఆరాచ్చ విద్యాధరతీర్థవర్యా, ద్యత్రాఽవిరాసీ చ్ఛుభగవాన్ కుమారః॥ 7॥
శ్లో॥ద్విజ స్తస్మి న్నేకోఽవన దుపవనద్రావిడవరః। ప్రసిద్ధో వీరాఖ్యో జనిముపగతో
లోహితకులే। లసచ్ఛ్రీగోపాఖ్యో నియమితమనా స్సం చ్చచిరపి। హ్రదాలోకేకురవ
న్దినకరనతీ ర్భక్తికలితః॥ 8॥ శ్లో॥ప్రాణాంభోనిధిరంధ్రవారిధిమితే ష్వబ్దే ష్వతీతేషు
స। త్స్వకల్యాదిచ శాలివాహనశకే షట్పాస్త్రిమాసేందుషు। క్రోధ్యబ్దేచ సహస్య
మాస్యధవళే పక్షే తృతీయే తిథౌ। జజ్ఞే తస్య చతుర్థసూను రిహచాఽముత్రాఽ
ర్థసంసాధకః॥ 9॥ శ్లో॥ఛాత్రాణా ముపబృంహణా దుతలసద్ధర్మస్యపుణ్యస్యవా। వి
ద్యాయా అథవా నచే దధిగతబ్రహ్మైకభావస్థితేః। యద్వాఽశేషజనోపకారక
కలాశాలాదినిర్మాణతో। బ్రహ్మే త్యుత్తమనామ సార్థకతయా పిత్రాఽస్య నిర్ధా
రితం॥ 10॥ ...శ్లో॥వారాణసీం। జిగమిషుః పరిశిష్టశాస్త్రః। పాఠాయ భూసురవర
స్స గురోరనుజ్ఞాం। లబ్ధ్వాతికౌతుకయుత స్తదను ప్రతస్థే। పౌరై స్సతీర్థ్యనివహై
రపిభూష్యమాణః...శ్లో॥ ఏవం పరత్రాఽత్ర సుఖైకహేతుం। వారాణసీం ప
ణ్ణివరోవివేశ। దేశాచ్చ దేశం విచరన్ జవేన। విశ్వేశగఙ్గాబుధదర్శనేచ్ఛుః॥31॥
.....శ్లో॥కాశీనాథబుధో హి యద్గురువరః కాశ్యాంప్రశిష్టోయితో। యచ్ఛిష్యస్సకలా
ర్థవిద్గురుయశాః శ్రీబాలశాస్త్రీ మహాన్। ఏవం శ్రీహరిశాస్త్రి సుత్తమగుణో వా
క్యార్థవాన్త్రీకరః। కాశ్యాంభూపనిషేవితో వ్యజయత శ్రీరాజరామో బుధః॥34॥
శ్లో॥సంఖ్యావత స్తస్య పటు స్స సన్నిధౌ। వ్యాఖ్యానకోశాన్ పఠితుం ప్రచ
క్రమే। సఖ్యాద్భృతస్స న్విబుధేన్ద్రమండలీ। ప్రఖ్యాతకీర్తిః కలితః కలాగుణైః॥
35॥ ... శ్లో॥అత్రాన్తర్నిజసహజేన పత్రికాఽస్యా। దాహూతః పరిణయ
మన్య కర్తు మారాత్। గుర్వాశీర్గణపతిపూజయో స్తదాత్వే। ప్రత్యక్షం ఫలమివ
దర్శితం జనానాం॥ 41॥ ...శ్లో॥ఇతి షోడశవాసరా నుషిత్వా। నిజగేహే స్వవివా

ష్యులు గురుపట్ల నిట్లనుమి కొందఱు శిష్యులు వ్రాయువారిఁతః లే
ఖులుఁడును పాడువారిఁతలకు గా దిగఁ గం చిది చెప్ప నుప్పగన్. ౧౩౦

---

హ సంభ్రమేణ। నిజసోదరదుర్గపండితేన। ప్రతిగన్తుం ఖలు నిశ్చికాయ కాశీం॥ 52॥ ...శ్లో॥షట్శాస్త్రేషు షడంగేషు షడ్భాషా షణ్మతేషు చ। ప్రజ్ఞా యస్య స్థితా తస్మై బ్రహ్మంతర్వాణయే నమః॥ 61॥...శ్లో॥ఇత్థమేవ నృపసన్నిధౌ బుధైః। శ్శాస్త్రిషడ్గవపరీక్షితో భవన్। శ్లాఘితో బహుమతస్సభాస్థలే। నిర్జగామ బుధనిర్జయాయ సః॥ 67॥ శ్లో॥ అయోధ్యాకురుక్షేత్రనేపాలగంగో।త్తరా నైవేద్యనాథం జగన్నాథతీర్థం హరిద్వారకేదారబృన్దావనాద్యం। మహాక్షేత్రజాతం సిషేవే సుధీరాట్॥ 68॥ ...శ్లో॥దూరేణ కాలనియమేన బహుద్విజానాం। కోలాహలేన నియతాశనభోజనేన నత్రేషు భుక్తి రధికశ్రమకారిణీతి। జ్ఞాత్వేహ శిష్యనివహాయ దదాతి చాన్నమ్॥ 72॥...శ్లో॥ఇతి జగదుపకారస్య। ప్రతిపద మఖిలైస్సు నుత్యమానస్య। పరిణామశూల బాధా ఽపరిణతవయసోఽపి దేశసంచారాత్॥ 78॥...శ్లో॥ శనకైరగమద్విద్వాం స్త్వగ్రామం "సుకడియద్ద" నామానం। శ్రీరామో వనవాసాదివ సాకేతం నృణాం ప్రమోదేన॥ 97॥ ...శ్లో॥ స్వసాల్యకః పఠితు మారభతాఽగమం యః। శాస్త్రాణి పాఠయతి శిష్యగణం స్వవశ్యాత్। విద్యార్థితాం తిరుపతిః కవివేంకటేశో। యాతౌ చ యా కవితయా గురుకీర్తిసాన్ద్రా॥ 101॥ శ్లో॥ కింను తచ్ఛాత్రనామాఖ్యయా స్యాత్ఫలం। తస్య సంఖ్యా మతీతాగతా ఛాత్రతాం। చిత్ర మేత న్మహత్తే ష్విహైకోఽపి వా। ప్రాకృతోఽపండితో నాఽభవత్పశ్యత॥102॥ ...శ్లో॥మహానద్యా రోధశ్చిరపరిచరియా దత్రిచ మహా। నదీతీరే వాసం మనసికలయ న్పండితవరః సహచ్ఛాత్రై ర్గాతమ్యఘహరతటే వస్తు మనసా। నిజగ్రామా ద్వాసం ధవళగిరి శాదే ష్వలభత॥ 105॥...శ్లో॥ న కేవలం ఛాత్రగణాయ భోజనం। దదాతి పాంథావళయే చ సన్తతం। తత స్తదీయం సదనం సమీర్యతే। న పాఠశాలేతి నసత్ర మిత్యపి॥ 107॥ శ్లో॥రాత్రౌ త్రియామారా సమయే ప్రబుద్ధః। క్రమేణ శిష్యానఖిలాన్ప్రబోధ్య। శాస్త్రాణి సంపాఠయితుం ప్రవృత్త। స్సమాపయేద్ద్వాదశఘంటికాన్తే। 108॥ శ్లో॥ వ్యాఖ్యానేషు సుపాఠయన్ ప్రథమత స్తద్వాక్యశాకాం ఛాత్రవయే, త్పశ్చాత్తానపి పాఠయం స్తదధికాం త్సంశ్రావయే ద్బోధకృత్। ఏవం సర్వకలార్థినాం క్రమవశా త్పాఠాం త్సమాప్య స్వయం, మధ్యాహ్నే దధతా న్పరస్పరమహో పాఠా న్స్వన శ్చింతయేత్॥ 109॥ శ్లో॥చిత్రం కేచన కావ్యనాటకమహాలంకారచ

ఉ॥ గుణశక్తిన్ బరఁగు ప్రచారనిరత శ్రీరాజవనీపాల సం
హారణప్రాప్త యశోభిశోభి జమదగ్న్యాత్మోద్భవున్ దెల్పు నా

---

మ్నాముఖ। గ్రన్థా న్వ్యాఖ్యకశిష్యవర్గసవిధే సమ్య క్ప్రవర్తన్తే ఽనిశం। సాహిత్యప్రచు
రాన్తత స్సవినయం బ్రహ్మాఖ్యసూర్యన్తికే। శ్రీమద్వ్యాకృతి మధ్యగీషత కిమ స్యై
న్మాత్రకలాకాంక్షిణాం॥ 110॥ శ్లో॥ యాదృక్ప్రేమ గురో స్స్వశిష్యనివహే గురావ్య
స్తతో ప్యన్నతం, ఖ్యాతైః కిం సుతనిర్విశేషమపి తౌ సంపశ్యతో జంపతీ, దూరే
బంధుజనా న్విహాయ పితరౌ దేశంచ విద్యార్థినాం, బాలానాం కిము సౌఖ్య మస్తి
గురునకారుణ్యతో ఽన్య ద్భువి॥ 111 శ్లో॥ శ్రీకాశీసంప్రదాయానుభవ మనుసృత
స్తత్రివిద్వద్వరిష్ఠో, వర్షేవర్షే స్వశిష్యైర్గణపతినవరాత్రోత్సవం కారయిత్వా, భూ
రిద్రవ్యవ్యయేఽపి స్వయ మధిక యశోభాజనం సన్మహాత్మా, కాశీతో ఽప్యన్నదానం
సమధిక మితి సంశ్లాఘితో బోధవీతి॥ 114॥ శ్లో॥ దానం కలావమృతసాధన మిత్యవో
చన్, దానే ష్వనుత్తమమితి స్మృత మన్నదానం, ప్రత్యక్షభూతపరితృప్తినిదాన
భూత, మిత్యన్వహం పరితనోత్యమితాన్నదానమ్॥ 115॥ శ్లో॥ ద్విజో భూత్వా కిం స్యా
త్ఫలమిహ నచే చ్ఛాత్రవరనం, నశాస్త్రేణా స్త్యర్థో నయది పరసంబోధనరతిః
తయా నాప్యస్త్యర్థో యది న సదనుష్ఠానపరతా, పరం తత్త్వా సాఽపి ప్రకృతవిబు
ధేఽస్మి న్విలసతి॥ 116॥ శ్లో॥ నిస్స్వాననన్యగతికా న్నితరా న్ద్విజాతీ, న్విద్యార్థినశ్చ
కృతదారపరిగ్రహాంత్స్వః। కాశ్యామివ ద్విజసిమనకరితాప్రదాన, లబ్ధాతిదోషహార
ణాయ కరోతి విద్వాన్॥ 117॥ ...శ్లో॥ మధ్యే మధ్యే కేనచి ద్ధేతునాఽయం। భక్త్యై
ర్భోజ్యై ర్లడ్డుకై రన్నదానం। భూదేవానాం సంభ్రమా త్వంతనోతి। ప్రాజ్ఞ
స్యాఽస్తే భూతతృప్తేః పరం కిమ్॥ 125॥ శ్లో॥ అశాశ్వతో దేహ ఇతి ప్రసిద్ధం, భూయా
త్థిరే ఽస్మి న్మఠారశాలా, ఇతీవ మత్వా స్థిరజీవనార్థం, స్థిరాం సమార్జ్య స్థిరకీర్తి
రాసీత్॥ 126॥ శ్లో॥ చిరంద్వాదశవాసరేషు మిళితాన్ గోదావరీపుష్కర, స్నానా
ర్థం ప్రతిపక్తి చోపదిశతో విప్రాం త్సహస్రాధికాన్, నాఽభోచ్య శ్రమమన్న
తం ధన మయం సంపాద్య భక్త్యాదభి, స్సంతర్ప్యా ధిక పుణ్య మాప భువి కిం
దృష్టః క్వచి త్తత్సమః॥ 127॥ ...శ్లో॥ వికారినామా ఽనువికారకారీ, సమాగత
షడ్గ్రహకూటతో ఽబ్దః, పుణ్యో ప్యయం బ్రహ్మగురో రతీవాఽ, సహిష్ణునాజ్ఞప్త ఇ
వాబ్జజేన॥ 129॥ శ్లో॥ భూదేవాయుతతర్పణం దశదినై ర్గోహదతీర్థోజ్జ్వల, తోఽవ్వూరా
ఖ్యపురేఽస్తి ప్రవిలసచ్ఛ్రీకోటిలింగస్థలే. క్షేత్రే పాదగయాహ్వయేఽపిచ నిజశ్వే

కదరే! యిట్టిఁడ వెట్లు శిష్యుఁ డయితో? యంతేవసద్ధర్మకు
ర్మరణోపజ్ఞదురుద్వమక్వథితధీర వాత్రిత చేతోంబుజా.           ౧౩౧

మ॥ గురుభక్తిప్రథితుల్ మహామహు లనేకుల్ సర్వలోకైక దు
స్తరవిస్తారిత నిస్తులైన ననితాంతధ్వాంత నిర్మూలనా
పరభాస్వత్తప భానురుల్ వాలుచు నికాలంబునన్ నాకు నీ
వరరే? శిష్యుఁడ వెట్టులైతివొ కదా? యాచార్యనిందావహా.          ౧౩౨

---

తాద్రిపుర్యాం తథా, కర్తుం బ్రహ్మానుధీ రియేష జగతః క్షేమాయ కామాయ చ॥ 130॥ శ్లో॥ నవగ్రహ జపగ్రహ ప్రభు నమస్క్రియా వేదన, త్పురాణపఠ నాదిభి స్సవది గోపదక్షేత్రకే, సుతర్పయితు మన్వతో దినసహస్రవిప్రోత్తమా నుపాక్రమత బాహుళ ప్రథమవాసరే పండితః॥131॥ శ్లో॥ జగత్త్రయతో బతప్రవిర తా జగత్త్రైమక్రు, ద్బుధోత్త మవినాశనే జగదుపప్లవ స్స్యాదితి, తదష్టమది నే బుధం జ్వరబలేన సంపీడితం, కృపావిరహితా ముహురుహుశ్శరకార్షు రుగ్రగ్రహాః 132॥ శ్లో॥దశమ్యాం కృతార్థస్త్రిథా బ్రహ్మవిద్వా।నుపక్రాన్తమన్త్రాదిశాన్త్రిం సమాప్య, సుభక్తేషు విప్రేషు పశ్యత్సు తుష్యన్। పరిత్యజ్య దేహంగతో బ్రహ్మణైక్యం॥ 133॥ శ్లో॥ దివంగతే బ్రహ్మబుధేధరాஉసీ.త్సుశబ్దహీనా బతధర్మశూన్యా, కలార్థివర్గో విఫలో బభూవ। క్షుధాతురః పాన్థగణ స్తదాஉసీత్॥ 134॥... శ్లో॥ తత్స్యాలః పతితాగమ స్సుగుణభా, శ్రీవిశ్వనాథో బుధ।స్థిత్వా తత్రతదార్జితావనిఫలై ర్వర్షాశనై స్స తర్పితైః. విద్యార్థిప్రకరం యథాకథ మథో తత్పాఠశాలాగతం, విద్యాబుద్ధి యుతం కరోతిహి గురో ర్థన్యత్వమాపాదయన్॥136॥ శ్లో॥ వేమూర్యపాఖ్యనరసింహ కృతం సభక్తి, శ్రీబ్రహ్మపండిత చరిత్రమిదం పవిత్రం, యావద్దివాకరనిశాకరతారకాళి। స్త్రావ జ్జయే త్సుఖయుతా మనుజా భవేయుః॥ 137॥ శ్రీ. శ్రీ. శ్రీ శ్రీ. శ్రీ.

(శ్రీగురుబ్రహ్మైక్యమునుగూర్చి మేము చెప్పినది.)

మ॥ కలిమానం బాకయైదువే లరుగ నేకత్రస్థసప్తగ్రహ, మ్మలకున్ శాంతి నొనర్పుచున్ శ్రమ లవమ్మున్ లేకయే బ్రహ్మమున్ గలిసెన్, బ్రహ్మగురూ త్తముండు దశమిన్ గంజాప్త వారంబునన్, ఖలసంచారి వికారి కార్తికవలక్ష శ్రీకపక్షమ్మునన్,                      తి॥ వెం॥

మ॥ ఒకఁడుఁ గన్పడఁ డిట్టియీకలిని నీ కోశిష్యుని తుల్యుండు పా
య నుపాధ్యాయునిఁ గొల్వకున్న నతఁ డత్యంతమ్ము పాపాత్ముఁ డం
చకటా! వ్రాసెడియంత సాహసి; మదీయాఘప్రభావంబె నిన్
వికలాత్ముం బొనరింపఁబోలునుజుమీ! వేత్తృత్వసత్తాఖనీ. ౧౩౩

శా॥ నీకున్ జిక్కిన యీకృతఘ్నతను నేనే నేర్పినట్లే తుదిన్
లోకుల్ వాకొనువార లేమొ! యని లోలోఁ జింత నేఁ గాంతు వి
ద్యాకల్పద్రుమ లస్మదీయగురు లేతన్నింద రాకుండ నా
పాకం బేర్పడఁగా వచించి ననుఁ గాపాడన్ బ్రియత్నించుతన్. ౧౩౪

ఉ॥ ఏకుటిలంపుఁ బాపములు నీయఘతుల్యము కావు భారత
శ్లోకము లిట్లు చెప్పు నవి సూరివరుల్ శిరసావహింత్రు నా
శీక, *చరిత్రలోఁ గను మశీకము గాఁ దలపోయఁబోకు మా
రాశి కలికాలమేని యఘ మంత సహింతురె ధర్మచింతనుల్. ౧౩౫

చ॥ గురుఁ డొకచో సహేతుకము కొండొక వేఁడిమి నూనుఁగాక క్రో
పరసము తగ్గఁ జేయుట కుపాయము లుండవె! వానిమీసముల్

---

*(మహాభారత శాంతి పర్వమునుండి)

శ్లో॥ బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా రాజన్ కృతఘ్నే నాస్తి నిష్కృతిః
కుతః కృతఘ్నస్య యశః కుతః స్థానం కుతస్సుఖం
అశ్రద్ధేయః కృతఘ్నోహి కృతఘ్నే నాస్తి నిష్కృతిః॥

(తెలుఁగు భారతము నుండి.)

క॥ అని చెప్పి తాత యిట్లను, మనుమనితో నాదరమున మఱియును బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును, వినుము కృతఘ్నునకు లేదు విమలచరిత్రా.

క॥ ఆరయ మిత్రద్రోహము, దారుణ మగుపాతకము కృతఘ్నతకంటెన్
వైరము గొని విడువ వలయు, నారెండు తెఱఁగులవారి నాప్తులనైనన్.

§(స్కాందోత్తర ఖండస్థ గురు గీతనుండి.)

శ్లో॥ శివక్రోధా ద్గురుస్త్రాతా, గురుక్రోధా చ్ఛివో నచ
తస్మాత్సర్వ ప్రయత్నేన, గురో రాజ్ఞాం న లంఘయేత్॥

బెఱుకుట, వానిగ్రంథములు వెక్కిరిపించుట "వేరు" లాటయుగ్
జరిగెనె యెన్నఁడేనిఁ యొక్కశాస్త్రి నుదాహరణంబు చూపరాదే. ౧౩౬

ఉ॥ ఊరక యుండు నేని యఘ మూరక యుండదు నీకు బాధకం
బై రహిఁ బీడ వెట్టు నది యన్నదభీష్టము గాద యిప్పుడో
కారణ మొండి కాళ్లఁ బడఁగాఁ జనుదేరక యుండుగాక నీ
దూగచనగ్ గుఱించి మది దుఃఖము చెంది సుఖింతువావయిగ్. ౧౩౭

చ॥ ఎఱిఁగి యెఱుంగ కేయఘము నేని పొనర్చియుఁ బిమ్మటగ్ జనుం
"డరరె? యఘంబు చేసితి నటం చొకకొంత మదిగ్ దపించి దు
స్తర మగుపాపమేని యును దాఁటఁగఁ జాలెడిఁ బైకిఁ బాపమున్
బారయుట తెల్పనేని సరిపోయె నిరాగసుఁ డాతఁ డంతతో. ౧౩౮

ఉ॥ ఎన్నఁటికేని గాళ్లఁ బడుటే నదుపాయ, మఘంబు నాఁడె పోఁ
పన్నగిలుగ్ గురుగ్ దెగడుసాహన మూని యెదో లిఖించి నం
పన్నగ్రహాస్థు లౌజనులమన్ననఁ గైకొన వెవ్వరో నినుగ్
"బన్నము బాగు బా" గనినఁ బాడకు నోరికి వచ్చినట్లుగన్. ౧౩౯

ఉ॥ చెప్పెడివారు నీ కకటఁ శ్రేయము కూర్చెడివారు గారు నా
చప్పనికూఁతలే తుదకు సద్గతిఁ జూపును నీకు; సూర్యరా
విప్పుడు నిన్నుఁ గైకొనుటకేనియు నే నిడుచప్పకూఁతలే
తప్పక కారణంబు సుమి తప్పదుత్రో విఁక నేని వీడుమీ. ౧౪౦

---

## (7) ఆత్మవైభవపర్వము.

ఉ॥ నన్నును గారవించు నరనాథులు లే కొకసాఁకు వన్ని నీ
యున్నపదంబునం దెటులనో పడ నెంచితి నంచు నెంచ కెం
దు న్నను గారవించు నృపతుల్ శత మన్నను లోక మొప్పు నీ
వన్నను విశ్వసింపవలదాఁ యిలఁ దా నకలం బెఱుంగ దా. ౧౪౧

ఉ॥ అప్పనృపాలుఁ డింక సుకయబ్దములోఁ దన పొకెఱింగి మేల్
చిప్పిల "శాస్త్రిగారికెటు చేసితి వార్షిక మెల్లకాలమున్
దప్పక యట్టులే యిడుఁడు నాకు ముదం బగు దానఁ జేసి" యం
చొప్పఁగఁ జెప్పె నీ, వెఱుఁగవో సుత! కోకిల వైతి వంతకే ౧౪౨

ఉ॥ ఎఱుఁగుదె యప్పరాయనృపుని నించుక యాతనిసొమ్ము కాకితోఁ
దిరిగెడునష్ట లింటి వది తేసువు వచ్చినయప్పుడైన న
న్నరపతి నన్నుఁ జూచెడు ఘనం బగు చూపు స్మరింపు మయ్య! త
త్పరులు *కుమారు లానృపువిధమ్మునఁ జూతురు నన్ను నేఁటికిన్. ౧౪౩

తే॥గీ॥ *ఆత్మకూరును గద్వాల యరయుచుండు, నాదు రాకకు నేటేట; నీదురూహ
నీకు నుదయింపనేటికి నిన్నుఁ జెలిపి, బాగు పడనేల యిగదఱు ప్రభువు లుండి.

మ॥ వనిగాఁ దా బెజవాడలో డిగినుమాని ప్రార్థించె మున్నిచ్చు భూ
మిని వేర్మింగొని తండ్రిగారి యశముల్ మెట్టికగాఁ జేయుఁ డం
చును శ్రీయాత్మకురు ప్రజాధిపుతనూజుం; డాతనిం బోలు వా
నిని జూపింపుము నేఁటిరాజులను నెందే శిష్యచూడామణీ. ౧౪౪

---

నూజివీడు.

16-4-11

మీరు ఈడిసెంబరులో నెంతత్వరగా రాగలిగిన అంతత్వరగా వచ్చిన మా అందఱికి చాలాసంతోషము గలుగును...నారయ్యప్పారావు.

---

## *TELEGRAMS.

---

MADRAS.

Starting Bezwada to-morrow morning 8-15 train come Bezwada.

29th July 1911. RAJA OF AMARCHINTA.

---

COCANADA.
19-7-1911.

Atmakur Raja coming Bezvada to-morrow evening meet positively.

---

శ్రీరాజా సూరానేని వెంకట నారాయణరావు బహద్దరు జమీందారు వర గణీ ముయిలవరం వగయిరాదారవారు ఈండం.

ఈనెల 19 తేదీని ముయిలవరం గ్రామములో మీచేత శతావధానము చేయిం

ఉ॥ ఇచ్చిన భూమి పుచ్చుకొన నేగని మావయి నల్గురు బూనకే
వచ్చి గ్రహింపుఁ డంచ నసునృపాలురు గూడను నేఁటి యాకలిన్
గ్రిప్పుట నుండిరే? యశము గాక మఱొక్కటి నిల్చుఁ బోదు త
త్ప్రచ్చరితంబు శాశ్వతము దానము మీ మది పట్టుకుండినన్, ౧౪౬

చ తలచినాము. గనుక మీరున్ను బ॥ శ్రీ॥ తిర్పతిశాస్త్రిగారున్ను మయిలవరం మకాముకు 18-4-11 తేదీకే రాకోరుతాము. బ॥ తిర్పతి శాస్త్రిగారికిన్ని ఈ ప్రకారమే వ్రాయించి యున్నాము. వారికి మీరుకూడా వ్రాసి యిద్దరు కలసి రావలయును...తప్పక ది 18-4-11 తేదీకే రాకోరుతాను...గనుక తప్పక రావలయును.

మైలవరం 7-4-11 — R. S. V. Narayana, Rao. Bahaddar.

---

శ్రీరాజా వెల్లంకి చిన వెంకటరామారావు బహద్దరు జమీందారు ఆఫ్ నడిమితిరువూరు అండ్ వినగడప వగైరా యస్టేట్సు దొరవారు దంణము.

......అప్పుడు శతావధానముకూడా మీవలన చేయించవలెననివున్నది. మేము 1 డిశంబరుకె బందరు చేరుచున్నాము......వెంటనే జవాబు వ్రాయించవలెను.

చిత్తగించవలయును.

31-11-1912, మదరాసు. — RAJA VELLANKY CHINA VENKATA RAMA RAO BAHADDAR.

---

Madras, 24-10-12.

(శ్రీరాజా నడిమితిరువూరు అండ్ వినగడప వగైరాయస్టేట్సు దొరగారి వద్దనుండి.)

......శతావధానముకూడా చేయించుచున్నాము......6, 7 తేదులకు తమరు బందరు మకాములో వుండుటకు ప్రార్థించుచున్నాము...... మీజాబుకు యెదురు చూచుచున్నాము. చిత్తగించవలయును.

---

☞ ఇంకను జమీందారుల యాహ్వానములు పెక్కులుకలవు. అవి మఱియొకచోటఁజూడఁదగు, గ్రంథవిస్తరభీతిచే నిట నింతతో సంక్షేపింపఁబడియె.

ఉ॥ గుంటురి పోరుహేతువునఁ గోరిన యానరపాలుఁ జూడఁ బో
తుంటిమి యానృపాలమణి యొండొక సైఁచునుగాక మమ్ము "హు
ష్షంట మటెవ్వరో నుదువుమయ్య! భవన్నరపాలుఁ డొక్కొ! యా
దంటయు నొప్పఁ డీనుడికిఁ దజ్ఞుఁడు యోగ్యుఁడు నేనెఱుంగుదున్. ౧౪౭

ఉ॥ ఆయనయొద్ద సెక్రెటరి యత్యములుం డతఁడేని యిట్లుగాఁ
గూయునెడన్ సహింపఁ డలకోవిదుదర్శన మాయె నాకు బల్
ధీయుతుఁ డంచెఱింగితి విధేయుఁ డతండును 'హుష్షు'వల్కఁ డో
హో! యెవ రాడకుండినను 'హుష్షు' జనించె భవన్ముఖంబునన్. ౧౪౮

క॥ గుంటురి గుంటల వ్రాఁతలు, గంటిని బలికెడి నటంచుఁ గ్రమ్మికొనెదొ య
ప్పంటికి గుంటురి గొంటరి, జంటలు జనియింపమిన్ బొనంగ దది సుతా.

తే॥గీ॥ ఇంకెవరు 'హు, ష్షనిరొ' పేరినెత్తి తెల్పు, మల్లవారినె మెప్పించి యడఁతునీదు
తప్పదుప్రసంగమును వృథా మెప్పవగుచుఁ, బాదువ్రాఁతలుగెల్కెడే భయమువిడిచి

శా॥ *నన్నాసుల్ మొద లెల్లరాజులు ననున్ సారజ్ఞుఁగా నెంచి పే
ర్మి న్నామాటలయందు నించి యనువర్తింతు ర్గురున్ బోలె 'హు'
ష్షన్నా! యెవ్వరినోట వచ్చినదొ నా కామాట వ్రాయుచ్చు వా
రి న్నేనే చనియడ్డెదన్ ఘనుఁడొ సూరి శ్రేష్ఠుఁడో భ్రష్టుఁడో ౧౫౧

ఉ॥ భ్రష్టుఁడు వల్కెనేని యలవానికివందనముల్ ఘటింతు ను
త్కృష్టుఁ డెవండుగాని చని కేల్మోగిపింతు వృథాగ నెందు క్లి
ముష్టిప్రసంగ మారవురి? మూర్ఖత యెంతకు వచ్చెఁ దిర్పతి
ద్రష్ట నెదుర్పలేక పెలుచన్ గుటుచల్ లిఖియింతువే సుతా, ౧౫౨

---

శ్రీమత్పర దేవతా ప్రసాదోస్తు.

క॥ *దేవీ భాగవతాంబుధి, భావామృతము న్మథించి భక్తవశుల నం
భావించు మీదుచరితము, పావనమై దచ్చికడలఁ బ్రఖ్యాతి గనున్.

గీ॥ చక్కెర మెక్కెడి చలిచీమ వడువునఁ, దీపినీటి కెక్కు చేఁపవగిది
భాగవతామృత పానసంసక్తమై, దనివి చనద దేమి దాహమహిమొ.

(పరమ శివేంద్రసరస్వతి) జ్ఞానానందుఁడు

మ॥ ఘనతేజుండు దివాకరుం డనఁ *గృతఘ్నఘ్నుండు తద్దేవు పే
రున నెవ్వానికులం బిలన్ వెలసె సారూప్యస్థితిన్ వానితోఁ
బెనఁగన్ జాలుకృతఘ్నులుండు నెడ రేపే వచ్చి సాక్షాద్వరో
చను నూడించుఁ దమస్సమూహ జలదస్వర్భాను కేతుప్రభల్. ౧౫౩

మ॥ ఎవరీ 'హు, ష్షను వాఁడని నీ వెఱుఁగుచో నేర్పాటుగాఁ జెప్ప వా
రవనీపాలురొ? మంత్రిసత్తములొ? లోకాలోకపర్యంత భూ
భువనవ్యాపృత దివ్యకీర్తికలనా స్ఫూర్తిన్ విడంబించువా
రెవరేనిన్ జని వారిమెచ్చుగొని నీ యీవాక్కు బంధించెదన్ ౧౫౪

మ॥ ఎవ రా ''వాసియు వన్నెయున్ గలుగువా రెందుండువా రెట్టివై
భవ మొప్పారెడువార, లేమతమునన్ బద్ధాదరుల్? నెవ్వ నీ
కవనమ్మున్ గురుభక్తియున్ మిగుల శ్లాఘాపాత్రముం జెంచిన
న్నవమానింపఁగ "హుష్షు హు"ష్ష నిరోకోని యంతేవసద్ధూర్వహా. ౧౫౫

శా॥ భావత్కప్రతిభం గనుంగొని భవద్వాణిన్ విలోకించి నీ
భావంబున్ సరిగా గ్రహించినయెడన్ బల్కం డొరున్ "హుష్షు" నీ
చేవల్ సూచినవాని కింకొకని పైఁ జీకాకునుం బుట్టునే?
దేవానాంప్రియతాఖనీ! గురుని నిందింతే యసత్యోక్తులన్ ౧౫౬

మ॥ ఒకసందర్భముఁ జూచినన్ సకలమున్ రోజింపఁగా వచ్చు నీ
యకలంకత్వము వేఱె చెప్పవలెనే యాయీ దురుద్యోగమే
ప్రకటించున్, బునరుక్తి కాస్పదుఁడనై వర్ణించుచోఁ ,,జై ప్యాకం
డొకఁడోని సిద్ధి,,యటన్న సామెత సుమీ యూహించుకొ మ్మాత్మలో. ౧౫౭

చ॥ గురుఁ డెటువంటివాఁడు గుణకోటియెడన్, జరితంబుపట్ల, శాం
కరి! నను నెట్టివానిగను గన్గొనె నేర్చితి, తచ్చరిత్రమున్
బరిపరి నాచరిత్రమును బట్టి వచింపు మటన్న స్వప్నమం
దరయఁగఁ జేయనంబిక యథార్థ మటుల్ భజియింపు మీశ్వరిన్. ౧౫౮

---

* (శ్రీమద్రామాయణములోని ఆదిత్య హృదయమునుండి-)
శ్లో॥ కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః

ఉ॥ ఆపె వచించు సర్వమును నాయమ కెందును లేదు గోప్య మే
పాపము నెట్టి పుణ్యమును బాలన చేసెడి తల్లి "హుష్షు,, దా
నీవయి యుంచునో? నిను గణింపక నావయి యుంచునో? వృథా
లాపము లాడ్చి కిన్గెనుము లక్ష్యము తప్పక కొల్వు మంబికన్,,. ౧౫౯

క॥ గురుశిష్య ధర్మముల శం, కరుకతనన్ వినియె నాపెసాక్రాంతమునం ది
త్రెఱఁగు కనం బడు నీకున్, దరణోపాయంబు చూపఁ దగు నాపె సుతా.

క॥ ఔరా! నను హుష్షని నీ,సారాచారములు మెచ్చుజనులుం గలరో
క్రూరమ్మరమ్మపోవుద,మీరాజన్యకడకేని యిది తేటపడున్. ౧౬౧

ఉ॥ మూల ముడింగి సారెకును ముష్టిప్రసంగము నీవు బావయున్
జాల లిఖింప వచ్చు నేకసక్కెము లాడఁగ వచ్చుఁగాక టా
ట్టా లెటు సాగు వేరొకయెడన్; బొనరించినలోపముల్ వృథా
ప్రేలుటలున్ శిరమ్మునను వ్రేఁగు ఘటింపక యూడఁ బోవునే. ౧౬౨

ఉ॥ ఎన్నిటినేనిఁ గప్పు జగదీడ్యతరం బగుశక్తి, యట్టిదే
యున్నయెడన్ గురుండెగడి యున్నతిఁ గోరఁగ నేల? కీర్తికిన్
దిన్నని త్రోవయే కలదు దేవుఁడు దాని నొసంగకుంటయే
యిన్నిదానంగు లిక్రూరణి నీవొనరించునిమిత్త మర్భకా. ౧౬౩

శా॥ పాపంబుల్ తలురీతు లందెదియొ యెప్పాటన్ మనుష్యుండు తా
మాపో రేపో యొనర్పకుండుట యసంభావ్యంబు, నేఁడన్నిపా
లాపానాతులు పైతముల్ ఘనులె హేళన్ జేయుచున్నారు నీ
వాపాదించుకృతఘ్నతా భర ము?త్యాజ్యంబొఁ జుమీ యేరికిన్. ౧౬౪

ఉ॥ దీనిమహాత్మ్యమున్ దెలిపి తిన్నని త్రోవను బెట్టుచున్నచో
హీనునిగాఁగ నన్ విబుధు లెంతురు నీకును లేదు ముక్తి; డెం
దానఁ బునః పునర్మనన నాగురుతన్ గుఱిచేసి చేసి వ్యా
ఖ్యాన మొనర్చి తిన్నఁ బడి కైకొనుమయ్య కుమార! భద్రముల్ ౧౬౫

క॥ నినుఁ జెఱుప నెంచినన్ న,న్నును *"నేదో' 'కవి, యటంచునన్ దిట్టిన జా
బును ఔనియొద్ది కంపినఁ, బనుపడదే, నాదుకోర్కె బ్రహ్మాండంబే ౧౬౬

తల్లెపాలెము.

*"శ్రీగంగాభాగీరథీసమానులగు... రావుగారిగ్రా. నీవు వెంకటరామక్క

ఉ॥ "ఎప్పటికేని నీవచటనే సుఖ ముందువుగాక, నాదుపే
ర్చెప్పకయుండినన్ నృపతిచే వినిపించెదఁగాక నీదు వా
తప్పుడుపేరు లీశతవధానమునుండి మరల్తుఁగాక" యం
చిప్పని బూనితిన్ జరిగె నిన్నియు నొక్కటి తప్పకుండఁగన్,, ౧౬౨

---

ష్ణకవులకును తిర్పతి వెం(+కవులకును తంత్రముపెట్టినట్టు విన్నాను నీకు అందువల్ల వెం(+కమైనను లాభము లేదు, ... నా పేరువ్రాయక పోవుట మరచి వ్రాయలేదు. (బూతుమాటతో చేవ్రాలు.)

☞ షరా, ఇందు చేవ్రాలు మాలమాదిగలుకూడ నుచ్చరింపని బూతుమాటతో వ్రాయుటట్లుండనిది యెవరినుద్దేశించి వ్రాయఁబడినదో వారిని దిట్టిన తిట్లకుఁ బరిమితి లేదు మఱియు నీయుత్తరము కాని కార్డుపై వ్రాయఁబడినది మొదట పెన్సిలుతో వ్రాసిపిదప వేఱొక సిరాతో దిద్దఁబడియున్నది — ఇఁక నొక మాదిరి సిరాతోఁగూడ నొక కాముడియుఁ గొమ్మును సవరింపఁబడి మొత్తము మూఁడు వ్రాఁత లుపయోగింపఁ బడినవి కార్డుపైని అడ్రెస్సు మ॥ రా॥ రా॥ అనియున్నది లోపల వేరువిధముగానున్నది బూతుపేరితోఁ జేసిన వ్రాలు కార్డుపైనిగూడ పెన్సిలుతో వ్రాసినది కలదు మఱియు నిట్టిదే వేఱొక యుత్తరముకూడ నిట్టిచేవ్రాలుతో నీయననుద్దేశించియే వ్రాసినది కలదు. విషయభేదము లేదుగాని యందలియంశములు మఱియుం బచ్చిగానున్నవి. ఇందు రెండుబొమ్మలు వ్రాయఁబడియున్నవి. ఎన్నో బూతులనేకవిధముల నసందర్భముగా లిఖింపఁబడి యున్నవి. అవియేవియు నిందుదాహరించుటకు రాజశాసన మొప్పదుకాని యందుఁ దుట్టదుదను వ్రాసిన తప్పుడు సీసపద్యము మాత్ర ముదాహరణయోగ్యముగా నున్నది.

"సీ॥ పురుషుండవో కలి పురుషుండవో కాని ధూమకేతువుతోడతుల్యమగుచు భయమొకింతను లేక నిర్భయంబుగ నీవు గ్రామమృగరాజుతో తుల్యమగుచు, నీవలుకును దాని పలుకొక్కటియె కాని మాయదెప్ప డొక్క సారిగాని, తే॥ గీ॥ యిట్టినీ దుష్టచరితంబు యింపుమీర, వ్రాసినాడను నేను వహ్వాయనగ.

చింతగింజవలెను.

యు. మిష్టరు. (అవాచ్యపుచేవ్రాలు)

యీపత్రికలు యితరులకుహూడా పంపినాను."

ఉ॥ ఇప్పటికేని నీయెడలనే దయ నా కధికంబు, నీదువా
తప్పఁబ్రసంగ మంతగ నెదన్ జెదరింపదు నీవు పెట్టువా

---

☞ పైయుత్తరములు వ్రాయువారు వ్రాయించువారు వీనియందుద్దేశింపఁబడిన వారును జాలదగ్గఱబంధువులు, మాశిష్యులొనర్చెడి యసందర్భ ప్రసంగమును విని మండలించినందులకై వారివంకనుండి యిట్టియుత్తరములు వెలువడఁజొచ్చినవి. వీనికిసంబంధించిన రికార్డు సర్వమునుమావద్దనున్నది. ఇటీవల నీయవాచ్యపుటుత్తరములంగూర్చి బంధుసముద్రులు కొందఱుచేరి మండలింపఁగా జరిగినయంశము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

...“ఈమధ్య వెంకట్రామయ్య యిచ్చోటికివచ్చినాడు అప్పుడు యీయుత్తరము నాకువచ్చినట్లు ప్రసంగవశమున వచ్చినది,......వెంకట్రామయ్య తమ్ముడు సత్యనారాయణ ఎరుగక వ్రాసినట్లు దక్షిణామూర్తి మొదలగువారియొద్దను అన్నాడట, ......దగ్గరబంధుత్వకారణమున నేమియుదలచక మాటలాడ కూరకున్నారము, పాపపుణ్యములు భగవంతునకే యెరుక. ......మామీద లేనిపోని మాటలాపాదించి ఎవరువ్రాస్తే వారేయనుభవింతురని ......యూరకున్నారము...వెంకట్రామయ్య తమ్ముడు మాత్రము“మాఅన్నయ్య వ్రాయుమంటే నేనువ్రాసినా,,నని అక్కడక్కడ అంటున్నాడు. (చేవ్రాలు)

☞ దీనితరువాయినిగూడఁ గొన్నిపంక్తు లీక్రిందవి వ్రాయఁబడినవి.

“వెంకట్రామయ్యతమ్ముడు సత్యము అక్కడక్కడమాఅన్నయ్య వ్రాయమన్నాడు గనుక ... రాఘునకుత్తరములు వ్రాసినానని చెప్పడముచేత వెంకట్రామయ్యయే వ్రాసినాడేమోయని నేతలచి మొదట మీవిరోధములు నామీదకు కూడా వచ్చినవి యని మీపేరవ్రాసినాడను.”

☞ శ్లో॥ కర్తాకారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః। అనునార్యోక్తింబట్టి పైయుత్తరములలోని సంగతి సందర్భములను బట్టియుఁ బ్రాజ్ఞులు విచారించి మాశిష్యుఁడుగారి గురుభక్తిని నిర్ణయింతురుగాక ఇతఁడు చెప్పి వ్రాయించినచో నడుగనేయక్కఱలేదు తనంతటఁదానే యీతనితమ్ముఁడు వ్రాసినచోఁ దమ్మునిం బట్టియన్నగారివివేక మనుమేయముకాక మానదు ఆయాపోకలయందలి యోగ్యతను గూర్చి భగవంతుఁడును దత్తుల్యులగుయోగ్యులును విమర్శింపఁదగువారు

తప్పదుఁ బేరు లాశతవధానము పేరును మాపుచుంట నా
ముప్ప నడంచుపోంటె నిది పూనితి నిక్క్రము నమ్ము మర్భకా. ౧౬౮

ఉ॥ పూనినపూనికన్ దెలిసి "పొట్టకుఁ బూనితి నైఁపుఁ డంచు నా
పై నెనరుంచుఁ డంచు నొకపాటిది యుత్తర మంపికోక దు
ర్మానపుఁ ద్రోవఁ ద్రొక్కి యపరాధము పెంపొనరించి కొంటి వి
ద్వేనియు మంచిత్రోవఁ బడు మింక పరాధివి కాకు వాకులన్ ౧౬౯

ఉ॥ ఛాత్రత దాఁచి వేఱొకయసహ్యపు మార్గముఁబట్టి పూర్తిగా
శత్రుత వెళ్లఁబెట్టియుఁ బ్రసక్తికిఁ గాని ప్రసక్తిగా గురు
స్తోత్రము లన్యథా నలుపఁ జూచెద వింతటిలోనె నాయశ
స్సత్ర మపాత్ర మానెఁ? పలుసజ్జను లుండఁ గవీంద్రు లుండఁగన్. ౧౭౦

మ॥ అవధానంబొనరింప లేఁ డతఁడు నాయాచార్యుఁడుం గాఁ డటం
చవనిన్ మెచ్చఁగఁ జేయలేవు విను మబ్బా? "తప్పు సైరింపుఁడీ
యవివేకంబొనరించినాఁడ" నన నార్యస్తోమముల్ మెచ్చు "ము
ల్లు వెలార్పంగను గొట్టు గొట్టికొనుటల్" లోకుల్ ప్రశంసింతురే ౧౭౧

క॥ "దానునితప్పలు దండము,తో నరి., నామాట వినుము తుచ్ఛపుఁ బ్రాఁతల్
వ్రాసికలహమ్ముఁ బెంచకు, మోనుత? బుధు *లాడుమాటలూఁకొన వకటా.

*బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారి సన్నిధికి. (నవరత్నమాల.)

చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీతిలకుల్ విలసచ్ఛతావధా, నరతిదలిర్పనై కనరనాథసభాస్థలులన్ జయంబుగాం,చిర వరకీర్తి దిక్తటులఁ జెంది సముజ్జ్వలచంద్రికాపరి, స్ఫురణముఁ జూపఁ బండితులుభూరిముదంబున సన్నుతింపఁగన్.ఉ॥ఆరయ సర్వశాస్త్రములయందు సుదంచితమైన సాహితీ, ధోరణి మేలుమేలని బుధుల్గొనియాడఁ గవిత్వవిద్య కా, ధారము వీరలే యనఁగఁ దద్దయు మించు పొగడ్త గాంచియూ, ధీరు లుదారభావమున దీపితులై విలసిల్లుచుండఁగన్. ఉ॥ వేంకటరామకృష్ణ లనుపిన్నకవీంద్రులు నేఁడు వారికిన్, వంకలఁ బెట్టి వారలప్రబంధములందు వివర్ణనంబునాఁ, గొంకక వ్యర్థలోపములుగూర్చుట తాతకు దగ్గునేర్పవై,యింకిటఁ బండితోత్తముల కెల్లను గర్హ్యముగాఁ గఁదోఁచెడున్, ఉ॥ పిన్నలు వారు పైకొను కవిత్వపదంబున బద్ధులేమివా, కొన్నను రాజబాట గొని కుంజరమేగ మృగంబులెన్ని

ఉ॥ గుట్టును మట్టునున్ దెలియ కోయిలపిట్టవు గాన నా యెడన్
జెట్ట యటన్న నిశ్చయముఁ జేకురె నీకుఁ గుమారి నాకడన్
బొట్టెమొ దైవమో యనిన చూపున నున్న నృపాలు రెందఱో
పట్టణసీమలం గలరు పల్లెలయందుఁ గలారు పుత్రికా. ౧౨౩

ఉ॥ అందఱుఁ గూడ మూర్ఖు లని యాడితి వేగతి నూరు వచ్చెనో
వందలు వేలు పండితులు పత్రిక లిచ్చిరి యిందు నొక్కఁడున్
మందుఁడు గాని పండితుఁడు మంచి వివేకి యొసఁగఁ డొక్కరి నీ
చందముఁ జూచినన్ దెలియు సాహసి వం చెలువంటి పందకున్. ౧౨౪

---

రా॥ వెన్నడిమూసినన్ బరువు వీడ్కొనునే కరికంచు నెంచి లో, నెన్నక వీరల యుపేక్ష యొనర్చుట మేలు సూడఁగన్......ఉ॥ వేంకటరామకృష్ణ సుకవి పరివరుల్! వినుఁడీరు సత్కవీ, సంకలితుల్ కవిత్వనరసజ్ఞులు నంచెఱింగించు మీదు వ, ద్వ్యాంకములం గనుంగొనిన నద్భుతలీల శతావధానమా, తంకము లేక చేసిన విధంబును దెల్లము సేయు మీకృతుల్॥ ఉ॥ ఐనను మీకళావిభవ మంచిత చారుకవిత్వ శక్తియున్, ధీనిధులంచుఁ గీర్తి గనుతిర్పతి వెంకట సత్కవీంద్రులన్, మానక నిందఁ జేసెడి క్రమంబునకున్ బనిపూనినట్టుగాఁ, గానఁగనయ్యెడున్ దగవు గాదిది పండితులైన వారికిన్॥ ఉ॥ పిన్నలు మీరు వారు కడుఁ బెద్దలు విద్యలకున్ బొగడ్తకున్: వన్నియ గాదు మీకుఁ బెడవాదము వారలతోడఁ బూన; మీ, కున్నకవిత్వశక్తి బుధులొప్పఁ బ్రబంధములందుఁ జూపుఁడీ, చిన్నతనంపు చేఁతలు రుచించవు మీకవకీర్తి దెచ్చెడున్॥ చ॥ తిరుపతి వెంకటేశ్వర సుధీమణులార! యనేకరాట్సభాం, తరముల మీరు గాంచిన యుదారయశంబున కిప్పుడిట్టులె, వ్వరు విలపించినన్ గొదవవచ్చునె సూర్యుని జేటగప్పినన్, గురువగు తత్ప్రకాశమునకున్ గొఱవచ్చునె కాన మీరు బం, ధుర మగుశాంతి భావమున సూల్కొని యెప్పటియట్ల యుండుఁడీ.॥9॥

ఇట్లు

అడవి సాంబశివకవి.

---

☞ ఈనవరత్నములలోని యొక పద్యము ('కోకిల కాకమంచు' అనునది) మాత్రము గీరతప్రథమభాగములోని పీఠికలో 1 వ పుటలోను దాహరింపఁబడియున్నది.)

ఉ॥ కాకవు లెల్లఁ గాకవికిఁ గాలికి మువ్వను గట్టి గంటివే?
యేకముగా జగమ్ము లివి యెల్లను గ్రమింగెడి నీదు బావ "ను
కాకలుదీరినట్టి కవిగండని గా నెటు నెప్పె నోట నీ
కాకవిఁ గూర్చి, తాను నొక కాకవి గాదొకొ? కపి గాదొకొ? పికంబొకో. ౧౭౫

చ॥ "భయపడ కేను రా,, ననుచుఁ బలిక్రతి జ్ఞప్తి నొకింత లేదె! యా
శయమునఁ జూచికొ న్నొకట స్వాంతము నుండి పిఠాపురంబు నా

---

"... తే॥ గీ॥ అట్టిమీయొద్ద విద్యల నభ్యసించి, కయిత నల్లంగ నేర్చను గాంచితి దకు, మీరుగురువులు కారని మిమ్ముఁ దెగడు, ననుఁగుశిష్యులు గల్గని యనఁగవింటి. చ॥ గురుఁడనఁ గేవలుండె జనకుండును దైవము నా ప్రమిత్రుఁడున్, గురుఁడెగురుండె శిష్యుఁగడుఁగూరిమి నారని ప్రోచు దాతయున్. గురుఁడెకృపాంతరంగుఁడయి కోరిన విద్యల నిచ్చినట్టి యా; గురుని దిరస్క్రరించియనుకూలత నెట్లుగడింపనచ్చునో...... తే॥ గీ॥ అకట గురువుల కహితంబు నాచరించి, చెడిన వారలఁ జదువరో శిష్యులరని, చదివి మఱచిరో లేక యీసరణి లెన్ని, యంచుఁ దలఁచిరొ? కలి కాలమగుటఁ జేసి. క॥ వారలదెసఁ గోపింపక, తారూరకయుండ వేఁడెదను గానున్నన్, దారించుక కోపించిన, వారికి నేమంబుగాదు పండితులారా! ఉ॥ ధర్మన ముఖ్యులో శతవధాన శతాంగమని దారిసూపఁగా, నిర్మలమైన మార్గమున నిన్నల తిర్పతి వేంకటేశ్వరుల్, గూర్మిని దేశదేశములఁ గుప్రమ్మరఁ జేసిరిఁ నేడునీదుదు, ష్క్రర్మమదేమి యార్చుచును గాకవులీడ్వఁగ దొడ్లెదక్రటా. క॥ నీకుఁగలయశము నెడదిదె, కాకవులంబాఱఁదోలిఘన తిర్పతిను, శ్లోకుఁడును వేంకటేశుఁడు, సాఁకుచునున్నారు నిన్ను జయమగు నీకున్. సూర్యభట్ల వైద్యనాథం.

———

...................................శ్లో॥ యేగీరతం ప్రతి దినం పఠంతి విబుధా స్తుతాః, తే గురుద్రోహపాపాత్ప్ర, విముచ్యంతే న సంశయః

ఇట్లు, రామనాగేశ్వర భక్తిరసప్రధాన కీర్తన శతకత్రయ నిర్వచనాంధ్ర రఘువంశ కావ్యకర్తయగు:—భమిడిపాటి అయ్యప్పశాస్త్రి, హెడ్ మాష్టర్,
మండవల్లి, లింగాలపోస్టు, కృష్ణాజిల్లా. 11-12-12

———

దయకు నివాసమైనయెడఁ దత్తఱ మందవొకో పాఱిపోవొకో ని
శ్చయముగఁ దెల్పుమీ ప్రతిన జార్చిద వెంటనె వచ్చి తీరెదన్ ౧౭౬

---

Injeram,

6-8-10

“...ఉ॥ పూతచరిత్రులైన తమబోఁటిమహాకవులందు వ్యర్థపుం,జాతురి మీఱ వాగ్వ్యయము, సల్పినచోఁ దమ రెంతయో మహా, ఖ్యాతిని గాంతురంచు మదిఁ గర్వముచే నిలఁగొందఱుందురా, నీతివిదూరులన్ గనిన నేరమటంచుఁ దలంచకుం డురే. చ॥ కవులని పేరుపెట్టికొని కాలముపుచ్చుచు నొక్కచో మహా, కవులను ధిక్కరించుటయె కార్యమటంచుఁ దలంచువాఁడు కా, కవియగుఁగాని సత్కవికిఁ గాకవి నామ మదెట్లు చెల్లు స, త్కవులకు దీనలోపమది గల్గ దొకించుక యెంచి చూచినన్. గీ॥ గురువులనె వెక్కిరించెదుకు మతులింక, తల్లిదండ్రుల నేరీతిఁ దనుపఁగలరొ, యహాహ! వారల నేమనియనఁగవచ్చుఁ, గాలమాహాత్మ్యమనియె యుంగ వలెఁగాక.

వెలువలి వీరశంకరమూర్తి,
సా॥ చింతామణి.

---

మ॥ గురువే బ్రహ్మ, గురుండె విష్ణువను, వాక్కున్ దూలఁగాఁ బుచ్చియే తెరువో మాకమరెన్ గదా యనుచు నెంతే యుబ్బి తబ్బిబ్బుగా, సరసుల్ మెచ్చఁగ నెట్టులోఁ బరమదే చాయన్ బొసంగున్ బరా, త్పరుఁడెట్లూరకయుం డుఁ, దప్పని ననేతాదృక్షమే లేదు, మీ, రరయుఁడీ యిదె బోధసేతునని సత్యం బెల్లఁ జాటించు మీ, గురుశిష్యక్రమబోధి గీరతము నాకున్ బంపుఁడీ యొందు... ...దేవా! సగంబౌ వెలన్, గరుణన్ గీరత మంపుఁడీ యనుచు వేడ్కన్ నిచ్చలున్ బ్రొక్కెదన్, సరసానందకృతి స్వభావకృతి కృత్సర్వజ్ఞ, రో వేంకటే, శ్వర సత్కవ్యధిరాజ! కింకవిఘుటాపంచాననా, శ్రీపతీ॥

ది 4-3-1911

శిష్ట్లా వెంకటసుబ్బశాస్త్రి
పొన్నూరు పోస్టు, గరికిపాడు.

---

ఉ॥ చక్రముఁ బట్ట నే ననుచుఁ జక్రి ప్రతిజ్ఞ యొనర్చియుం దురా
పక్రమ మేగు దేర నది పార్థునపేక్ష యటంచు నెంచి యీ
యక్రమ మెట్టుసేతు ననృతాత్ముఁడ నయ్యెద నంచుఁ గొంకకే
చక్రము దాల్చె శౌరి, యది సాహస మిచ్చెదుఁ గాక నాకిటన్.

---

క॥ శ్రీతిరుపతి వేంకటకవి, నేతలకు జగత్ప్రసిద్ధనిరుపమనిత్య, ఖ్యాతిశ్రీవృతు
లకుఁ గరు, ణాతత్పరులకు విపక్షనాగహరులకున్ గీ॥ తగిన పగకున్న శిష్యులు తమ
కుఁదగిన, కీర్తి నే గూర్తురే కోటిధూర్తులు నవ, యశము గూర్పరు కూర్తురే నదియు రా
దు, గురువులకుఁగాన శిష్యుఁగాఁ గొనరె నన్ను గీ॥ అస్మదీయభోగేశ "మాహాత్మ్యవి
మందు, గురుమణీమాలలో మిమ్ముఁ గూర్చుకొనెడి, వైభవము పట్టుకున్నను వ్యాకర
ణము, గణపి ఘుం దేని నద్దాని గరుణ నిడరె. గీ॥ మీకు శిష్యుల మనుపేరె మాకుఁ
జాలు, ననుచు నతప్రవిపంఘుంబు లనుసరింప, వఱలుచుండెడి కవిచక్రవర్తులకును,
వాయసవ్యాసబలవ ద్వివాద మెుండె గీ॥ యేనకేనాపు ప్రాయశాస్త్రానుసార, ముగ
జలదసార్థగర్జితములకు నూచ, కంబులై ఖ్యాతిగనుచె, ఫలంబు కప్ప కూఁత
లకు నెందునందుకే కూయు నవియు. గీ॥ బెకబెకల కేమి తెలుగవు భేకములకు,
నిట్టిఁయూసారములవల్ల నెట్టిసరసు,లకునుగట్టులు పొఱుటల్ గలుగు నింక, జ్ఞాన సూ
ర్యుఁ గనఁజేతురేని మేలు గీ॥ వాయసవ్యాసముఖమున వారెకృష్ణ, పక్షితకునుప్పి
కొని కట్టు స్పష్టమగుటఁ, గోకిలలకు రామాభిఖ్య కూడదనుట, వారె కాకములుగ
ను గావలసియుండ్రు. సీ॥ కాకంబు పేరిడి గ్రంథంబు ముందుగాఁ గష్టించి చేసిన కా
రణమున, 'పాపిచిరాయు'వన్వాక్యముగతిఁ జిరజీవితకు గురుదూషించుకతన, పులిఁ
జూచి నక్క "యన్నోపలిక్క నే తద్వాచ్యబాధక నామము ల్వదలికొనుట, బలివే
యువిభుపీడి బయలెక్క ననుతలల్ దక్కవుమనకని తారియుంటఁ గీ॥ గాకవీట్పద
పట్టాభిషేకమునకుఁ, దగినవారలు వారలే తగరు మీరు పరభృతత్వంబు "సంద
ర్శపద్యములను, జెప్పికొనుటకు ఫల మిదిసిద్ధమయ్యె. గీ॥ అక్కరము తక్కువగుట
వ్యాసమైత్రి, కావలసివచ్చె నెప్పుడు గాకములకు, నుభయమేళనమున నది యు
దయమందె, నుభయ కర్తృకతను జెప్పుచుండుఁ బేరె. గీ॥ అకట? కాకముల్ తా
ము వాయసము లవుట, నరయకయె కాని యరసిన నంతకంటెఁ, దమకె యొకయ
క్కరం బెచ్చుతన రుచుంట, వ్యాసమైత్రికి నొప్పవు వీసమేని. గీ॥ ఒక్కస్వరమధి
కంబైన లెక్కయేమి, ఖాగుగాఁ బొత్తు కుదిరెను వ్యాసమైత్రి, వాయసక్షేమకర

మ॥ అవధానం బొకమూల నుంచు మది యేలా చక్కఁగాఁ బద్యముల్
జవిగాఁ గూర్చి పఠింపఁ జాలుదువె నీచాతుర్యముల్ జూతు మీ

---

మైన వాయసాప్తి, వ్యాసగౌరవమును భంగపఱుపకున్నె. గీ॥ ఇనుముతోఁగలసిన యెడ ననలమునకు, సమ్మెటలపెట్టు లనియెడి సామ్యమట్లు, వాయసస్నేహ కలనంబు వలనఁగాదె, వ్యాసగౌరవ మెల్లను వ్యర్థమగుట. గీ॥ శబ్దవిషయక మగు నీవిచారణంబు, వ్యర్థ మని చూడఁబోకుఁడీ యనఘులార, యర్థ మేదేని శబ్దంబు ననుసరింప, కుండు లేనియు వినిగనీ యుంటకలదె. శా॥ మీవైదుష్యము మీయఖండకవితామేయప్రభావంబు మీ, ద్యావాపృథ్వ్యవధిప్రశస్తి గురుపాదాంభోజభక్తుల్ బళీ, యేవిద్వాంసుల కబ్బు మీకునరి మీరే కాని లేరెవ్వరిం, దేవిద్వాంసుల కేననూయ పడకుంటే మేలు ముమ్మాటికిన్. గీ॥ మొదల శిష్యుగాఁ గొనుఁడని మొదలువెట్టి తుదకు నేమేమొ చెప్పఁగాఁ దొడఁగినట్టి, తప్పునైరించి నాయెడ దయను బెంచి, వారితోఁ బోరు చాలించవలె క్షమించి. గీ॥ అహహా! యెవరెంత ఘనులైన నన్నృతవాదు లగుచు గురుశిష్య మర్యాద నంతరింపఁజేయఁగాఁ గూడదటువంటి శిష్యులేల? యున్నకీర్తికిఁ జోటు లేకున్న మీకు. గీ॥ ఎవరిపాటవ మెట్టిదో యెవ రెఱుంగ, రెందుకనములతో వాదమేమిఫలము, పెనిచి విషవృక్షమేనియు బెఱుకరాదు, తమకుఁదెలియని ధర్మముల్ ధరణిఁగలవె. గీ॥ గగనగంగాప్రవాహంబుకరణిఁ దనరు, నాశుధారాకవిత్వంబు నందికొనుచు, భారతంబును మించిన గీరతంబు, జేసి మచ్చుఁ జూపితిరి మీచేవరీతి. గీ॥ అగ్రహంబనుగ్రహ మయ్యనుగ్రహంబె, యాగ్రహంబయ్యె వారికనుగ్రహంబు, కంటె నాగ్రహమునె యధికముగ లాభకరముగా మీర లొనరించు కారణమున గీ॥ వారివలెగురువులకు నవ్వారిగాఁగ, లేరు దక్షిణ లొసఁగినవారె చటను, గీరతమహీరుహమణికి వారె విత్తులగుటవలన ముందంతగా నదిఫలించు. ఉ॥ గీరతపద్య వర్షములఁ గింకవి పంకజముల్ ముణింగెగం, భీరవచో ఘనధ్వనుల పెంపునకుం గవికేకిలోక మిం, పారఁగఁ దాండవించెను మహాత్మకదంబము లుల్లసిల్లెనా, భారత మేమిలెక్క యను భంగిని గీరతమున్ జెలంగెడిన్.

బందరుతాలూకా
పెడన.

సాధుజన చరణసేవకుఁడు
మల్లంపల్లి మల్లికార్జునుఁడు.

---

యవనీశుం డయిదే నిమేషములు నా కర్పించుఁగా కాదనం
బెవియున్ జూడక వీడకే నిలుచున ట్లేఁ జేసిమెప్పించెదన్.

చ॥ అయిదునిమేషముల్ "టయిము,, నర్పణఁ జేసియు నైదు యామముల్
ఫయి నెల లైదు పిమ్మటను వత్సరముల్ మఱియైదు నిచ్చి "మీ
దయ,, యనిపించుకోఁదగిన దార్ఢ్యము మద్గురువర్యు లిచ్చి రీ
మెయి నది చూపుఁ గాకము ప్రమేయము గల్గిన నోపికన్ బికా.

చ॥ వెనుకటిపోల్కెఁ గాక మిది వృద్ధగుటం బని సేయ లే దటం
చనుకొనినాఁడ వో తనయ? యజ్ఞుఁడవై కద? కాక మంటి దా
నిని జిరజీవిగాఁ దెలుపు నిర్ణయముల్ విన వొక్కొ? యెప్పుడో
క్కనియతినే కనంబడెడిఁ గాకము లోక మెఱుంగదే సుతా.

---

(స్వధర్మప్రకాశిని పత్రిక చతుర్థసంపుటము 7, 8 సంఖ్యలనుండి.)

# సతీర్థ్య సంప్రార్థనము.

(వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినది.)

శా॥ అమ్మా! భారతి! కేలుమోడ్చుకొని నిన్ యాచింతు నొక్కింత నీ, సమ్మానమ్మునఁ జేసి మాభరతవర్షమ్మందు విద్యాతరుల్, రెమ్మల్ కొమ్మలు గల్గి పల్గతుల వర్ధిల్లన్ వలెన్ సర్వశాం, తమ్మై పోవలె నెందుఁ బండితవివాదస్ఫారదావోద్ధతుల్॥ * మ॥ ఉడుగుం డయ్యసతీర్థ్యులార! యుడుగుం డొప్పాను తప్పాను మీ, యడుగుల్ మ్రొక్కి విధేయభావమున నభ్యర్థించుచున్నాఁడ; మీ, నుడుగుల్ పత్రికలోఁ బఠించి రవి వీనుల్ సూడినట్లయ్యె నే, చెడుగుల్ కోకిలకాకముం గనిన మీచెయ్దమ్ములన్ మెత్తురే॥ ఉ॥ శ్రీకరచెళ్లపిళ్లకులసింధుశశాంకుని వేంకటేశ్వరాఖ్యకుని సద్గురుప్రవరుఁ గాకినిగా మఱి నిష్కళంకన, ధీకుని దత్సమున్ దిరుపతిన్ గురుపండితుఁ గొంగఁగాఁ దనుం, గోకిలఁగా వచించుకొన్న కొండొక కైతము వెల్లడింతురే. శా॥ అచ్ఛానేకమహర్షినిర్మితమహాగ్రాచారనిర్మాణముల్, స్వేచ్ఛాచారులు నేఁటికాలమునయం దెం దెందఱో విజ్ఞవే, షచ్ఛన్నుల్ వడఁగూల్ప నందు గురుశిష్యన్యాయనిర్మాణమూ, లోచ్ఛేదమ్మున కీరుపాల్పడితి రొక్కో! రామకృష్ణాహ్వయుల్. ఉ॥ చిల్లులగవ్వయే నభిలషింపక విద్ది

ఉ॥ "కాకము వచ్చె" నంచు నృపకాంతునితో వచియించు వాఁడవో!
లేక "బక" మ్మటందువో? మలీమసుఁ డందువో? కోఁడు దర్శనం
బీక యనాదరించు నటులే ఘటియింతువో? తత్సభాస్థలిన్
మూకత సంఘటించెదవొ? మొక్కెదవో? మఱి యేమి చేసెదో.

---

యనేర్పి మూర్తి సం, థిల్లఁగఁ గాంచు సద్గురు విధేయతకైఁ గనుచుం బదిం బదిం
జల్లనివేళ సంస్మరణ సల్పుచు నుండుటలేక యిచ్చమైఁ, గల్లలు పల్కి యేమి య
ధికమ్ము గణింపఁ దలంపుఁ గొంటిరో. చ॥ శ్రీమపడి విద్యలం గఱపఁ సాఁకి ప్ర
రోజకుఁ జేసి వృద్ధికిం, బ్రమదముఁ జెందుసద్గురు సభాస్థలిఁ బేర్కొను టాత్మగౌ
రవ, క్రమపరిహారకారణముగాఁ దలపోసెదు వారి నేరిఁ గా,నము విన మెప్ప
డిప్పుడు కనన్ విన నయ్యెఁ గదయ్య యియ్యెడన్. మ॥ గురువుల్ తిర్పతివేంక
టేశ్వరులు మీకున్ మాకు నొక్కంబు; త, త్కరుణాసారమె కారణ మ్మరయ వి
ద్యాబీజ మొక్కింత యం, కుర మందన్ మన కెల్ల నొక్కముగ; మాకున్ వారి
కిన్ శిష్యతా, గురుతల్ లేవను మీనుడుల్ వినిన నేక్రూరుండునుం గుందెడున్.
ఉ॥"చెప్పుటలేద"యంచును వచించితి రొక్కెడఁ జెప్పినేనియుం, జప్పనికూఁత
లే"యనుచు సాహస మొల్లను వెల్లడించినా, రొప్పులకుప్పలార! జగ ముందు వెలిం
గి యిటుల్ లిఖింపఁగాఁ, జెప్పఁగ మీకు నెప్పగిదిఁ జేయియు వాయియు నాడెనో
గదే. ఉ॥ అన్నా! మీరును బండితప్రవరులే యన్పించుకోఁ గల్గిపై, నెన్నండే
నొక శిష్యుఁడుం గలిగి వాఁడింతేని యంతేని వి, ద్యన్నొక్కమ్ముగ మీకడం జదువ
నై యల్పజ్ఞుఁడే యయ్యె మీ, కన్నన్ మిన్న నటంచు మిన్నుఁ గనె నెట్లో మీరుఁ
జింతింపుఁడీ. ఉ॥ వేంకటశాస్త్రి పండితకవి ప్రభుపాదము లాశ్రయించి ని, శ్శం
కముగా గడించితిమి శక్త్యనుసారము సంస్కృతాంధ్ర మూ, లంకష సాహితిం గ
వనలాఘవముం దగుశబ్దశాస్త్రముం, జంకమ యేము మాచదువు సర్వముఁ దత్క
రుణాత్తమే చుఁడీ ఉ॥ పొల్పుగ నభ్యసించితిమి ముప్పుర మేకముగా ననల్ప
మో, స్వల్పమొ శబ్దశాస్త్రమున యందున వారికులీనుఁ డేనునుం, దెల్పఁగ నేమి లా
భము! గతించెను వేంకటరామశాస్త్రియున్, వేల్పెయిఁ గున్ గురూత్తముఁడు
వేంకటశాస్త్రి మహార్థబోధముల్. ఉ॥ అంకిలిలేసి చెల్మి కిరవైనయతం డతిశాం
తమూర్తి ని, ష్పంకహృదంతరుండు పిసిపాటికులోద్భవుఁ డాత్మవేది శ్రీ, వేంకట
శాస్త్రిసద్గురుని ప్రేముడి కెంతయు బాఁత్రమింకమా, వేంకటరామశాస్త్రి కెన వే

క॥ నాకంఠనాదమును విని, కాకమె యనుకొనును కోఁడు ''కవిమూర్ధన్యన్
నీ కిట్టు లనఁగఁ జెల్లునె!, 'సీ?! కలిపురుషుండ వంచుఁ జీవా ట్లిడునో

---

యిటి కొఱక్రూరుఁ డేని కల్గునే, మ॥ గురుఁడు౯ దైవము లేఁడు నేఁడకట! యాంగ్లో విద్యల న్నేర్చుబా, లుర కంచు౯ వచియించు పండితుని సోల్లుంఠమ్ముగా నుక్రూనే, ర్వరియాంగ్లేయకలార్థి ''మీ చదువు నేర్పం౯ భక్తి చేయూఱునా, నరయుం'' డంనుమిమ్ముఁ జెప్పెన 'టని యయ్యా! యింకఁ జాలింపుఁడీ. ఉ॥ ఏలవృథావయాసపడ నెవ్వరెఱుంగరు మీకవిత్వపుం, బోలిక చాలికల్ తెలుపవో గురులెవ్వరొ తేటతెల్లగాఁ, జాలును జాలుఁ గన్గొన నశక్యమటంచును బాలుదా్రిపుమా, జ్ఞాలము కన్నుమూఁతలిడు చందము దోఁచెఁ గదయ్య యియ్యెడన్. ఉ॥ పుట్టకమున్న వేత్తలయి పొల్చినఁ బొల్తురుగాక పాదముల్, పట్టిపఠింపరే నిజముపల్కఁడు వేంకటశాస్త్రి చెంత; హా, దిట్ట లటన్న పేరు చనుదెంచెను లేదా యొకింతలోనమీ, కిట్టిమతుల్ జనింపవలెనే గురుఁ గూఱిచి నత్క్రూవీశ్వరుల్, మ॥ నుడికారమ్మున మించుగ్రంథములవెన్నో కూర్చుచు౯ ''శిష్యుఁడా, కొడుకా'' యం చొరులెంచ మించుదయఁ గన్గొంచుం దగ౯ విద్యనే, ర్పెడు కారుణ్యపుఁ బోవుమీఁద నటె తబ్బిబ్బుల్ వచింపించె దో, చెడుకాలంబ! యెఱింగి యింకఁ జనుమీ! చీవాట్లపాల్గాకుమీ. సీ॥ వీనుదోయికి విందు వియ్యంబు లిడుపేల్మి నుడికారములకుఁ జేర్పడినవాఁడు, నిద్దంపుఁ దేటతేనియ చవుల్ గలకైత వెలయింప నెన్న కోవలయువాఁడు, గోరుశిష్యులకుఁ జిక్కులుదీర్చి నెఱవిద్దె నెలమి నేర్పఁగఁ బద్దగలుగు వాఁడు, తెలుఁగుదేశమున వర్తిలునెల్లరాజుల నలరించి విఖ్యాతినలరువాఁడు. గీ॥ ''కావు కా''వని యఱచెడు కాకి యయ్యెఁ!, బిప్పికూఁతలు సెప్పెడు బేలయయ్యె కటకటా! విపరీతమ్ముగాఁ బికత్వ!, మెనయు నాతని శిష్యుఁ జేకొనిన కతన.

చంపకమాల.

''తిరుపతి వేంకటేశ్వరులు తేఁకువ మాకడ వాకు విప్పనే, రరుమముఁ జూఁడ గొంకుదురు రారిటకు౯ విలసిల్లినార మేమిరువుర మిష్టుకారలకు ''నీశ్వరవేర్ల'' మటంచుఁ గొంచకే, తఱుచుగ మీరుపల్కునపదంపడి వైరము మీకె మీరలా, తిరుపతి వేంకటేశకవిధీరులశిష్యులటన్న మాట సు, స్థిర; మికఁ జాలుఁ జాలు గురుశిష్యులకా యిటు గ్రుద్దులాట! యొ, వ్వరయిన విన్న నేమనుదు; రద్దిర! యేమనుచున్న వార

ఉ॥ చూడఁగ నిచ్చ యున్నయెడఁ జూపెద నాదగువార్ధకంబు, నిఁకన్
జూడ మనంబునం గలదు సూ సుత! పుట్టెఁదుకోరెక్కు; బావ కీ
జాడ నెఱుంగఁ జెప్పి యొక జాబును బంపుము “షైరు” తీరు వె
న్నాడెద శక్తిఁజూపెద నహా! యని మీనృపుఁ డక్కజం పడన్.

క॥ నీవుఁ బాటయు నృపుఁడును, జేవ యనఁగ నిట్టి దనుచుఁ జెప్పికొనంగా
నా వెఱ్ఱిపాట పాడెద, దేవుఁడు గలఁ డంచుఁదెలిసి తిరుగుము తండ్రీ!,

శా॥ “వీడఁ జాలక వెంట వెంటఁ బడు నీ వేయిండ్లపూజారి యే
వాడఁ జూచిననున్ బఠించు”టది భూపాలుండె పాలించుఁగా
కేఁడీ యాతఁ డటంచు నేత్రములు కెంపెక్కఁగ నీఁ జూచుఁ గా
కూడఁ గొట్టెడుఁ గాక నిర్భయ దురుక్త్యుద్రేక సౌభాగ్యముల్,

---

లి,త్తఱినె యెఱుంగుఁ, డెంతకవితా మహనీయత కల్గెనేనియుం, గురులకెపంగనా మములు కూర్పఁదలంచుట పోలునే? నిజం,బరయుద మైనఁ గాని కలదా యల తిర్పతి వేంకటేశులం, దార నెడిపాటివేత్తృతయుఁ, దుందుడుకందితిరీరు; నిక్క మొక్కరణిని బోల్పవచ్చు శతఘంట మహాకవితావిలాసినీ, సురుచిరభోగభాగ్యములఁ జూరలఁ గొన్నరసజ్ఞవర్యులౌ, తిరుపతి వేంకటేశ్వర సుధీవరులన్, మొనమొన్న వారి డ, గ్గఱనె పరిశ్రమంజరిపి కైకొనినట్టి యొకింత పాండితిన్, విరినెడు కైతమున్ గలిగి వీధికి నెక్కుచునున్నమిమ్ములన్, దిరుపతి వేంకటేశ్వరులదీట గువారని పేరుకొందురే, తఱచుగ మీరునుఁ శతవధాన మొనర్తుమటంచుఁ జెప్పికొం, దురెకద! యెయ్యదీ! పటుమతుల్ మన తిర్పతి వేంకటేశ్వరుల్, జరపిన వానికిన్ సవతుసల్పఁగ నొప్పగునట్టి దెప్పుడే, కక్కరణిని జల్పిరెక్కడఁ? ప్రకాశము సేయుఁడు దానివైఖరుల్, చిఱుతలు పోవఁబోవఁగఁ బ్రసిద్ధిపహింపఁగ నర్హులక్కటా, గరువపుఁ జెయ్దముల్ కలుగుఁ గా కవి యొండొకచోటఁ జూపకా గురువులపట్లఁ జూపఁ దొరఁకొంటిరె లేక జగమ్ము మెచ్చు మీ, పరువున కల్లవారు గురుపట్టమునంద ననర్హులైరె భా, స్వరశరదిందు చంద్రికల చాడ్పున నెల్లెడవెల్లిగాంచి దు, స్తరమగునట్టివారల యశంబును దాఁటఁగ మాటువుచ్చమీ, తరమగునే తలంచుఁడు వృథాకృథనింపకుఁడయ్య; అయ్యోఁ బో, జరిగిన దానికేమి సువిశాలమనస్కతఁ జింతచేసి యి, ప్పరుసున సింక దండుగ వివాదములన్ మతివ

క॥ వృద్ధుఁడ నని, ప్రకటించితిఁ గుర్ధుం డగుభీష్ముముందు "కోన్కిసక్క" గజ
శుద్ధుండు కర్ణుఁ డేమగుని? శ్రద్ధమెయిన్ భారతమ్ముఁ జదువు కుమారా!.

తే॥గీ॥ ఒక్కనీవు నన్నాడెడి యూషరోక్తు, లెన్ని భూషణోక్తుల జనియింపఁజేసెఁ
గాక నే నెంతవాఁడ సత్కవిగణంబు, నన్నుఁ బొగడుట కోయవినయధురీణ.

ఉ॥ వందల లెక్క యే మకటని? వారక లక్షలు వచ్చుఁగాక యే
పందయుఁ దండ్రిపేరు గురువర్యుని పేరును మార్చి చెప్పఁ డీ
చందము లందొకానొకటిసాధ్యము గాఁ గనుపట్టె నీకు, ము
న్నందిఁక నొక్కటింక నొక మాఱును సాధ్యము చేయనోక దే?.

మ॥ అలనారాయణశాస్త్రి నీ వెఱుఁగు దే! యన్నంత నవ్వారికిన్
దల వంకించి యెఱుంగుటన్ దెలిపెదో! తత్పూనుఁడ న్నే నటం

---

మ్ము చేయఁ గా, తిరుపతివెంకటేశకవిధీరుల శిష్యుల మంచు మించు నం, బరమున
నాత్మశుద్ధిమెయిఁ బల్కెన మే లకవితావధూటి మీ, పరమయి యింపునింపు గురు
వర్యులకుం దగుశిష్యులంచు మి, మ్మరయుదు రాదరింత్రు ప్రజలందఱు దాన య
శంబుమీకుఁ జే, కుఱు గురువర్యులన్ మిగులఁ గూరిమిమీఱ మిముం దలంతు రీ,
శ్వరుఁడును మెచ్చు మేముఁ గడుసంబరముం బడువారమేమియుం, బొరయును
బొచ్చెముం గలుగఁ బోదు యథార్థముఁ జెప్పినాఁడ న, కఱఁగొని నాదువల్క
వినఁ గల్గిరయేని యీనాఁటనాఁట దు, ష్కరనిరవద్య హృద్యశతఘంట మహాక
వితాలతానవాం, కురములు వాడిపోక చెలఁగున్ మొలఁగుం బలుతావులందు ము
మ్మరముగ నల్లిబిల్లిగొని మంజులపుం జిగురాకు లెత్తి క్రొం, బరిమళముల్ వెలార్చు
కుసుమమ్ములఁ బేరిమిఁగాంచి మిమ్ములం, బరిణత సత్ఫలమ్ముల ననారతముం దని
యించుచుండెడున్. మ॥ తలకెక్కెం గరువమ్ము మీఁ డెవఁడురా! ధైర్యమ్ము పై
మాకుఁ దప్పులు నొప్పుల్ గణుతింపఁబూనెఁ దలవంపుల్ కావలెన్ వీనికం,
చలుకం జూపఁ దలంతురేని యొకలెక్కా నే నుపాధ్యాయునిం, దలదాఁటం ద
లపెట్టు మీకు భయమందన్ రామకృష్ణాహ్వయుల్. శా॥ తేటల్ దేరిన సత్కవి
త్వమునఁ గీర్తింగాంచుచున్నట్టి మీ, బోఁటుల్ యతక్కవితామృతాంబుధికి నం
భోదంబులై రానిరా, ఘాటుల్ తిర్పతివేంకటేశ్వరులకుం గారాపుశిష్యుండ నా
మాటల్ కొంచెము మీనులన్ జూనుపుఁడీ మన్నింపుఁడీ వేఁడెదన్.—

చెలిమిఁ బల్కెదో! చెప్పు మయ్య! యటులే యీనన్నుఁ బ్రశ్నించినన్
దలపంకించెదవంటివి "శిష్యుఁడనె" యన్నన్ లోపమే పుత్రకా.

---

చ॥ తిరుపతివెంకటేశులయతిప్రతిభామహిమంబు పూర్తిగా, నరయఁగలేక మున్నునుగ నావద మ్రొక్కులు మ్రొక్కి కోరికల్, జరిగిన వెన్కమై మఱువఁ జయ్యన దెల్వికిఁ దెచ్చుసాములు లా, తిరుపతివెంకటేశుల నెదిర్చి తరించినవార లుండిరే ౧. ఉ॥ మీకవితా ప్రమేయములమే యరసప్రతిపాదకంబులై, లోకము నిండిపండితులలోఁ జొరఁబాఱెఁ సభల్ జయింపఁగాఁ, గాకవులొక్క రిద్దఱిదిగా దిదిగాదని కూయుచుందురా? మీకడ "దిష్టిబొమ్మ"లయి మేలిదు శోభన దేవతల్ సుఁడీ. ౨. చ॥ తిరుపతి వెంకటేశకవి దివ్యసహస్ర ఘణాఘణీశవా, కచ్ఛరనిధి దాఁట శారివని గాదని వేంకటరామకృష్ణులా, యిరువురతోడ వేరువడి "ఈశ్వరవి వేరుల"మైతిమన్నచోఁ, దిరుపతి శాస్త్రిగారును విధేయులపై నలుగంబనేమొకో. ౧. చ॥తిరుపతి వెంకటేశఘణిదేవులవీడొక్కని రామకృష్ణ "లీశ్వరి మఱివేరులైతి"మని పల్కఁగ "నీశ్వరవేరు" లన్నయ, ట్లరసియపార్థమూని శరణార్థుల వ్యర్థులుగాఁ దలంతురే. తిరుపతివెంకటేశ్వరులు దీనశరణ్యులు గారె సత్కవీ॥ ౨॥ చ॥ తిరుపతి వెంకటేశ్వరులు దేశము లన్నియు గెల్చియుండియున్, సరసుఁడు పీఠికానగర నాథుదరింగల రామకృష్ణులీ, చిఱుతపుఁ బ్రాయపుంగవిత చెప్పఁగ నేర్చుట తా మెచ్చింగియున్, దురమొనరింపరమ్మనుచు దూఁకఁగ ధర్మమె, సుంతయైన మా, నరపతినైనఁ జూడ వలదా? వలదా? మరియాద లేరికిన్. ౩

ద్విభాష్యం పుల్లకవి
గోదావరిజిల్లా, పిఠాపురడివిజన్,
దుర్గాడ.

(మఱియు నీసుకవి శ్రీరాజావారి సన్నిధికంపికొన్న పత్రికృతవిషయపుఁ బద్యములలోఁగొన్ని)

………చ॥ తిరుపతి వెంకటేశకవిధీరులు వేంకటరామ కృష్ణధీ, వరులు కవిత్వసంగతుల వాదములాడఁదలంచి పత్రికల్, జరుపుచుఁ గయ్యముల్ పెనుపసాగిరి తామది గాంచి తీర్పఁడీ, మఱువక రావువెంకట కుమార మహీపతి సూర్యరాట్ప్రభూ. ౩. ………ఉ॥ గాసికి మూలమన్న? మొన కాదిది, నోటికివచ్చినట్లు గాఁ, గూసెదరే మొకో! యసినఁ? గోవిదగోష్ఠి, దురంతకృత్యముల్ దోసములన్న సత్కవులతోఁ బని, రాజసభాంతరంబులం, దీసభ సేయ నొప్పమికి హేతువు లెవ్వియు లేవు భూపతీ. ౧౦. క॥ మన రామకృష్ణకవులును, ఘనతరవిద్యాప్రవాహ గాంభీర్యులు రచ్చను గెల్తురు గెల్వకపో, యినమాత్రము చేఁగ శౌవిహీనులగుదురే. ౧౧ ఉ॥ ఈకవి శూరవైరము మహీపతివిన్నను గంటలోపలన్, బాపక యుండునే ప

చ॥ జనకుని పేరు డాఁచినను సత్సభ నంతగ శంక రాద త
ద్దినమునఁ దండ్రి యెట్లొ సభ దేశికుఁ డట్టిఁడె యెట్లుడాఁచఁగాఁ
జను గురు పేరు? నీ కెఱుక చాలక కీరితి కిట్లు డాఁచితె
ట్లును బయలై కెక్కఁ గన్గొనుము లోకము మూయను మూరు దున్నదే. ౧౮౧

---

తి విన్నంద గుయత్న్యము సల్పు చుంచునన్, లోకులు ప్రోత్సహింపజన లోలుఁడ నైతు తివర్చుకొంటిఁజు, మ్మోరికవి పాలవేంకటకు హాగ్రముహింపతి సూర్య రాట్పభూ ౧౯౦

ఇట్లు

విన్నవించుకవి, రాజవిధేయుఁడు

ద్విభాషి పుల్లకవి, దుగ్గాడ, గోదావరిజిల్లా.

ఉ॥ మోకగనున్న నాఁడు గని ముచ్చటచే రసముంచి పెంచి తీ, వోకవి రాజ! సద్గుణకళో దయశాలివి గాన దానికిం, పాకసమాఖ్య వృద్ధి గనుపట్టునఁ దాఁగనుపట్టె నట్టనన్, నీకెది పోలకున్న నిఁక నేర్తు రెవియన్యులు మిన్నకుండఁగన్ ఆ॥ వె॥ ఉభయశాస్త్రములని కాక యుపరిశాస్త్ర, మొండు నుపదేశమాత్రన యూహ నేయఁ, జాలియును జాల బింతకు మేలిగురులఁ, దిట్టినా రెత్తుకోయిల దిట్టతనము, ఉ॥ మాయురె? చంద్రుఁ బోల్చికొన మంచిదలంపక కప్పు, తద్గ్రహ, పాయము తీర్థత ల్పగతి పాయని కార్శ్యము గొన్న తెన్నునన్, గోయిలలంగ్ర తఘ్నతయుఁ, గుత్సిత వృత్తి, మలీమ సత్వమున్, గూయుచుఁ బాటిపోవుటయుఁ గూర్చిరె మేలిగొనాలు నేఁటికిన్. తే॥ గీ॥ కాకి బలఁగ మొ? చిలుకలకదు పొరియంచ, పిందువో యున్న చోటనె యుండికణము, లేర్చికొనుగతి గన్గొన నెఱుకవడదె, లేదు కాఁబోలు ని పుడు బలిప్రపక్తి. క॥ కోరు నకించనుఁడెన్నెను, కోరికె లదిగూడు నెట్లు గురు భారాప్తిన్, వేరులు దెగెమును నీతో, వేరంబున నింకనున్న వేరులు దెగ తే. తే॥ గీ॥ కొంగ మల్లాయ గట్టునఁ గూలఁబడిన, కుంటు నే వచ్చినను దప్పకొనఁగఁ బోల్చి దిక్కు డే తెచ్చినవి పెట్టి యేగుఁడన్న, గలియక నుపట్టె నభ కెక్కఁ గాంచు టె ట్లు. తే॥ గీ॥ చాలుదును చాలనూ మానఁ జాలనీఁదఁ, జాలఁ జాలుదు నే నెట్లు చాలుదునని, శంకలనె మున్గవైరి విశంకట ప్రి, వర్ధమాన భవత్కీర్తి వాహినిఁగని. తే॥ గీ॥ కలచుఁ బోరి యొండుమించుభవత్ప్రతిష్ఠఁ, దీర్చు నే వానికోర్కెఁ బవిత్రతయది, కెలనఁ గలనీటి జాలొంది బలిని వల్వ, లంబు మానసలక్ష్మీవిలాసి యగునె.

శా॥ ఔఁ దిట్టన్నను నీవు దిట్టెదవుగా! యేసీమలోఁ జెల్లు నీ
వాదం బేగతి నెగ్గు? నేల విడి యెవ్వారేని వర్తింతురే!
లేదే! శిష్యుఁడు దేశికుం డనునెడన్ లేశంబు భేదం బహో!
పాదంబుల్ శిరమెక్కఁడౌనె యరరే? ప్రాజ్ఞుండ విట్లాడెదే. ౧౯౧

---

ఉ॥ కావున నింత మాత్రమునఁ గల్గదు లోటు త్వదీయకీర్తికి, నేవిధి దేవునింగొలు
చునెవ్వఁడు తత్ఫలమ్మె కాంచుఁ దాఁ, గావర మెత్తి పాటరని కాకకరావిభవో
జ్జ్వలాత్ములౌ, రావణ ముఖ్యులున్నను ధరంబన నేల? ధరిత్రినత్తమా. ఆ॥ వె॥ శో
త్రియుండు పుత్రుఁజూడ రావాఁడధి, కారియగుటఁదోడి ఘనులడిగినఁ, దనకుఁ దెలి
యదన నితని తల్లినరయుఁడీ, రనుచ తండు వలెక్కననఁగ వినమె. తే॥ గీ॥ భువ
న విఖ్యాతు నిజగురుఁ బులిమి పుచ్చి, యొక్కటో పండితుఁడనైతి నెవరో తెల్ప, రనెడి
ఘనుఁడింక 'గాంగ'మటన్న 'దప్ప,టంచు' నాంధవ, మిది తీర్థమని తెలుపవలె. తే॥ గీ॥
ఐహికఫలంబె కోరి యట్లనిన నదియుఁ, జెక్కియొభవదీయసద్యశశ్చిద్వలాన, మున నె
వ్రిలవక్షికింకెద్దిమూఁడదుభయ, తన్సుతుండఁతడుభయతీర్థప్రసక్తి. శా॥ ఆమాయం, త
ని నిచ్చలుం జపము సేయంబోలు శ్రీయోత్థలం, చేమో తెల్పిరి పూర్వులంచనుటమే
యీనాఁటఁజేటయ్యెఁగా, దామర్యాదములోటు శిష్యుఁడిటు ఖట్వారూఢుఁ డైనం
"దవ, స్వామో,, యంచును దెల్పదే శ్రుతి విమర్శాపేక్ష సామాన్యయే. క॥ జ్ఞాన
నఁ గూడ దెవుడు దే, వానాంప్రియుఁడౌఁదు దదువవచ్చు నటంచుకా, దానావని
దలపెట్టక, పూనిక విద్యావ్రిసక్తిఁ బోకార్చుటయుక్. చ॥ మలయము వంక
దోఁపవాకా మంగపాద ల్వరచఁదనదురిపుల్, దలఁపగ నత్ప్రసిద్ధి కటుదావల
మానఁటయాన గోత్రము, బలఘు మతుల్గలారు భవదంకనదు ల్కటివేన వేలుదా
రెలమి ఘటింపరే? ప్రథితి; యిక్ష్వాక భూర్తునిచేఁ దలంగునే. ఆ॥ వె॥ మగని మం
చి దాఁచి మన్నించుఁ గొమయొడ్ల, గురునిదాఁటఁగి లాతి, గొప్ప సేయు, శిష్యుఁడింక
నెద్ది సేయనోపఁడు కలిఁ, గూడ దీజగడము గురువరేణ్య. శా॥ నీహంసత్వము
గాంచి యెల్లబుధులు న్నిన్మాన సోల్లాసిగా, నూహం జేర్చిరి మొద్దు కాకవియనన్
యోజించి సద్భావభూ, షాహారిత్వము కాంతిఁ తకొక్కరుల కాంసంమన్యులన్
గాఁకృతి, వ్యాహారోద్ధతుల న్మరల్తురిఁక నేలా వారితో వాదముల్. చ॥ నిరి
యును వాణియు న్ననుభజించెను మున్నె యనన్యయుక్తిఁద, కొక్కరులెట్టులాడనే
మి గుణకోటిఁదలిర్చితి రాజులెల్లఁ బో, మరములు దాల్చి భూషలిడిమాటికిఁ గొల్చిరి

ఉ॥ చప్పనిధూఁత కాకికడ సంగ్రహణంబొనరించునట్లు ని
న్నెప్పుడుఁ గాని తిట్టుటయొ యుంచుక మొట్టుటయో తటస్థమా
టొప్పఁగ దా! నరానరిగ నెజ్జను దిట్టితొ? మొట్టితో? దగఁ
జెప్పఁగదయ్య! యిప్పుడటు నేఁతకు సిద్ధపడంగ డందగదే. ౧౯-౨

---

యవ్వనంబుగా, ర్పిరి యసమానకక్ష యుటఁజెల్లునే? తిర్పతివేంకటేశ్వరా ఆ॥ వె॥ విన్నపింతుగరుణ మన్నింపుమీవాద, కేళి విడువుము గుణగృహ్యులైన, బుధులె యెంగరే కవులతారతమ్యంబు, నీతిమంతులైన నృపులు లేరె. చ॥ జయమగుఁ గాతఁ బండితులచక్రవర్తి శిష్యులు ధర్మమార్గ మెంతయు మిగుల నృప్తిమెయిఁదారు చరింతురుగాత సర్వభూ,దయితశిఖామణు ల్పిమన తారహితుల్ గుణవంతులు నమ్రహా, శయులును నాకవీంద్రులకె సన్నిధిమూర్తులుగాక యింకిటఁ

ఇట్లు

తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి. చందవోలు



ఆ॥ వె॥ గురుఁడు కాకమనుచుఁ గోకిలమనితాను, విశ్రుతిఁగ నెపుడు బెదరి బెదరి, తిరుగుచుండి గాథవరములఁ బ్రేపించెఁ, దాగ్యరాజు రాజయోగవిదుఁడు

హరినాగభూషణం వ్రాలు

## హితోపదేశము.

అ॥ నవశతావధాన కవిలోకమణులార, రామకృష్ణులార ప్రాజ్ఞులార శిష్టహితుఁడు గాదె శ్రీజగన్నాథము, చేయుహితము మీరు చేకొనవలె. క॥ జ్ఞానికమున్నదొ లేదో నాపేరును గృష్ణకవికి, నయశాలికిఁ దా, నైపలుమఱు రాణ్మం దిరిఁ, గాఁపుర మీ సున్నతఱిసిగలియుచునుండెఁగ, క॥ చనవున్నతంత్రిఁ గైకొని, నొనరించితి నీహితంబు యోగ్యులచందం,బున వర్తింపగమంచిది, మనలోమన కేటి కిట్టిమాత్సర్యంబుల్. క॥ నహానమొకించుక లేకిటు, పరిహాసనములఁ దిట్టుకొనుటపాడియె మీకుఁ, గుహనాసంసారకులక్రియ, సిహిహీనివర్తింప నవ్వరే బుధవర్యుల్, తే॥ కాకకోకిలవ్యాసంబు, గడఁకవ్రాసి, గురులనింద్యించినారిసీ? కొంకకింత, మీరువిద్యావిశారదుల్ సారమతులు, కారె మిమ్ము నేమంచు నేదూఱువాఁడ. క॥ ఎఱుఁగనివారికి బుద్ధులు, గఱపుటమఱిదిద్దుటెందుఁగ రముశుకరమా, నెఱిఁగియు నెఱుఁగనివారల, తెఱఁగున జరియించుమీకుఁ దెలుపందరమే. క॥ అవధా

ఉ॥ కాకము మీఁదఁ బెట్టియిటు కాకులు మీఱుటకన్నఁ జక్కఁగా
నాకు గురుండెయాతఁ డని నన్ను వచించినయంత నిన్ను సు
శ్లోకులు కొట్టిరే! నృపతి సూరిగ నొప్పఁడె? యిప్పుడేని యీ
పాకము నేర్చికొమ్ము గుణవంతుల మెప్పును గొమ్ము పుత్రకా. ౧౯౩

---

రంబని యాడక, కృప విద్యలు నేర్పు వెంకటేశ్వరగురుతో, విపరీతబుద్ధిఁ గల వాదం, బు పెట్టికొంట దగదెందు, నువ్వుగుఁజుండీ. మ॥ బహురాజన్య సభాంగణంబులను దుర్వారకీర్తియాదత్తులై, మహిమన్ బెక్కు శతావధానములు సంభావ్యంబుగాఁ జెప్పలో, కవితుల్ తిర్పతివేంకటేశ్వరులతోఁ గాల్ద్రవ్వికయ్యానకున్, సహానంబున్ విడనాడి లోఁగు టిది యేచాతుర్యమో తెల్పుఁడీ. వ॥ తిరుపతి వేంకటేశ కవిధీరులకంటెను మీరు పాండితీ, గరిమను గొప్పవారొ! మఱి, కారొ? యెఱుంగను గాని వారితో, సరిగఁ గవిత్వమున్ నెఱపఁ జాలినవారని యెన్నఁ జాలమి, తెరవునఁ బల్కనాఁడనని, తిట్టకుఁడీ భవదీయమిత్రుఁడన్. తే॥ తెలియ మీకంటె వారల ధికులో లేక, వారికంటె మీరె ఘనులో, ధీరులైన; పెద్దలనుకొనవలెఁగాక వృథగనిట్లు. వాదులాడుకొనుట యేమిలాభంబు చెప్పుఁడి. క॥ మీఁదన వర్థులు కారని, యేరును వచియింపరెక్కు, వేయగుదురుగా, కీర్తిగురులనెదురుట, ధారుణి నేనెందుఁ జూడ, ధర్మంబిదియే. శా॥ సర్వజ్ఞుల్ బలరామకృష్ణులెమునున్, సాందీపుతో విద్యలన్, సర్వంబున్ గ్రహియించి వర్తిలిష్టత్వంబు రూపేర్పడన్, గుర్వంగీకరణంబు నల్పుటలు మీకున్ నచ్చకున్నన్ సరే, గర్వస్ఫూర్తిఁ జరించి దేశికునితోఁ గాట్లాఁడగా నొప్పనే. ఉ॥ తప్పొక వేళ మీగురుని, దగ్గఱనుండినపుడుఁ గాక యా, తప్పను సైఁచియుండినను, దప్పక మెప్పును బొందకుందురే, తప్పను జేసినారనుచుఁ, దద్దయుఁ జెప్పఁగ నయ్యెనియ్యెడన్, దప్పెక్షుయించు దేశికపదఁబులు వట్టిన మీకు బాలకుల్. మ॥ అరయన్ దేశికదేవధిక్కరణ శ్రీయసాక్కములైనట్టివి, వ్వారికిన్ గూడ దటించుఁ జెప్పవలెనా? ప్రజ్ఞావిశేషంబునన్, గురుఁ డేమూడఁగ వేంకటేశకవిపో, గుర్వుల్ మెచ్చమీరింక మీ, గురుపాదంబులుపట్టి, బాగుపడుఁడీ, క్రోధంబులో మ్రింగుచున్. మ॥ భయమున్ భక్తియుఁ దారతమ్యమును వి,శ్వాసంబు లేనట్టిదు, ర్న్యాయాలా నేఁటియపూర్వనాగరులమ, ర్యాదన్ బురే! మీరును, ర్జయుశౌతిర్పతి వేంకటేశ్వరులతో సాహిత్యసంవాదము, భయమందించుడి మెప్పుగొల్పునె! యశస్సంపన్నులన్ జేయునే

ఉ॥ వంకరత్రోవ లెన్నఁటికి వంకరత్రోవలె యందుఁ జొచ్చెనా!
శంకరుఁడేనిఁ బేరుగనఁ జాలఁడు చక్కసత్రోవఁబోవు మీ
వెంకనగారి పట్టుదల వేల్పులు సైతము ద్రిప్పఁ జాలరో
వెంకటరామశాస్త్రి! యవివేకి వెస్త్రైతి వెఱింగి సర్వమున్. ౧౯౪

ఉ॥ శ్రీ కలచోట నప్పుగొని చెచ్చెర దీర్పక మానె నేని త
త్పాకము గారణంబుగను దద్గృహ మందెటులో జనించు నన్
వాకులు సత్య మయ్యెఁ జామి నాఋణమున్ ననుఁ గాకిఁ జేసి నా
వాకిటఁ గోకిలంబ వయి వహ్వారె? తీర్చితి ముట్టెఁ బుత్రికా. ౧౯౫

క॥ అప్పు గొని తీర్పకుండిన, యప్పురుషుఁడు కుక్క యగుట యనుభవ సిద్ధం
బిప్పుడు కోకిల లగు టిది, తప్పదు కలికాలనూత్న ధర్మంబు సుతా. ౧౯౬

---

ఉ॥ శ్రీపద కృష్ణమూర్తికవిశేఖరు సన్నిధి మీగురుండు వి, ద్యాపరనంబు చేసినది, యారయ మానచతుష్క మయ్యె నం, దీపితబుద్ధి నాతనిని దేశికుఁడంచును జెప్పుచుండు "నే, నేపగిదిన్ గురుం డగుదునీతని" కంచు వచించునాతఁడున్. చ॥ చదువుట లేదుగాని నిజ, సంశయముల్ దఁగదీర్చు కొంటకై,వదెఁ బదె కృష్ణశాస్త్రిక విపర్యని యింటికిఁ జాలకాలమున్, గురుఁగఁ బోవుహేతువునఁ గూర్మియు భక్తియు మీఱనిచ్చలున్. మది గణియింతు సమ్మతిని మద్గురుగా నతనిన్ గశానిధుల్?. చ॥ గురుఁడెటువంటి వాఁడయినఁ, గూడదు దూషణచేయ దానిచేఁ దొఱఁగు యశంబు పుణ్యమని, తొల్లిటి పెద్దలు చెప్పువిందు మీ, కరణిఁ జరింపనేల గురు, గా గణియించుట కేమి వేంకటే, శ్వరకవి చాలఁడొక్కొ? యవిచారపు పోకలు పోవనేటికిన్. శా॥ ఏలా! పెద్దలతో విరోధపడి మీ, రీరీతిఁ బోరాడుటల్, మేలా! చూడ వివేకమింతవలదే?, మీశ్రేయ మర్థించి యే, మీలో నొక్కని నేనెఱుంగుటను బే, ర్మిన్ బోధ గావించితిన్, బాలత్వంబును వీడి బాగుపడుఁడీ, స్పర్ధాళువుల్ గాకుఁడీ.

బరంపురనివాసి,
గాదె జగన్నాథస్వామి.

---

బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వర శతావధానుల సన్నిధికి.

తమగీరతము చూచి శ్రీరామకృష్ణకవులఁ గూర్చి యీక్రిందిపద్యములు వ్రాసియభినవసరస్వతీపత్రికకంపియుంటిమి తాము చిత్తగింతురని సమ్ముఖమునకంపితిమి
"...మ॥ అరుదెంచెన్ గద రామకృష్ణకవులారా? సర్వదిగ్దేశ ళా, స్వరసాంద్రీకృతవిశ్వకీర్తినిచయశ్యామామనోహారులై, వ్వరో ఆ తిర్పతివేంకటేశకవి

## (8) గీరతపరిశంసాపర్వము.

ఉ॥ §గీరత మన్న యిట్టికృతికిన్ భవదీయ విజృంభణంబె సూ?
కారణ మయ్యె నిక్క మతనఁ గల్గినలాభ మవారి నాకు, నీ
పేరిటఁగాదె యిట్టి సుకవిత్వము చెప్పితి నాకు నేజమీం
దారును దీనిబోలె నెఱదాత యటంచును దోఁచ దర్భకా. ౧౯-౭

---

తాఁ ప్రాంచద్ధనుర్ముక్తమై, పరఁగంగాఁగల గీరతప్రవర మబ్బా! యెట్లు సైరింతురో? మ॥ మునుమున్ దాఁచియుఁ బుల్కి పుచ్చియు నిజంబున్ బల్క వారింబలెన్, జిన పాత్రంబుల వెల్లడించితిరి నష్టీభూతచిత్తమ్ములతోఁ, గనియోజించిన సత్య మంద గుపడంగాఁ బోదె? హా యెంతకై, నను వెన్కంగను వేయఁ బోవరుగదన్నా? మీరువిద్వత్కవుల్,, సీ॥ తాలుకుట్టన మునఁ దగశివరామశాస్త్రు ల్గణికలఁ బున యంబుమఱచి, గౌరవంబుగను వేటూరి ప్రభాకర శాస్త్రినీతులఁ దెల్ప జాఱవిడిచి, శక్తియున్నట్టిచో సభలోని కేతెందురందు లెండన్న దూరంబుతొలఁగి, గురుశిష్యులకును నెగ్గులు వనిక రావని వచియించు పెద్దలపలుకు వదలి. గీ॥ గీరతామ్నాయనేతృత్వధీరులగుట, కనుమతించితిరే? శశాంకాబ్జమిత్రు, లుండునందాఁక మీకతలుండకున్నె? ఊరకేగునె? గురునితోఁ గేరడములు. సీ॥ గుళికాత్రయంబుతోఁ గుంటుశతఘ్నిని బాశుపతంబట్టె పాఱఁదోలె, కవితావిమర్శనఖండనమ్మునకు సర్వాంగముండనమట్టె యల్లుకొనియె, కాకవిగాజుపింగాణిబుద్ధుల జీల్గు బెండులమేకుతోఁ బీఁకు టాయె, ఏదేశమిష్టమో యెఱిఁగింపుఁ డీసభ, కననిరుత్తర మునఁ జనుటయయ్యె. గీ॥ శక్తిలోఁ దారతమ్యంబు చాటనయ్యె, కవితలోఁ దారతమ్యంబు గాంచనయ్యె, నింకనీమాఱువేసంబు లెన్ని వేసి, నిజము దాఁపఁగనుంటిరో సుజనులార. ఉ॥ రెండవభాగమిప్డు ప్రచురింపగనుండిరి గీరతంబిఁకన్, లెండు మనమ్ము పట్టుక చలింపక యుండినలాభమేమి? మీ,పాండితి బైటఁబెట్టఁదలఁపన్ దగునిత్తఱి నూరకున్న నె, వ్వండయినన్ హసింపఁడొకొ? ప్రాజ్ఞులు మీరెటు సైఁపనేర్తురో?

దూపాటి తిరుమలశేషాచార్యులు.

ఇట్లుసోదరులు. వెంకటరమణాచార్యులు

---

ఆనందబాగ్; వేపరీ

మదరాసు. 19-12-11

......§గీరతము కొంత భాగమయిన నచ్చుపడి యుండినచో నొక ప్రతి పంపఁ గోరెదను.

చిత్తగింపుఁడు.
జి. రామయ్య.

క॥ ఒకగంట నేను వ్రాసెడి, చకచక నొక వత్సరంబు చాలదు నీకున్
బకబక లాడుచు వాదము, నకు దిగకుము మంచితోవ నడువుము పుత్రా.

క॥ గర్వి యనుచు లోకులు నను, నిర్వచనము సేయ నిమ్ము వినుఁ బోలెడిగం
ధర్వుఁడు శిష్యుఁడు దొరకిన, గర్విని బాతకుఁడఁ గూడఁ గావచ్చుఁగదా!

---

శ్రీరాములు.

శుభమస్తు.

తే॥ అయ్యా! తమగీరతము కొంచెకాదికాల, మందె యొకపద్యమాలి కనంపుకొంటి, నందు నాకుఁగలట్టి యిబ్బంది కతన, సాము వెలకెండటంటి మీస్వాంత మంటి. మ॥ జనియించుట్ మఖుఁ, బుబ్బలోన సమయుట్ స్వామీ! బహుగ్రంథముల్, కనఁగా ననృతకృత్యంబులౌర! తమవో! త్సుమ్రభానప్రారాజ్ఞక్షముల్, కనదుద్యద్రుచిఁ బొల్చు నంతవఱకుట్ గాల్పెట్, రసారామమై, ఘనమోదప్రదమై చవుల్ గొలుపు వేడ్కన్ బేర్మి సారించుటన్. సీ॥ అవధాన విద్యామహాశాఖ నింతింత వారినెక్కించిన ధీరమణులు, రసవత్ప్రబంధనిర్మాణ చాతుర్యధుర్యుల నెల్లరను జేయు లలితకవను, లుద్దండ భాషాద్వయోద్దామసాహితీ పతుల నెల్లరఁ జేయు ప్రౌఢగురులు, బహుచమత్కృతి యుక్త భాషణోపన్యాస పటిమ నందఱికిచ్చు పటువచస్కు, లరయఁ దిరుపతి వేంకటేశ్వరకవీంద్రులే యటంచు మహాల్లోకమెల్లనుడువ, వానిఁ గాంచిన కవితా విలాసులార, దివ్యతర భవ్యకావ్య వర్ధిష్ణులార? మ॥ అతినీతి ప్రదమై రసప్రచురమై యాహ్లాదసంధాయియై, మతి మత్సరద్వి హృత్కుజారకసమమై, మాయాలతా ప్రాభవ, స్థితిదూరంబయి యొప్పు గీరతము భక్తిన్ మ్రొక్కు నాకిష్టు మీర్, కృతికృచ్ఛేఖరులార; పంపుఁడు దయాశ్రీ చేతఁ బైరీతిగన్. చ॥ చదువ భవత్ప్రబంధములు చక్కని సాహితి నీయఁ జాలు బెం, పొదవు రసోచితిన్ దెలుపు యోగ్యతమంబగు వృత్తినిచ్చు న, మ్మదమొదవ చెక్కఁ జేయఁ బదమూ చిదను ప్రతిభన్ ఘటించు శ్రీ, పదకముల ప్రభారుచిర బాపురె! శ్రీపతి వేంకటేశ్వరా.

ఇట్లు విధేయుఁడు.

ది 21-7-1912 శిష్టా వేంకటసుబ్బశాస్త్రి,

పొన్నూరు పోస్టు, గరికిపాడు.

---

చ॥ ఉడుగక వ్రాసి తెందులకొ యొజ్జలకున్ "గురుఁ డాతఁ డంచు నే
నొడువక యున్న శిష్యుఁ డని నూటికిఁ గోటికిఁగూడ నీవు నె
ప్పెడునది చాలదే" యనుట పెంకెతనం బిది, "యింటివాఁడు పే
రిడి యిది గొడ్డుగేదె" యన నింకొకఁ డాడునె పాడి గేదెగన్.

... ... శా॥ గంగోత్తుంగతరంగఘుంఘుమరవాకారానుకార్యార్భటీ, భంగిన్ ద్రాక్షగుళుచ్ఛనిష్ప్యుతరసప్రచ్ఛన్నవేషంబు మీ. సాంగత్యమ్మునఁ బొల్చు సత్కవితకే, చందంబునన్ సాటిరా భూ, మిం గ్రిఁగంటిప్రసార శూన్యకవితా మీనాత్ము లూహింపఁగన్.........ఇట్లు జూపూడి, హనుమచ్ఛాస్త్రి, శతావధాని.

......చ॥ చదువుడు సూరనాది కవిచంద్ర పటుత్వ కవిత్వసారమున్, ముద మొదవ సూరుచుండ మనుమున్నిఁక నెప్పుడు గూడ నట్టె నా, హృదయము గీరతామృత మొకింత చవింగొను నాఁటఁగోలెఁ బా, యదురుచి సర్వకాల మపురాని కవనం బిటులుండు టొప్పదే. ఇట్లు విన్నవించి నమస్కరించు

ఆర్యాపురము, విధేయుఁడు

రాజమహేంద్రవరము 18-1-1913 భమిడిపల్లి సీతారామయ్య.

......నవీనముగా రచింపబడిన పంచమ వేద ప్రతిమానంబగు గీరతంబును దయచేయించ గలందులకు ప్రార్థన చేసుకున్నాను.

నరసింహదేవర గవరయ్య

సా॥ వెలగదుర్రు, తణుకుతాలూకా.

(1)...కలకత్తా చేరినాను, తమగీరతము వినవలయునని యిచ్చటి యాంధ్రవిద్యార్థులందఱు నువ్విళ్లూరుచున్నారు. కాన యీజాబు చూచినవెంటనే తమగీరతము నీక్రింది విలాసమునకు పంప ప్రార్థించుచున్నాను.

(2)...గీరతమును శిరసావహించితిని ఆగ్రంథరాజము నొకసారి చదివి తనివిదీరక యవకాశము చిక్కినప్పుడెల్ల నందలి భాగముల మాటిమాటికిం జదివి యానందించుచుంటిని.

Cantu Subbavadhany
191 Bow Bazar
Callutta

క॥ కల రెండతేని శిష్యులు, కలిలో నాకుఁ బలె నితరకవులకు మఱి వా
రలకున్ వారికిఁ గలహము, గలుగని దెటు! నీకు నాకుఁ గలిగిన దెట్టుల్.

సీ॥ నారాయణాస్త్రమ్మునకు నమస్కారమ్ము శ్రీకృష్ణుఁ డానాఁడు చేయలేదె
భీష్మసాయకవహ్ని బిట్టేర్చి మండంగఁ గృష్ణుని ప్రతిన చెట్టైకఁ లేదె,!

---

......గీరత సందర్శనార్థమై చంద్రచకోర న్యాయముగా వేచుచున్నాడను. వేగిరమంపకోరెదను. చిత్తగించవలెను.

K. V. Kristna Rao

---

చీరాల ది 30-6-12

......గీరతము అనుమహాగ్రంథమును వకటి నాకు పంపకోరుచున్నాను యీగీరతము నేను చదివి జన్మసాఫల్యము చేసుకొనుటకై వ్రాసుకోవడమయినది.

తేలప్రోలు సుబ్బారావు వ్రాలు.

---

......మ॥ వెన్నంబోలిన మీకవిత్వ మొకబల్ విందయ్యె మిమ్మిప్పుడే, గన్నారంగని నే భవన్మధుర వాగ్వ్యాఖ్యానవ్యాలోకనో, త్పన్నానంద విచిత్రచారు మణి సౌధంబెక్కఁ గాంక్షింతు ర, మ్మన్నన్ వచ్చెదఁ జెళ్లపిళ్ల వరవంశాగ్రగణ్య ముక్తామణీ. సీ॥ అష్టావధానశతావధానము లనువని చిన్ననాఁడె నేర్చినది కాదె వాగ్వాదమందు విద్వాంసుల గెల్చుట కరతలామలకమ్ము కాదె, రసవత్ప్రబంధ నిర్మాణ చాతుర్యమ్ము తమకు స్వార్జితమైన ధనము కాదె, దిక్ప్రథసంచర కీర్తి మీకొక స్వయంవరలబ్ధయౌ ధర్మపత్ని కాదె, గీ॥ యనుచు నుతులను సామాన్యజనమె కాదు, వైరులకునైనఁ జేయక తీరదనుచు, నాకుఁదోఁచెను సత్కవిలోకతిలక, వేంకటేశ్వర కవివర్య! వినుతచర్య. చ॥ మఱియొక చిన్నవిన్నపము మన్నన చేసెద రంచునెంచి యి, త్తెఱఁగున వేఁడుచుంటి భవదీయకృతివ్రజమందు సత్సుధా, కిరదకలంకసంఘటితగీరతముం బరికింప వేంకటే, శ్వరకవివర్య! మీకృతులు సర్వముఁ జూడఁగ వేడ్క యయ్యెడిన్.

ఇట్లు ఆకొండివెంకటశాస్త్రి
బొబ్బిలి సంస్కృతపాఠశాలాపండితుఁడు.

---

పదునెన్మిదవనాఁటి పడుచుపాలునిబారి కెదఁగొంకి పాఱఁడే కృష్ణుఁ డెటకొ,
సైంధవవధకు నాచార్యు మ్రొక్కింపఁడే శ్రీకృష్ణుఁ డా నాఁడు క్రీడిచేత,
తే॥గీ॥ నిజముగానామసామ్యంబునీదుబావ, మఱఁదికృష్ణునకున్నయమ్మహితుగుణము,
గూడ నున్నను గీర్తి చేకూఱనీఁడు, ఎట్టులో నిన్నుఁగాపాడి యేమిఫలము.

---

......ఆ. వి. పి, సంతోష పూర్వకముగా 1-8-0 చెల్లించి పుచ్చుకొని గీరతంచదివి పరమానందమును పొందినాను. రెండవ భాగముకూడా త్వరలో అచ్చువేయించి పంపించ గలందులకు కోరుచున్నాను. మ॥ రా॥ శ్రీ. వే॥ రా॥ గ్రంథమాలద్వితీయ గుచ్ఛకములో శృంగభంగమందు (5)వ పుట కడపటిఉత్పలం "కౌముదిఁ జేతఁబట్టి"యను పద్యము మొదలు నాలుగు పద్యములుచదివినంతనే వారివ్రాతలయందు సందేహముతో నుండిన మమ్మును మీ గీరతమువల్లను సంశయ నివృత్తి చేసినందుకు చాలా సంతోషముగా నున్నాను.

P. Ganardanam, Naidu.
Baruva Post
Ganjam District.

---

కేశ్నకుర్తి, ముమ్మడివరం పోస్టు. ఆకొండి సుబ్రహ్మణ్యం కృతానేక నమస్కారములు.

......గీరతం అచ్చుపడినట్టుగానే పంపిస్తామని వ్రాసినారు కాబట్టి అచ్చుపడినట్టు

---

విన్నాను:...యీ గీరతంలో సర్వాంశములున్న పున్నవనిన్ని బహుబాగా వున్నదనిన్ని, చూచినవారు చెప్పడంచేత నాకు చాలా కుతూహలంగావుండి యీ వుత్తరం వ్రాసినాను గాన ముఖ్యముగా పంపించకోరుతాను.

ది14-10-12. ఆ॥ సుబ్రహ్మణ్యం.

---

Nuzvid. 28-7-1912

......గీరతము ఇప్పటివరకు కొంతచదివితిని. యింతవరకు నాకు తీసివేయవలసినపద్య మొకటియు కనుపడలేదు. ఇది నాయొక్క నిశ్చయమైన యభిప్రాయము. (తమయొక్క) గీరతములో 34వ పేజీలో "కృతి" యన్న కంద పద్యములో ప్రాసపోయినటులు నాకుదోచినది.

నారయ్యప్పారావు

సీ॥ సకలాగమాంతసంచారి యాకృష్ణుండు సకలాగమాంతసంచారి యితఁడు,
పరమసత్యాసక్తభావుఁ డాకృష్ణుండు పరమసత్యాసక్తభావుఁ డితఁడు,
గాంగేయగౌరవాక్రాంతుఁడా కృష్ణుండు గాంగేయగౌరవాక్రాంతుఁ డితఁడు
పూతనానాశనస్ఫీతుఁ డాకృష్ణుండు పూతనానాశనస్ఫీతుఁ డితఁడు.

---

అయ్యా! 12-7-12, చిత్రాడ.

తమరు పంపించిన గీరతము అందినది. గ్రంథంబు చదివినకొలది మాయుల్లంబపరిమితానందవార్ధిఁ దేలుచుండె, పంచమవేదం బనంబడుభారతంబురీతి మీగీరత పుస్తకంబు పెక్కునీతులచే విరాజిల్లుచుండె. తక్కిన భాగంబులుకూడ అచ్చుపడిన వెంటనే పంపించగోరెదను. తమరు కావించిన శతావధానగ్రంథములన్నియు వి. పి. గా పంపించకోరెదను. ఇట్లువిధేయుడు

చెలికాని, లచ్చారావు.

---

12-1-1911, Bezvada.

శా॥ అయ్యా! మీరగు శిష్యకోటికిఁ బ్రశిష్యప్రాయుఁడౌ వీరమ, ల్లయ్యాఖ్యుండు వచించు విన్నపము మీయాంతర్యమందుం గొనుం, డయ్యా! యీయసమానకక్ష తమబోంట్లా పూనుటే? టూరామకృ, ష్ణయ్యల్ పిన్నలు సర్వధర్మముల, మీరైనన్ గృపన్ మానుఁడీ. ఉ॥ వారలతప్పు తొల్త గురువర్యుల నెన్నకయుంట పిమ్మటన్, దూఱుట; రెంటిలో మొదటి దోసము తప్పని వారెయొప్పిరాటె?, వేఱొకదోసమౌటె? తమదు వేసము పోషణ సేసికొంటకా, దారినిఁ బోయిరందులకుఁ బగ్గ చివాట్లిడిరంత చాలదే. తే॥ గీ॥ చాలు మూలయుఁ దగు ప్రమాణాలు లేని వ్యాసములమీఁద ద్వైపాయనార్యుఁ డటు వి, మర్శనము సేయుచున్నాఁడు మరల,మీరు, తగువిధమున శాంతింపుఁడు దయవహించి. క॥ అత్తఱి వారిచ్చిన ప్రత్యుత్తరమును జూచువార లూహింపరె మీ, చిత్తమునకుఁ దోఁచదె! యీ, పొత్తసమానమ్మనుచును భూనుతు లీరల్. ఇట్లువిన్నవించు భవద్విధేయుఁడు,

కాశీనాథుని, వీరమల్లయ్య.

తే॥గీ॥ అర్థభేదమ్ముదక్క — లేదతనికితని, కెందు శబ్దంబు లొకగతినే పొసంగు,
నేర్చికొను మాతనిగొనాలు నీకు నిహ వ, రంబులం బ్రతిష్ఠ కభ్యంతరంబులేదు,

క॥ గోవర్ధనుc డాతం డా, గోవర్ధనుc డితcడు వీని కుచ్చితమే ని,
న్నీవిధికిం ద్రిప్పెcదప్పడు, త్రోవలు నీవింత మును పెఱుంగ వెఱుcగుదుగా.

---

31-1-1911, గుంటూరు.

శుభము.

(1)...క॥ శ్రీతిరుపతి వేంకటకవి, భూతేశులు వినుcడు నాయపూర్వపు మనవిన్, మీతెలుcగు గీరతమ్మొకc, డీతటి నాకందcజేయుడీ వీ, పీ, గాన్. క॥ అప్పటికాభారతమిcక, నిప్పటి కీగీరతంబు నెన్నొవిషయాల్, నెప్పcగ వెలువడెనని యెద, రెప్పుడు చూతునొ యటంచు నేననుకొందున్. క॥ మీరురచించిన రూపక, భారతభాగములcగాంచి ప్రజ మెచ్చెcగదా, గీరతము నెల్లగాంచును, యారయ మీకవన మెప్ప డనదృశమెకదా. ఉ॥ తొలుతటినుండి, తెల్గనినదూరము గాc జనువారు గూడ మీ, తెలుcగుc బ్రబంధముల్ చదివి, దివ్యతరంబగు తెల్విcగాంచి పే, శలగతిc దెల్గుcగబ్బముల నల్పcగ సాగిరి కీలెతింగి లో, కులకెటువంటి మేలు నమకూర్చిడివో కనుcడీ భవత్కృతుల్. ఉ॥ ఎంతటి యూహలేని లగియింపcగ జేయుచుc బద్యమందుc గొం, డంతలు భావముల్ దెలుపు నట్టివదంబులc గూర్చుచున్ గవి, త్వాంతము సాహితీపదవి నందిరచించి కృతుల్ వధానముల్. వింతగc జేసి మీరు ప్రతిలేని యశంబును గంటి రిద్దరున్.

(2)...గీరతము కడవఱకుc జూచితిని న(క్రమము. నధర్మము. ననందర్భమునై యున్నది. ధారాప్వారస్యాదులకు మెచ్చనివారు ముందుపుట్టవలెను.

ఇట్లు శిష్టాహనుమచ్ఛాస్త్రి. గుంటూరు.
తెల్గుపండితుcడు, టౌను హైస్కూల్.

---

(1)...గీ॥ మీ కవిత్వమునన్ బహు మిన్నగునcట? బహుకవులచేతనన్నుతుల్వడసినదcట? పరికృతులం గూడనంతోషపఱచినదcట? భారతమునకుc బ్రతియగుగీరతంబు

(2)......మీరంపిన గీరతమందినది. దానినిసమగ్రముగా జూచినాను వేంకటరా

ఉ॥ ద్రావిడులందు మూఁగురుగదా! గుణవంతులు, నేను బావయున్
నీవును సర్దుకొందము "మనీషులు నవ్వెదిరూళ" తిర్పతిన్
జేవయెటుల్ ఘటించు! గురుశిష్యవినోదము లింత చక్కఁగా
నావలె నీవలెన్ దెలియునా! వెలనాఁటిశతావధానికిన్. ౨౦౮

---

మ కృష్ణకవులు పాండిత్య మెట్లున్నను అత్యద్భుత బిరుదుపొందిన వారఁట! అట్టి వారికి శృంగభంగములు వ్రాయుట లెక్కలోనిది కాదు, మీగీరతమందు మాకు తెలిసిన విషయములు వారివిషయమై వినుండు. (1) గురువును మఱచుట. (2) రిజ ష్టరుత్తరంతిప్పివేయుట. (3) చాటున పద్యములల్లుట, (4) వ్రాసినమాటకుబదులు వ్రాయకుండుట (5) శృంగభంగములు వ్రాయుట, మొదలయినవి గ్రహించితిమి. మార్గముఁజూపినను తెలిసికొనలేనివారితో నేమి సార్థకము.

చ॥ తిరుపతి మార్గ మిట్టిదని తెల్పఁగ వేంకట నాయకుండు త। ద్గిరివర మెక్కనాఁడిది యొగిన్ గనినారు సువర్ణముఖ్య లీ। తిరుపతి మార్గమిట్టిదని తెల్పితి వేంకటశాస్త్రివీవు త। త్పురుషులు గాంచినా రిది కుబుద్ధులు వారలు గాంచ నేర్తురే.

వీరు శృంగభంగములు వ్రాయుటయు, తక్కంగల్గు పండితమ్మన్యులుమీ పైకివివాదమునకు కాల్దువ్వుటయు చూడ మీకవితావనితా శుభసూచకము స్ఫురించుచున్నది. యెట్లన.

ఉ॥ క్షోణిజనమ్ము లందఱు విశుద్ధగతిన్ జరుపంగ "నిత్యక, ల్యాణముఁ బచ్చతోరణము హాయిగ వెంకటనాథుఁ డందె మీ, రాణిసుకీర్తి సాధ్వియ దిరాపిడిచేసిన రాదు. నిత్యక. ల్యాణముఁ బచ్చతోరణము హా యిటమీర్గొనినా రుదానిచే. తెలికేపల్లి, రామచంద్రయ్య, వేలూరు, చిలకలూరిపేటపోస్టు.

......సీ॥ భాష్యముల్ ల్సమకూర్చి పలు పాత్రములొనర్చి వఱలు శ్రీశంకర గురులుదక్క. వేదాల వివరించి వేనవేల్గ్రంథము ల్చేసుపు విద్యారణ్యమునులు దక్క, ఎనుబది కావ్యంబు లొనరించి శివభక్తపతియైనయప్పదీక్షితులు దక్క. తమి నూటనాల్గు కబ్బములల్లి కృతియైన నీలకంఠాచార్య మౌళిదక్క, తే॥గీ॥ భూమినె వ్వరైననిన్నియా పుస్తకములఁ, జారుకవితరచించిరే మీరుదక్క, చెళ్లపిళ్లకులాంభోధి శీతపాద, సద్వినుత బోధ వేంకటశాస్త్రివిబుధ....ఉ॥ గీరతమన్న సర్వగుణ కీలి

శా॥ శ్రీకృష్ణుం డుదయించు హేతువున సుశ్రీ మించె రేపల్లె. నీ
యా కృష్ణుం డుదయించు హేతువున నో? యాకారవల్లీ సమా
ఖ్యాక గ్రామము దర్శశోభ్య దయ పారావారముల్ దాఁట లే
కే కాకారతఁ గుందుచుండెఁ గనుఁగొంటే శిష్యచూడామణీ.

---

తమూర్ధవ పాకసారము, వ్యారిగఁ జూచిదానిప్రతివర్ణ సరద్రసపూరమానఁద, ద్భారతవైఖరిందెగడెఁ దక్కినభాగము లన్నిపూర్తిగాఁ, గూరిచివేగమంపుఁడిది గోరెదఁ దిర్పతి వేంకటేశ్వరా.1   8-11-12, సోమవారం, గుంటుపల్లి, గోపాలకృష్ణయ్య.

---

ది 4-8-12 సం॥ కాకరపర్రు.

అయ్యా!!

తమరు చేసిన గీరతము చాలాబాగావున్నదనిన్ని, మిక్కిలి రసవంతముగా వున్నదనిన్ని, మీవాక్కు అనేనరస్వతికి ఈగ్రంథము ముఖ్యస్థానమనిన్నివింటిని.

చర్ల సూర్యనారాయణవార్లు.

---

ది 30-8-12 యింజరం.

...... ప్రతిపద నీతిదాయకంబగుచు నరన వద భూయిష్ఠంబగు మీగీరతమున మొదటిభాగమును జూచితిని అందు మీరు మీశిష్యులను మందలించి నయమార్గంబు లంగఅవుటకై ప్రయత్నించినయంశములు పెక్కు లున్నవి. కొమరుం డెన్నియ కృత్యము లొనరించినను జనకుండవియన్నియు సహించి యూరకుండు నటుల మీశిష్యులు మీపై యెన్నివ్రాతలు వ్రాసినను మీయశస్సునకు భంగము కలుగ నేరదు. యిదియంతయు దెలియునటుల గీరతము భారతమంత గ్రంధముగా వ్రాయుచుండిరి. యియ్యది జూడంజూడ పిచ్చుకపై బ్రహ్మాస్త్ర ప్రయోగమువలె గన్పట్టుచున్నది. యెవ్వరి శక్తిసామర్థ్యంబు లెట్టివియో సుధీవరు లెఱింగిన విషయమేని మీకు దెల్పునంతటి సమర్థుండను గాకపోయినను గీరతంబింతతో విరమింప బ్రార్థించు నన్ను మన్నింతురుగాక. గీరతం పూర్తిఅయిన వెంటనే ఒకటి నాకు వి, పి. గా బంపబార్థించుచున్నాఁడను

సాలగ్రామచింతామణివార్లు.

ఉ॥ కాంకరపర్తి లేఖలను గాంచి నరుత్తర మేది లేమి వా
ర్తాకు సమీప బంధు లనినన్ జగ మొప్పెడి నంచు నెంచియా
సాంకున దూరదేశగత సజ్జనులన్ గికురింప నెంచెదే?
యీకపటంబు కృష్ణకవిదే యగునో? మఱి నీదియో? సుతా. ౨౧౦

---

(1)...ఇకాలమహిమ కనుకూలముగ తమచే వర్ణింపబడి భారతముకు బదులుగవర్తించు గీరతము నే చదువవలయునను పెకంద్రుడు చదువర్లు నుకిర్ణ వర్ణింపు వాక్యంబులను విని నేనువ్రాసుకునే మనవియేమనగా... గీరతము 1 ప్రతిన్ని... ఈ నాల్గుప్రతులు వీ. పీ. గా పంపవలయునని నిత్యము నమస్కరింపుచున్నాను.

(2)...అయ్యా తమరు రచించిన గీరతము, శ్రవణానందము, తమ కరుణవలన యిప్పటికి 2 పుస్తకములు ఆసాంతము చదివితిని శ్రవణానందము జారులపాలిటి ఫిరంగివలెనే నిత్యానందము నొసగుచున్నది. గీరతామ్నాయము కడవరకు చదివినాను. యియ్యది కలియుగ భారతమనుటకు యేమిన్నీ సందియము లేదాయెను. కుంతికుమారుల బైకొనిన దుర్యోధనుని మాడ్కి తమపై రామకృష్ణకవుల ప్రల్లదములు గాన్పించుచున్నవి గాని వేరొండు కాదు. అయ్యా మీగీరతమునందు రామకృష్ణుల ప్రసంగదమసము లేకాని కొప్పరపువారివిషయములు లేవు, యీవిషయమై జరిగిన ప్రబంధమేదియైనవున్నచో వీ. పీ గా దయచేయుదురని నానమస్కారపుమనవి.

పేరేచర్ల హనుమంతరాజు వ్రాలు. ది6-9-1911

కాకాని, సంతమాగులూరు పోస్టు

నర్సారావుపేట తాలూకా, గుంటూరుజిల్లా.

---

ది13-9-10

గొల్లకోట భైరవశాస్త్రి అనేక నమస్కారములు ...యీమధ్య తమరు అచ్చువేయించిన వాదపత్రిక నాకు వినడమందు చాలాకుతూహలముగా నున్నది. పిఠాపురములో తమ పత్రికను చూచినవారు చాలా సంతోషించుచున్నారు... ...యీపత్రిక యున్న పంపించితే దానిఖరీదులు దాఖలుచేస్తున్నాను.

ఇట్లు విధేయుడు గొ॥ భై॥ శాస్త్రి.

$శా॥ నీమేనత్త కొమారుఁడే తెలిపె వానింగూడ నా బందు వం
చేమేనిన్ లిఖియింప నేరుతువె మీకృష్ణుండు నీతండునున్
సామాన్యంబుగ నన్నదమ్ములనుతుల్ సత్యంబు నందాకఁడు
ద్దామం డింకొకఁడో? యసత్యమున విద్వాంసుండు శిష్యాగ్రణీ. ౨౧౧

---

......ఉ॥ వింటిని గీరతమ్ము మును వేదమెయానని ధర్మబోధయం, దుంటిని వచ్చుటెస్టాయని యో గురుశేఖర! గీరతమ్ము నే, డంటిని వేదమే యనుచు నాగ నిరూరసవిత్ కవీంద్రు! వా, కొంటిని వీ. పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ములన్.

ఇట్లు శిష్ట్లా హనుమత్ శాస్త్రులవారి శిష్యుఁడు
మంత్రాల కామేశ్వరరావు.

---

......శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభిర్మిథ్యాప్రలాపాత్మకో, యుష్మద్గ్రంథవిదూషణాత్మకతయా గ్రంథస్తు యో నిర్మితః,దృష్ట్వాతం బహుధావినిశ్చితధియా మస్మిన్ప్రజానాంవచ శ్శ్రుత్వా కించిదపి, పవిత్తమలనస్తద్గీరతాదర్శనాత్॥
శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోర్ఘురింతాం, సభాసువిస్తారయితుం మనోమే,నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు,తమవిధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి.
కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా, యెర్రగొండపాలెం.

---

$...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దాని శైలియిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు...చెప్పట్లపర్వములో మా సూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు, అది అన్యాయమని నేను దలచుచుంటిని అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణమ్మంత శిష్యుడు కాకపోడు, వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున. విశేషమైన భక్తికలవారైనను, మా పెత్తండ్రిగారి అబ్బాయి యిటీవల భక్తిలేనివాడుగా మీకు కనుపించుచున్నాడు. అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదుగాని నిజానికి అంతరంగము నందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తికలవా

ఉ॥ వేదుల రామకృష్ణునకు వేదులవారును జర్లకున్ స్వదా
యాదులునున్ విరుద్ధులయి యగ్భకొనసత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టి కాదది ప్రమాదములోఁ బడు వాఁబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట సుమ్మి పుత్రకా. ౨౧౨

చ॥ ఒకఁ డెవఁడో వివేకవిరహుం డుదయించిన నంతమాత్ర స
త్ప్రకరపరంపరా జనిపదంబులు వంశము లప్రతిష్ఠ చేఁ
గకవిక గాంచఁ బోవనుచు గట్టిగ చాటుట కున్నమాట వా
రకుటిల చిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతన్. ౨౧౩

---

దేఅని నేనేకాక యీగ్రామమంతా కూడా యెరిగిన సంగతియే, మాసూర్యనారాయణశాస్త్రిగారు మీవిషయమై యెప్పుడుగాని, యేవిధమైన చెడుప్రసంగము చేసినవాడుకాడు. యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజంచెప్పేవాడే కాని వేరు మోస్తరువాడు కాడు, యితడేకాదు వాళ్లువ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పదువని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మారామకృష్ణమ్మ మాట అటుండగా, శ్రీవ్యాసమూర్తి శాస్త్రులు గారి తమ్ముడువల్లనే అనిమాగ్రామంలో చెప్పనివారు వకరూరువుండరు. యిట్టిస్థితిలో మాసూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట అతనికిన్నీ నాకున్నూ చాలావిచారముగానున్నది. యీసంగతి అతడు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పుకూతలు అయినప్పటికిన్నీ అతడు అచ్చునకు తీసుకొనివెళ్లుట, ఆనాలోచన పనిగా తమరు నమ్మవలెను, ఇటీవలఅవధానములలో తమరినిగురుస్తుతిగా నుతించినాడు. ఆపద్యము నాతోచాలాసార్లు వినమని చెప్పినాడు. ఆపద్యములు ముందు అచ్చులోనున్నవి. చూడగలరు, ఆరెండవనాటి అల్లరిసభలో కాకరపర్తి వెంకటశాస్త్రియున్నూ; నారాయణ శాస్త్రిగారున్నూ, వీరికి సంబంధించినవారున్నూ కాక మిగతా వారీయుద్దేశం కలవారు కారు. మీకుమాత్రం అప్పుడు అంతాదురుద్దేశం కలవారనే అని అనుకొనియుందురు. యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మాకాయర్థము స్పష్టమవుచున్నది. మాసూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవాడుకాడు, యితడు మీగీరతంరాకపై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు, వచ్చినతరు

చ॥ ఎఱుఁగని వారి కన్నుల నెటే నిను మూరక చల్లవచ్చు ద
గ్గఱఁగల బంధుజాతపు మొగంబులు మూయఁగ నేర వూరకే
పరుగిడ కిప్పుడేనియు సెబా సనిపించు కొనంగ యత్నముం
బోరయుము కృష్ణసత్కవికి బుద్ధిని జెప్పి మరల్పు మర్భకా. ౨౧౪

చ॥ సకల మెఱింగి నా కవయశం బొడఁగూర్పఁగ నెంచి వెఱ్ఱి దు
ష్ప్రకటనముల్ పొరింబొరిగఁ బత్రిక నించెదె? కొండ వీటి వా
రికి మఱి బానటయ్యెదె యరిప్రకరంబు లిఖించు దుర్వచః
ప్రకరము పాత్రమందుఁ గొని ప్రల్లవముల్ లిఖియింతువే సుతా. ౨౧౫

---

వాత మిక్కిలిగా సంతోషించిన భాష్యకారశాస్త్రి వగైరాలతో పాటితని నెక్కనిగా భావించుచు రెండవకూర్పులో యితనిని సవరించెవరని నమ్మెదను.... ...మరుదినమందు పశ్చాత్తాపపడని వారేలేరు, ఒకనాడు మా రామచంద్ర పెదనాయనగారు, మా రామకృష్ణమ్మను చీవాట్లువేయగా నేనువిన్నాను. యెవళ్లు యెంత దాచుకున్నా సంగతులు తెలియకపోవు. కోకిలకాకములో 'కావు, కావు, కావు, కావు, అను కల్పనయె యిప్పటికిని మీకవిత్వమందు వాళ్లకు భక్తికలదని చెప్పుచునేయుండును. సీ॥ ఇవి రాజసుతులు చేయవలసిన పనులు కావు కావంచు గాకమ్మలఱచె,, అను బుద్ధచరిత్ర సీసపద్యమును జూచినవారికి విస్పష్టమే, లోకములో సత్యమును గ్రహించేవారు పలువురు వున్నా అనృతపు వ్రాతలు వ్రాశేవారు వ్రాయకమానరు. వేమవరంలో తమకు జరిగిన సన్మానమునుతమరు అక్కడ జూపిన అసాధారణశక్తియు ఒకవిద్యార్థి అక్కడ స్వయంగా చూచి వచ్చి మావూరిలో నాకు చెప్పినాడు, శ్రీశీతారామశాస్త్రి మరియు మొదలైనవాళ్లు చాలాసంతోషించినారు. విచారించేమాటములో వారుగూడా కొంతమంది నాదగ్గర సంతోషించినారు. యిటీవల నేను యేలూరువస్తిని అక్కడ ఆంధ్రపత్రికలో కామేశ్వరకవి వ్రాతచూస్తిని, తివా్రితకున్నా నేనువిన్న దానికీ సంబంధములేదు. ఆ వ్రాతలు ప్రకటించిన పత్రికాధిపతి తెల్వితేటలను గూర్చి నాకు చాలా విచారకరమైయున్నది. ఎప్పుడున్నా దుర్మార్గులు చెడుపనులు చేస్తూనే వుంటారనన్నందులకు, ఆ వ్రాత దృష్టాంతముగా యున్నది. యీవార్తల నిజము మావాడు యెరిగి వుండికూడా యేదోపేరుపెట్టి ప్రకటిస్తూయుంటాడు, యిట్టి వ్రాతలవలనగాని పట్టికోతల వలనగాని మీకీర్తికి యిసుమంతయు లోపంబురాదు.....

ఉ॥ పుట్టిన దుత్తమాన్వయము పోయి వసించినచోటు ధర్మపుం
బట్టము పీఠికాపురము, పార్థివుఁడో యలధర్మరాజె నీ
కిట్టిదురూహ పుట్టుటకు హేతువు గానఁగలేక సారెకుఙ్
గట్టితి నిన్ను పద్దెము లఖండయశమ్మును నీ కొసంగితిఙ్. ౨౧౬

ఉ॥ ఎంతటివాఁడొకొ శిష్యుఁడతఁడెంతటివాఁడును గాఁడయేని దు
ర్దాంతుఁడు వేంకటేశ్వరుఁడు "తన్నుఁ దలంపఁ" డటంచు నిఁతగాఁ
జింత వహించునేకొ మఱియుఁ జెప్పనె భారతమంత గ్రంథ"మం
చెంతురు లోకు లెట్లయిన నేమి కృతార్థుఁడ వైతి వర్భకా. ౨౧౭

ఉ॥ ఎందఱు శిష్యులో కడు నహీనునిగా ననుఁ గొల్చుచుండ నీ
యందునె పట్టు పట్టుటది యారయ నీదుపురాకృతంపుభా
గ్యందిరకాక యిందునొక హేతువు గల్గునెకొ ధన్యమూర్తి మీ
వందఱు శిష్యులందునగు నర్భక! నందియ మిందులేదు సూ ౨౧౮

---

...బ్రహ్మానందశాస్త్రి వ్రాసినట్టుగా మాగ్రామములో కొంతమంది కోతిమూక
వున్నది ...పుంగవుల కొరకు గుంటూరులో మూడుమాసములు వసించిన మీరు
మాగ్రామములో రెండురోజులైనను వసించినయెడల మీవైరులెంతగంభీరులో తెలి
యకపోవునా, దర్లదలపతి వ్రాసిన క్షమార్పణ వుత్తరంవల్లనే తమకు గోచరించి
వుండవచ్చును....పిడుగువంటిది తిరుపతిశాస్త్రిగారి వుత్తరం వచ్చినతోడనే అత
నికేకాదు ఆపక్షములో పెద్దతలకాయలకును గుండెజలజనించె...మీధాటికి వారె
వరు, వీరెందులోవారు. మహాగజాశిపలాయంతే మశకానాంతుకాకథా, యిదివి
చ్చుకపై వజ్రాయుధ మన్నట్లున్నది, అయిన యిది ఒకమిషచేసికొని మీరు
మాబోట్లందరికి గురుశిష్య ధర్మాలను. వుపదేశించుటచే లోకోపకారమని చాలా
మంది పెద్దలెల్లరు నుడువగా నేనువిన్నాను. మీగీరతమును జూచి నారాయణశా
స్త్రికూడా సూర్యనారాయణశాస్త్రితో నిన్ను కారకునిగా వ్రాసినారు. గాని
యింతచేసిన మమ్ము యేమియు దూషణవ్రాత వ్రాయనేలేదుగదా, బాగుగాను
న్నదే అని వకనాడు అనివున్నాడు,...రెండవ కూర్పులో సూర్యనారాయణ
శాస్త్రిని తప్పక నిరపరాధినిగా నవరణచేస్తారని నానమ్మకము, యివియే అనేక
నమస్కారములు. సామవేద్ల సూర్యనారాయణావధానులు వ్రాలు.

సాకిన్ కాకరపర్రు

ఉ॥ "శృంగపు భంగముకా" గని యసీసీ యని కొందఱు రాజ మాఘ లీ
వెంగలి వ్రాఁత వ్రాసిన ప్రవీణుల ప్రజ్ఞను సత్సభా మహో
త్సంగమునందుఁ జూత మని జాబును మీకు లిఖింప నెంచి న
న్నుం గని పలకా వారల ననుంగుల నేను మరల్చితిం జుమీ. ౨౧౯

---

## (9) సంకీర్ణపర్వము.

ఉ॥ *పావము? వా రెఱుంగుదురె పాండితి నీయది, వత్తు వంచు ని
న్నోపికఁ బిల్వ నెంచి రెటులో పికి? యీ వాకసాకు పన్ని యా
భూపులఁ జిన్నఁబుచ్చె దవు పొచ్చెము పన్నుట కీవు నేరవే,
దాపున బావ లేఁడె యిది తజ్ఞులు దక్క జగం బెఱుంగునే. ౨౨౦

---

### క్షేమము, ఆశీర్వచనములు.

మీరు మాఊరు వచ్చినప్పుడు ఇంకా వుంటారుకదా అనుకొన్నాము. వెంటనే వెళ్లిపోయినారు. మీరు యెంతగొప్పవారయినను బంధువులను అనాదరించడము న్యాయముకాదు మావూళ్లో యెవళ్లో అల్లరిజేసినారని మేమంతా దానిలో వాళ్లమే అని వూహించి మామీద శీతకన్నేయుట ధర్మముకాదు. రామకిష్టమ్మ వ్రాసిన తప్పుడువ్రాతకు మావూళ్లో పెద్దలెవ్వరూ హర్షించడములేదు. రామకిష్టమ్మ తండ్రిగారు కూడా కొడుకుచేసినతప్పుపనికి చాలా నొచ్చుకోవడము నేనువినియున్నాను. తండ్రే మెచ్చుకోనప్పుడు ఇతరులు మెచ్చుకొంటారని మీరాలోచించడము తప్పు, ఆనిమళ్ల సీతారామశాస్త్రులు వగైరాలు మీరు వెళ్లినతరువాత రామకిష్టమ్మ వగైరాలను చాలామందలించినారు. గ్రామానికి అప్రతిష్ఠతెచ్చేపనులు పెద్దలెవ్వరూ సమ్మతించరు. నేనుచదువకపోయినా మీకుమాకు వుండె తేడాపాడాలు యెరుగనివాడనుకాను. తాతపూడి భానప్పవ్రాలు.

---

*వుత్తరం...శ్రీశ్రీ... లు... చిత్తగించినారు, యింతమాత్రము చేతను వారి మనస్సుకు తృప్తిగాలేదు,... సభచేయించి తగుపండితులను ఆహ్వానంచేసెదమనిన్నీ ఉభయపార్టీలకు పబ్లీకు వుత్తరములు వ్రాయించెదమనిన్నీ యీవుత్తరం అందినతోడనే ఒకరోజుశెలవ్వుపుచ్చుకొని రావలశినదిగా తెలవుయిచ్చినందున విన్నవించెదను. ది 11—8—11 (చేవ్రాలు)

ఉ॥ కోయిలయెల్ల కాల మొకకోటరమందె వసింప దొక్కొటో
తీయని మావిగున్ననె గతిం దలపోయదు మావిగున్నలం
దేయెడ సంచరించు టది యెవ్వ రెఱుంగరె? యొక్కొసారి పైఁ,
బోయి స్వశక్తిపద్ధతులు పొంపిరివో విహరింపు మర్భకా ౨౨౧

ఉ॥ కాకులబాధ బాల్యమునఁ గాని యనంతరమందు నుండ దీ
పాకము నీవెఱుంగవా? ప్రౌఢత గల్గిన కోకిలంబుతో
డీకొనవెందుఁ గాకములు డేకకు మూలల, నత్సభాస్థలిన్
బ్రాకటశక్తిఁ జూపుము ప్రపంచక మెల్ల నిజం బెఱింగెడిన్. ౨౨౨

ఉ॥ అల్లెదు పద్దెముల్, సరిగ నయ్యవి యుండెడి, సందియంబు లే
దల్లెడినంతనే జగము అల్లన మెచ్చునె? యెన్నిశక్తులో
పల్లవితంబులైనయెడఁ బ్రాజ్ఞులు మెచ్చెద రప్పుగూడఁ గీ
ర్త్యుల్లసనంబు దుర్లభమె యోపిక? యోపిక నెంచి చూడుమా? ౨౨౩

ఉ॥ నిద్దుర వోవుమోము, గణనీయము గాని గళంబు, మేటియౌ
పద్దశ దెల్పుధార, విన వాంఛ జనింపని వాక్కు, గాక యే
విద్దియ గాని నేర్పినవివేకులు సత్సభలోనివారలన్
దద్దయు మెచ్చఁ జేతు రని దజ్ఞులు దెల్పుదు రీ వెఱుంగవే. ౨౨౪

ఉ॥ పెద్దలు వచ్చునక్కొలఁది బిట్టుగ విస్మృత మాశరీరమున్
గద్దఱిమూఁకఁ జూచునెడఁ గంకెదు పెంకెతనమ్ము వాక్కులం
బెద్దఱికంబుఁ బ్రౌఢిమయుఁ బెక్కుగుణమ్ములు వొల్చుజాణయే
తద్దఁ బ్రపంచపున్నతికిఁ దాఁ దగు నన్య లనర్హులే సుమీ. ౨౨౫

ఉ॥ పెంకెకుఁ బెంకె పెద్దకును బెద్దగ నెవ్వఁడు సంచరించునో
లంకకు వాఁడు వోయినను లక్ష్యము లేక జయించి వచ్చు ని
శ్శంకుని నాంజనేయు నిట సాక్షిగఁ గైకొను మాతఁ డెంతయో
పెంకె సురారికోటి యెడఁ, బృథ్వితనూజ యెడన్ వినమ్రుఁడే. ౨౨౬

ఉ॥ ఈవచియించులక్షణము లిన్నియుఁ గల్గినవార లెందఱో
భూవలయమ్మునం దొకటఁ బొల్పువహింప రొకండొ యిద్దఱో
సూ? వెలయంగ లార, లివి చెప్పెడిఁ జూ శివరామునం దెటో
దైవవశమ్మునన్ వృథగఁ దజ్ఞుని వానిని దూఱు టొప్పునే. ౨౨౭

ఉ॥ దూఱుము నన్నుసారెకును దూఱుకొలంది యశమ్ము నీకు నేఁ
జేరఁగఁ జేతు నూరక ప్రసిద్ధిఘటిల్లుచునున్నయప్పు డీ
వేరికి నేల జంకెదవి విదే యొక విద్దెగ జేసికొంటి వా
ధోరణి మేలు! మేలు! గురుదూఱి యశమ్ము వహించి తో బళీ ౨౨౮

మ॥ *"అవధానంబది చేయ లేడు శివరామాఖ్యుండు తద్దేశికుల్
శివరాముల్ గవిఁ జేసి వారి పనులన్ జేసేతఁ గావించి" రం
చు వివేకం బలరార వ్రాసితి వహో? శుంఠల్ ప్రసంగించుదు
ర్వ్యవసాయంబులు నీకు సాక్షులా? కో? నీవవ్వానికిన్ మూసెదే. ౨౨౯

చ॥ అతఁడలి ధర్మతత్పరత? నాఱడి కూఁతలు సైఁచి నాఁడు ప్రా
జ్ఞత గలవాఁడవే నతనిప్రజ్ఞ గనుంగొను మింతయేల ధీ
యుతుఁ డతఁ డొక్కఁ పద్దెము నహో యని లోకము మెచ్చఁ బాడునా
చతురత నీక కాదు సుమి సాధ్యముగా దది యెట్టిదిట్టకున్. ౨౩౦

చ॥ అతనికి నీకుఁ బోలిక యగు నంచును దజ్ఞుఁ డెవండు గాని సూ
నృతమును కాదు సేయని మనీషి యె యేని వచింపఁ బోఁడు నీ
కుతుక మదెట్టి? దెవ్వడును గోవిదుఁ డుండనెకూడ దొక్కఁడే? నన్
బలితుఁ డటంటి నమ్మితమె ప్రాజ్ఞుల నవ్వుల దూఱ నేటికిన్. ౨౩౧

ఉ॥ చూడుము శక్తియున్నయెడ సూరిహితం బగు సత్సభాస్థలిన్
వాఁడె ఘనుండొ? నీవు మఱి బావయు వానినిమించుమిన్నలో?

---

(అట్టహాసమునుండి.)

*......కృష్ణ—ఇప్పుడు తిరుపతి వేంకటకవులు తమపుస్తకములజాబితాలోఁగ లిపిప్రకటించి యమ్ముకొనుచున్న యవధానమదియేనా యేమిటి!

దేశమాత—ఔను. అదియే. మొదటనుండియుఁ బాపము! వారుదాని విషయమై చాలశ్రమ పుచ్చుకొన్నారు.

కృష్ణ—సరే! తెలిసినదిలే. శివరామశాస్త్రిగారనఁగా బిడాలోపాఖ్యాన కర్తయేనా?

ఆంధ్రకేసరి—(పరిహసించుచు)ఆఁ. ఆఁ. ఆయనయే (చెవిలో)ఇట్టు లిటులు.

రాఁడనుకోకు రాఁగలఁడు రమ్మన వచ్చెదవేని దానికిన్
గాఁడు పరాఙ్ముఖుండు సరిగా లిఖియింపుము జాబు దీనికిన్. ౨౩౨

ఉ॥ * కాఁకర పర్తి రమ్మనెదొ? కాఁకర పర్తికె వచ్చు "శృంగభం
గాకలనంబు సల్పఁగల యయ్యలు తోడుఁగ నీవు బావయున్
దాఁకఁగ నేర్తురే యతని; నాలుక వచ్చినయట్టు లెల్ల నె
ట్లో కలహమ్ము సల్పెదరె యోగ్యులు లేరె నిజమ్ము తెల్పఁగన్. ౨౩౩

ఉ॥ మానుఁడు వ్రాఁత లింక, నవమానపు వ్రాఁతలు వ్రాయు దొంగదు
ర్మానుల నెల్లఁ బట్టుకొని రాఁ దగుశక్తిని దేవుఁ డిచ్చెఁ జూపి
సూనృత మాఁగ శక్యమె సుషుప్తిని లోకము సర్వదా రతిన్
బూనదు మేలొ్కనున్ నిజము పూర్తిగఁ దా నెఱుఁగుం గ్రమమ్ముగన్. ౨౩౪

ఆ॥వె॥ $పత్రికాధిపతులు బాబోయి ప్రమాదమం, చన్న వ్రాఁత నూనియనృతకల్ప
నములు చేయు బావనాలుక కొక చంద్ర, హార మిత్తు నెదుటి కనుపఁగలవె.

చ॥ కల దొకకొంత తెల్వి, యది గాదని నేనన, నంతమాత్రచే
నిల సకలమ్ము మౌనమున నే మునిఁగింపఁగ నెంచి యేవిధో

---

(తాలుకుట్టనమునుండి),

* చ॥ శివుఁడను లేక రాముఁడను చేసెద నోమఱి చేయలేను నా,కవనము చూడఁగాఁ దలఁపుగల్గిన జాబులిఖింపుఁ డూరకే, సువిసువిఁ గ్రిక్కుచెద్దముల సూరులు నవ్వ లిఖింపనేల? యే, కవిత యొ తేరగా నొకటి గల్గుటకున్ ఫలమిట్టి దౌనొకో॥ ౧॥ మ॥ సభకున్ రావలె నోరువిప్పవలె మీసామర్థ్యముం జూపి వాగ్విభుతన్ గాంచవలెన్, వృథాగ నొకచక్రికిన్ డాఁగి నానాఁటిరాసభముల్ గోఁకిన పాడువ్రాఁతలకు దాసత్వమ్ము గావించుమీ, కుభయంబాని మఱిభక్తియాని యరకెటో ఘోషించుటిచ్చాగతిన్॥ ౨॥ ఉ॥ వచ్చెద రమ్మటన్న నృపవల్లభునాజ్ఞను బొంది మీరలే, వచ్చిన నింతకన్న శుభంబిటు సేయుఁడు లేదయేని యే, పిచ్చియొ వెళ్లఁ గ్రిక్కుఁడు పెద్దలు నవ్వుచునున్నవారు మీ, కుచ్చితపుం బ్రసంగములకుం జెవియొగ్గఁడు ప్రాజ్ఞుఁ డొక్కఁడున్ (విస్తరమా గ్రంథమునందే చూడఁదగు)

$దీనింగూర్చి గుంటూరిసీమ- పూర్వరంగము, 49,50 పుటలు చూడఁదగు.

గిలుకుచుఁ *"జేటభారతము" గీరతధోరణి నడ్డునంచు వా
క్కులు ప్రచురింప నేల పినఁ గూడనిపోకలు కట్టిపెట్టుఁడీ. ౨౩౬

చ॥ తిరుపతివేంకటేశ్వరుని దిట్టుచుఁ జెప్పినయట్టిపద్దెముల్
గురువరు నింద సల్పినను గొండొక చక్కఁగ నున్నవంచుఁ జె
ప్పిరి వినువారు, తిట్టినను బిప్పికవిత్వము కాదు గాన వా
విరి నవి బైటఁ బెట్టుఁడు ప్రవీణత కయ్యవి సాక్ష్య మిచ్చెడిన్. ౨౩౭

ఉ॥ తిట్టిన నేమి నన్నరక దేవునిఁ జేసితి వంటివి దాన నో
దట్టుఁడవి? దేశికత్వమును దాఁటిన మేల్పద మబ్బఁ జేయు నా
తిట్టులు నాకు దీవనలె తిర్పతివెంకన పేరు నాకు మున్
బెట్టిన యందు కీవు నరి పెట్టితి వంచు నుతింతు నిన్నుఁగన్. ౨౩౮

ఉ॥ ఊరక యిచ్చినన్ గొనని యుప్పనిచప్పనిమాఁత లెల్ల నె
వ్వారలొ "కర్బు" లిత్తు రని వారకయిచ్చునఁ గుచ్చ నేల దు
ర్వారరసప్రసారగుణ బంధుర దివ్యతరప్రబంధ సం
సారులు గందు వర్ధిలుఁడు జాడ్యము మాని సుఖింపుఁడింపుగన్ ౨౩౯

ఉ॥ బీజము లేనివ్రాఁత లవి పెంపు వహింపవు మీకు బీజ మే
రోజ ఘటిల్లునో మే మురక యున్న గురున్ దిగఁద్రావి తిట్టఁగా
నాజడుఁ డూరకుండక యహంకృతిఁ జూపె నటందురోటునో మీ
బీజము దెల్పినట్టులె వివేకులకున్ బోడకట్టెడిన్ జూఁడీ. ౨౪౦

మ॥ యతులున్ బ్రాసలు వెట్టి యెట్టులో కవిత్వాడంబరం బూని తి
ట్టితిరే యందము దాన లాభ మది యెట్లేఁ గల్గఁ గాఁ బోదు పం
డితు లాధోరణి మెచ్చుకొన్న, నల గోష్ఠిన్ సత్యవాక్చాతురీ
వితతప్రాజ్ఞత చూపకున్న వితయా వేయేల! చాలింపుఁడీ. ౨౪౧

$ఆ॥ వె॥ రాళ్లబండి శతవధాని వ్రాసినట్టి, పద్యముల సారమును మదిఁ బట్టుకొల్పి
త్రోవకున్ రండు దేశికద్రోహచింత, వలనిదోసంబు ననుతాపభరము మ్రింగు.

---

*...మనపిఠాపురపు వారు "చేటభారత" మొకటి వ్రాయుచున్నారటని...

6—2—12 సుందరరావు

$దీనిం గూర్చి గుంటూరిసీమ, పూర్వరంగము 138, 139, 140. పుటలు చూడఁదగు.

తే॥ గీ॥ ఏమిసార్థక్య మదియో యీవు వ్రాసి, వెంటనే యేను ఖండించి వేసినంత
సత్యమె జయమ్మునిచ్చు యశమ్మునిచ్చు, సత్యమునఁ బొమ్ము మంచియశమ్ము గొమ్ము

ఉ॥ వెంకటశాస్త్రి నేరొ యవివేకులు తిట్టి రటంచుఁ గాని యే
కుంకయొ సత్సభాస్థలిని గొట్టె నటంచును గాని యెవ్వఁడో
జంకక వ్రాయ నయ్యది యసత్య మటంచుఁ దలంపకుంటయే
పంకము, నమ్మచో ముద మపారము గాంచుట చెప్పనేటికిన్. ౨౪౪

తే॥ గీ॥ శత్రునకు నేని యాపద సైఁప రాదు, పైని సంతసపడు టెంత పాతకంబు
పరమ శత్రులు గిలికెడిపాడు వ్రాఁత, లౌరరె పుస్తక మంచు వ్రాయంగఁ జనునె

తే॥ గీ॥ అంతయో యింతయో యక్షరాస్యులైన, మీకుఁ బారమ్ము లేని నామీఁద నక్ష
రములె నేరని వారేమి రాఁ దలంతు, రింత మాత్రము తెలియవిఁ కేమనందు.

క॥ మిముఁ బట్టి కొప్పరము కొ, ప్రముఁ బట్టియు మీరు తప్పవ్రాఁతలు గిలుకన్
క్రమ మొకటిదక్కె వెంకన, కమరు నొకో యప్రతిష్ఠ యరయుఁ డిఁకైనన్.

క॥ *బ్రహ్మోత్సవములతోడన్, బ్రహ్మాండం బగులుకీర్తి ప్రబలించెడిరో
జిహ్వాగులారా! మీ "యం, బ్రహ్మతకు విచారమేల పడవలెనకటా? ౨౪౮

శా॥ మీయజ్ఞానము కొప్రపుం దెలివియున్ మేల్గూర్చెడి న్నాకు మీ
రాయాసం పడకుం డసత్యములు వ్రాయంగాఁ బ్రయత్నించకుం
డోయీ శిష్యుఁడ! "వేఁడినీళ్లకు గృహం బొక్కింతయున్ గాల" దా
హా! యజ్ఞానపుటట్టహాసములదుర్వ్యాపారపారీణతల్. ౨౪౯

ఆ॥ వె॥ అట్టహాసమంటి? అద్దాని నిండఁ ద, ప్పదు ప్రసంగమంటి? పుడమిఱేఁడు
చూచియుండఁ డొక్కొ? చూచియు వారింపఁ, డొక్కొ? చూడఁడనుటె యొప్పవలయు.

ఉ॥ చూచిన నూరకుండఁ "డిది శుంఠప్రసంగము మానుఁ" డంచు బి
ట్టేచి చివాటులన్ గొలుప కెట్లును మానఁడ ప్రాజ్ఞుఁడై యెటుల్
నీచత నమ్మతించు నవనీపతి నిక్కము చూచియుండఁ డీ
తోఁచియుఁ దోఁచ రానినుడిత్రోవలు ఱేనికిఁ జూడ నేటికిన్. ౨౫౧

---

*దీనింగూర్చి వేమవరాగ్రహారశతావధానమునఁ జూడఁదగు.

చ॥ ఎవరు చివాట్లు పెట్టఁ బని యేమి? గురుండను నేనె చాలు, దు
ర్వ్యవహృతి పూర్తిగా నెఱుఁగుపండితమండలి చాలు, బుద్ధి చె
ప్పవలసి వచ్చినన్ గురుఁడుఁ బండితవర్గము, వీరిపైని బా
ధ్ధిపుఁడు వచింపఁగా వలయుఁ దేఁకువ గల్గిన వీరె చాలరే ౨౫౨

ఉ॥ తప్పదు వ్రాఁతలందును "శతఘ్నిని" వ్రాసెదునంతదాఁక వ్రా
లొప్పఁగఁ జేసి తీరి పుడొ యొక్కఁడె బావయ చేయుచుండె నీ
కిప్పుడు బుద్ధివచ్చినదియే వచియింపు "శతఘ్ని"యూరకే
"ట"ప్పని వ్రేలి పాశుపత ధాంకృతి కుప్పను గాక వ్రుగ్గుటన్ ౨౫౩

ఉ॥ నీ కటు బుద్ధివచ్చుటయె నిక్కమయేని వచింపు మింకఁ బె
ద్వీఁకఁ జరించు బావకు వివేకము గూర్ప యతింతుఁగాక యా
కాఁకరపర్తివాసికి నఖండమృషావచనప్రతాపికిన్
బ్రాకటధర్మముల్ పలుకు పద్ధతి వేఱుసుమా? కుమారకా. ౨౫౪

ఆ॥వె॥ అకట? పాశుపతము నడఁపఁబరాస్త, పాశుపతమనుచునుక్క "శాంతికాయ"
వ్రాతఁవ్రాయు బావ వైఖరిగనియు నీ, వేలయూరకుంటి వెఱుఁగఁ జెప్పుమ.

క॥ అందుఁగల యనృతఘోరణి, "సందేహము లేదు బావ శాబ్దికజీవా
నందుని" సారము తేల్చెడి, నెందులకా పిచ్చివ్రాఁత లెంచఁగింపు సుతా. ౨౫౫

శా॥ ఏదో వ్రాసెడివానిపోలిక నెదియో యించింత పంపఁగఁ బై
నేదో వచ్చుఁగదా? యటంచు నకటా? కృష్ణాఖ్య పత్రంబు వై
కో దూఁకెన్ బయి సిగ్గిలెన్ జుమి వృథాకుంఠీభవ చ్చాపర్యగే
ఖాదార్భాగ్య వచఃప్రచార కలనా గర్వాంధ్య మిట్లుండునే ౨౫౬

ఆ॥ వె॥ వ్రాఁతయట్టులుంచు పాశుపతమ్ముపైఁ, బాఱు పేరునీకుఁ బట్టుపడెనె
అంచు బావతోడ నాడుమీ నాకు నై, గురుని కింత నలుపు చరణసేవ.

క॥ * బావవచనములు వినకుము, భావవచనములను వినుము బాగుపడుము సం
భావించి భవుఁడు చెప్పిన, భావుకవచనములు భావవచనములనఁగన్. ౨౫౭

* స్కాందోత్తర ఖండస్థగురుగీతనుండి.

శ్లో॥ అత్రినేత్రశ్శివస్సాక్షా ద్ద్విబాహుశ్చహరిస్స్వయం, అచతుర్వదనో బ్రహ్మా శ్రీగురుః కథితః ప్రియే ... శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మావిష్ణుమహే

గీ॥ అల్లకృష్ణుండు సంధికినంకనీక, పార్థుల నపార్థుల నొనర్చి బావమఱఁది
యంచుఁ గృష్ణుని బోధలఁ బాలకించి, తాదృశుఁడ వీవు కాఁటు వృథావిధముఁగ.

ఉ॥ అన్యులతోడ మాకు నెపుడైనను వేరొకకారణమ్మునన్
జన్యము సంభవించు నెడ సాయము వారల కాచరించి నీ
వు న్యాయముఁ గలంచుటకు బుద్ధిని ద్రిప్పితి వెంత వెఱ్ఱివో!
ధన్యత లేనివాగలను ధన్యులఁ జేయఁగ నీకు శక్యమే. ౨౬౧

మ॥ ఒకచో గుంటురి కీవు పోదువనుకొ మ్మొక్కవెఱ్ఱిమ్యుండ! శా
ఖకునై వారలు నిన్ను నిట్టిగతిగాఁ గారింప యత్నింతురి నీ
కకటా! దికృఁ-పుదు నెన్నెనికొ! మఱి నీవా! కాదు, నీవంటి వా
రొక నేర్పైనను లెక్క-లేదుసుమి యోగ్యుల్ పండితుల్ స్నేహితుల్, ౨౬౨

ఉ॥ వారలె లేకయున్నయెడ వాంద్రుడును నీవును గూడి దబ్బఱల్
సారెకు వ్రాసి యెట్లయిన సాయముపట్టక పోరనత్వపున్

---

శ్వరాః, సామర్థ్యమగమన్ సర్వే కేవలంగురుసేవయా,... శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం, శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥... శ్లో॥ ...గురునిందాంకరోతియః, సయాతినరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥ ...శ్లో॥ "హుం" కారేణ నవక్తవ్యః ప్రాజ్ఞశ్శిష్యైఃకదాచన. గురోరగ్రే నవక్తవ్యమసత్యంతు కదాచన, గురుం తుం కృత్య హుం కృత్య ...సభవేద్బ్రహ్మరాక్షసః॥...శ్లో॥ ...కాలమృత్యుభయాద్వాపిగురు స్సంత్రాతిపార్వతి॥ ... శ్లో॥ గురుదేవార్పణం యత్తుతేనతుష్టో స్మిసువ్రతే॥... ...శ్లో॥ గురోః పరతరం నాఽస్తి త్రివారం కథయామి తే॥ ధన్యామాతా పితా ధన్యో గోత్రంధన్యంకులంభవం, ధన్యాచవసుధాదేవి యత్రస్యాద్గురుభక్తతా, ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః, తాస్సర్వాస్సఫలా దేవి గురుసంతోషమాత్రతః,,...శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యోగురుం నైవమన్యతే, శ్వానయోని శతంగత్వా, చండాలేష్వభిజాయతే॥ ...శ్లో॥ సప్తకోటిమహామంత్రా శ్చిత్తవిభ్రమకారకాః, ఏకఏవపరో మంత్రో గురురిత్యక్షరద్వయమ్...శ్లో॥ ... కవిత్వాదిగద్యంసుపద్యం కరోతి, గురోరంఘ్రియుగ్మే మనశ్చే న్నలగ్నం తతఃకిం తతః కిం తతఃకిం తతః కిమ్ (విస్తరస్తుతత్రైవ ద్రష్టవ్యః).

భారము మోయుప్రజ్ఞ గలపండితు లౌ కతనన్ యథార్థ వి
ద్యారసికుల్ భవత్కృతుల నడ్డుదు రేమియొనర్ప నేర్తువో. ౨౬౩

ఉ॥ కావున నిప్డేనియు వికారపుఁజేయ్వులు మాని ప్రాజ్ఞులౌ
ధీవరు లాడుపల్కులను దెల్లముగాఁ దలపోసి సత్యపుం
ద్రోవకు రమ్ము నిక్కమగు ద్రోహము నీవొనరించియున్ ఋజు
త్వా విలసిల్లు హేతువున శిష్యుఁడవై మంచియశమ్ము గన్గెడిన్. ౨౬౪

క॥ మనువచనమ్ములవిని తగ, మను మనువచనములనంగ మనువచనము లే
మనుకొంటివొ? మనుమార్గమ్మనుమాన మ్మిడిగి పట్టు మది యఘు మడఁచున్

మ॥ *త్రివిధేయుండు త్రిలోకజేతయనుచున్ "త్రిష్వప్రమాద్యన్" మను
ప్రవచస్సారము తెల్పు నీవు కడగా వర్తిల్లుచున్నట్టి యా
హవనీయాగ్నిని గాలఁద్రొక్కియునవత్వాని మూడులోకమ్ము లా
హవరంగమ్మున గెల్చుటన్ వృథయ ధర్మాధర్మ దుర్మర్మముల్. ౨౬౬

శా॥$ ఆజన్మంబు గురున్ భజించునెడ బ్రహ్మప్రాప్తికర్తుండు గా
రోజించున్ స్మృతివాక్యముల్, మృషయ సుమ్మా వత్సయిమ్మాట నీ
కీజన్మమ్మునఁ గొంత సేవయును "హీహీహీ"లు "హూహూహూ"లు త
ద్రాజద్బ్రహ్మసమాజమాన్యతకుఁ బాత్రత్వమ్ముఁ జేకూర్చుటన్ ౨౬౭

---

*శ్లో॥ త ఏవ హి త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః, త ఏవ హి త్రయో వేదాస్త ఏవోక్తాస్త్రయోఽగ్నయః,, ౨౩౦,, పితా వై గార్హపత్యోఽగ్ని, ర్మాతాగ్ని ర్దక్షిణస్స్మృతః (గురురాహవనీయస్తు) సాగ్నిత్రేతా గరీయసీ. ౨౩౧,, త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ॥,, ౨౩౨,, (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

(అభియుక్తోక్తి)

శ్లో॥ లజ్జామేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్॥

---

$శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా తు మధ్యమం, గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే॥ ౨౩౩ శ్లో॥ ఆసమాప్తేశ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుం, స గచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతం॥ ౨౪౧॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

మ॥ *తనయార్జించిన క్షేత్ర ముఖ్య ధనముల్ దాతవ్యముల్ ముందు గా
దన యాచార్యున కంచుఁ జెప్పు స్మృతి, తద్ధర్మంబు గన్పట్టె నో
తనయా! నీయెడ, నెట్టులన్న! వినుదుర్ధర్మంబు త్వద్వృత్తమా
త్తనయా! నాయెడఁ దొల్తనీవు విని యుక్తంబౌట సూచించుటన్. ౨౬౮

శా॥ ¶భ్రాతృస్వార్జిత విత్త మందు సుకషష్ఠం బంశమున్ గైకొనం
బాత్రుండంటని గురుండు వింటివె! భవత్ప్రజ్ఞార్జితాచార్యుడు
శ్శత్రుత్వాఖ్య ధనంబు సర్వమును నన్నాత్మార్పితం బయ్యె నే
మాత్రంబో యిడ కంతయున్ బెరిమ నిమ్మాడిర్న్ గురున్ జేర్తురే. ౨౬౯

మ॥ $శ్రుతిదూరంబయినన్ స్మృతిన్ దవిలె నెచ్చో నీస్థితుల్'' నిత్యము
ద్ధృత పాణిత్వము చెప్పెఁగా! మనువు, నీధీమత్త చే గాని నా
దృతమున్ జేసితి వగ్ర మం దగపడన్ దేలుం జుమీ నీదుస
ద్ధృత పాణిత్వఫలమ్ము, స్మార్తమతవర్తీ! నీకగున్ భద్రముల్. ౨౭౦

క॥ †భారతవచనమ్ముల మదిఁ, జేరుత మని బావనదుగు శ్రీరతులున్ స
ద్ధీరతులు నీదుపద్ధతి, ఘోరతరం బనెడిరీతి గొనకు మిఁకైనన్. ౨౭౧

---

*శ్లో॥ స్నాస్యంస్తు గురుణాజ్ఞప్త శ్శక్త్యా గుర్వర్థమాహరేత్, క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమాసనం, ధాన్యం శాకంచ వాసాంసి, గురవే ప్రీతి మావహేత్॥ ౨౪౬ అత్ర వ్యాఖ్యా॥ స్నాస్యన్నర్గురుణాదత్తాజ్ఞో యథాశక్తి ధనినం యాచిత్వాఽపి ప్రతి గ్రహాదినాఽపి గురవేఽర్థ మాహృత్యాఽవశ్యం దద్యాత్॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము.)

¶శ్లో॥ షడ్భాగం స్వార్జితం విత్తం కృత్వాఽనందాత్మకో నరః। ఏకంతు గురవే దద్యాత్....

$శ్లో॥ నిత్య ముద్ధృత పాణిస్స్యా త్సాధ్వాచారస్సుసంయతః, ఆస్యతామితి చోక్తస్సన్నాసీతాభిముఖం గురోః॥ ౧౯౩ (మను- ౨, అ.

(భారతాదిపర్వమునుండి)

†కశ్చిదృషి ర్ధౌమ్యోనామ...తస్య శిష్యాస్త్రయో బభూవు రుపమన్యు రారుణిర్వేదశ్చేతి, సఏకంశిష్యమారుణింపాంచాల్యం ప్రేషయామాస "గచ్ఛ కేదారఖండం బధానేతి,...యస్మాచ్చ త్వయా మద్వచనమనుష్ఠితం, తస్మాచ్ఛ్రేయోఽవాప్స్యసి,

క॥ గురుశరవహ్నికిఁ గృష్ణుం, డఱిముఱి భీతివడు ధర్మజాదుల సత్య
స్థిరుల నసత్యంపుమహా, దురితమ్మునఁ ద్రోచె నెఱుఁగుదో యెఱుఁగవో?.
క॥ నిజమైనతిట్లు తిట్టుము, గజగజ నీకేల? లేనికార్లనకుము భూ
ప్రజలు సహింపరు లోలో, § స్వజనంబేనియును దప్పు నైఁపదెఱుఁగుమీ.

---

సర్వ ఏవ తే వేదాః ప్రతిభాస్యంతి సర్వాణి చ ధర్మశాస్త్రాణీతి,... తంచోపాధ్యాయః ప్రేషయమాస" వతోఽపమన్యో గారక్షస్వేతి,... మయ్యనివేద్య భైక్ష్యం నోపయోక్తవ్యమితి... భో ఉపమన్యో క్వాఽసి వత్సైహీతి, స ఉపాధ్యాయవచనం శ్రుత్వా ప్రత్యువాచ,... కూపే పతితోఽహమితి, తముపాధ్యాయః ప్రత్యువాచ కథం త్వమస్మిన్ కూపే పతిత ఇతి, స ఉపాధ్యాయం ప్రత్యువాచ. అర్కపత్రాణి భక్షిత్వాఽంధో భూతోఽస్మ్యతః కూపే పతిత ఇతి, తముపాధ్యాయః ప్రత్యువాచ అశ్వినౌ స్తుహి,... త్వాం చక్షుష్మంతం కర్తారా వితి,... అశ్వినౌ స్తోతుముపచక్రమే,... అశ్వినావాజగ్మురాహతుశ్చైనం, ప్రీతౌ స్వ ఏష తేఽపూపోఽశానైనమితి,... నత్వహామే తమపూవముపయోక్తు ముత్సహే గురవేఽనివేద్యేతి,... తమశ్వినావాహతుః, ప్రీతౌ స్వస్తవానయా గురుభక్త్యా,... చక్షుష్మాంశ్చ భవిష్యసి శ్రేయశ్చా వాప్స్యసీతి,... లబ్ధచక్షుః...ఉపాధ్యాయ మభ్యవాదయత్,... ఏషాత స్యాఽపి పరీక్షోపమన్యోః, అథాపరశ్శిష్యః... వేదో నామ... గౌరివ నిత్యం గురుకార్యేషు నియుజ్యమానః, తస్య మహతా కాలేన గురుః పరితోషం జగామ, తత్పరితోషాచ్ఛ్రేయ స్సర్వజ్ఞతాంచావాప, ఏషాతస్యాఽపి పరీక్షా వేదస్య. ......

(విస్తరస్తుతత్రైవద్రష్టవ్యః)

రాజమండ్రి.
ది 28-8-13.

§...తమరు కాకరపర్రు వెళ్లినప్పట్లో "లోకములోని కవులందరు నా జంధ్యములోనివారు" అని అన్నందుచే యీ అల్లరి జరిగినదనిన్నీ పిమ్మట తప్పు అంతయును కాకరపర్తివారిదే అనిన్నీ శ్రీ ఆ॥ వ్యాసలింగశాస్త్రులవారు నాతో చెప్పినారు. యింకా కొన్ని సంగతు లున్నవి కాని విస్తరించుటకు స్థలము లేక వ్రాయలేదు, ...రామకృష్ణులు ముందు భారతము ప్రచురించెదరట. వారు యెన్ని వ్రాసినను గురుద్రోహమును బలపరచేవే అని శ్రీ, ఆ॥ వ్యాసలింగశాస్త్రిగారు అన్నారు...

చె॥ కొండయ్యవ్రాలు.

క॥ చదువెఱుఁగఁడనియుఁ గంతము, మృదువైనది గాదటనియు నేరికి విద్వ
ద్గుదిరి వచింపఁడనియు నా?, పదరి జగము మెచ్చుఁగోరు పద్ధతిచెపుమా.

క॥ ఘాయొద్దఁ జదివినదెయని, కోయిల శ్రీవాయసంబు కూయుట తప్పా
నే? యరయుమయ్య బావయొ, వ్రాయన్ వలె, నీకుఁ జేయిరాదిటు వ్రాయన్.

క॥ ఇరువురచే వ్రాళ్లుండుట, యరనియు నీ కిట్లు వ్రాయుటది రాదనియే
పొరఁబడితిఁ గొంతకాలము, పరమాప్తుఁడు రామమూర్తి పలికెడిదనుకన్.

చ॥ తతమతి నీ కతండు పెదతల్లికుమారుఁడు నాకు మిత్రుఁడు
న్నతుఁ డనృతం బతండు జననంబును బొందిన వంగడప్పె యా
కృతయుగ మాదిగా నెఱుఁగ దిప్పుడు నీకయి నేర్వఁ బోదు సూ
నృతవచనుండు నీకతన నే విని నాకు వచించె నర్భకా. ౨౭౭

చ॥ కుతుకముతో నొకా నొకటఁ "గోకిల కాకము" నాకవిత్వ మం
చతనికిఁ జెప్పినాఁడవఁట? యయ్యది జ్ఞప్తికిఁ దెచ్చికొమ్ము శ
త్రితకలిమిన్ వచింపఁడు బుధుం డతఁడేదొ ప్రసంగమందు సం
గతముగుటన్ వచించె నడుగం దగునందియ ముండె నేనియున్ ౨౭౮

చ॥ అనయుఁడవై వృథాగ నెపు డాఱడి వ్రాఁతలు వ్రాయుచున్ నిజం
బు నడఁచి నేఁటికేనియు సుబుద్ధివిశాల పరాక్రమించు ని
న్నును సుజనున్ బొనర్చుట కనుంగుఁ జెలిన్ ఘనరామమూర్తి గా
రిని నొక సాక్షిఁ జేసితి నెఱింగి యతండు క్షమింప కుండునే. ౨౭౯

ఉ॥ అందఱు నాకు బందుగులె యంచు లిఖించెద వింతసాహసం
బెందుకు? దూరగుల్ బలెనె యింజర కాఁకరపట్టు వాసులున్
బొందఁబడంగలారె యిటు బొంకఁగ నేటికి? రామమూర్తి నే
మందువొ చెప్పుమా యకట? యాతఁడు నాపెదతల్లి పుత్రుఁడే. ౨౮౦

శా॥ చాడీలన్ వచియించువాఁడొ? జడుఁడో? చండాలపుంబుంత లే
నాఁడున్ ద్రొక్కినవాఁడొ? తొక్కఁగలఁడో? నాబోఁటి లెక్కేమి యే
ప్రోడల్ నెత్తిని బెట్టుకోఁదగిన సత్పుణ్యుండు గణ్యుండు శా
నాడంబోయెనొకో? యసత్యము కుమారా? నిన్ను వంచింపఁగన్ ౨౮౧

శా॥ ఆడుంగడుక్ వ్రతంబు నీకొఱకు వ్యాసాకొండి యొప్పేని, పాౕ
ద్వారయు మఱొకగ్రచోఁ బోడమి కామాకొండిచేఁ బ్రల్లదం
శ్రియ గలదేమి చూచెదనుగా కంచుక్ బరీక్షార్థమై
మ॥ ఱచ్చో నొకసాక్షిగా నతని వర్ణింపక్ బ్రసక్తించెఁ జూ. ౨౮-౨

ఘనుఁడల రామమూర్తి యెటుగా లిఖియించిన నెందుఁజేయునో ?
తనలిపి యంచుఁ గొంకుఁజూమి తథ్యమెఱింగియుఁ, బెద్దతల్లికిం
దనయుఁడె వేఱొ కండిపుడు దా ధవళాద్రి వసించు నాతఁడుక్
ఘనుఁడు తదంబయు న్మిగులఁ గందురు నేఁటికి నన్నుఁ జేర్మితోక్. ౨౮-3

†క॥ కృతమీపుమఱచితివి నీ, కతనంగదని వారు నాకుఁ గడుఁ గూర్తురు నీ
కతి శత్రుఁడు వారలకే, గతిఁ బ్రేమాస్పదుఁడొ? తెలుపఁగాఁగలవె సుతా.

క॥ గురుఁగాకము గానుడివిన, దురితపు వ్యాసమ్ము గాంచి దుఃఖింపక యె
వ్వరొ మెచ్చిరనియు వ్రాసెద, వరరే? యటువంటియోగ్యు లవనింగలరే.

‡క॥ శత్రులుమిత్రులు నైతము, పుత్రా? తలయూఁచిరనుచుఁ బొంగెఁగదా? మీ
పత్రిక యూఁచుటకర్థ ము, పాత్రవ్యాస మనిచేయువని గాదుగదా? ౨౮౬

క॥ నీకవితాప్రాశస్త్య, శ్రీకతనక్ గలుగు యశము చెందెడి నను నీ
కోౕ కృతముమఱచు పాతక, మే కడకుక్ మిగులు సారమిదియె కుమారా

క॥ ఎందుకుఁ బెంచెద వఘమిది, యందఱకు న్నిజము దెలిసె నాఁగునె కస్తూ
రిందాఁచినఁ బరిమళ మది, బొంచఁబడకు నిజమునుడివి పొందుము శుభముల్.

(10) మంగళపర్వము.

చ॥ తిరుపతి? నాకు నింతటి విధేయుఁడు శిష్యుఁడు గల్గె వాని నం
చరణము లీశ్వరుక్ దెగడు సాహసమూనెడి, పట్టివానికిక్

ధవళేశ్వరము. 26-8-13.

†...శ్రీ మానాన్నగారు శ్రీ మాయమ్మగారు, సదా మీశ్రేయోభివృద్ధిని గోరు
చున్నవారలు. కా॥ నారాయణమూర్తి.

(కవితనుండి.)

‡కోకిలకాకము, ఇదికోకిలమును గాకమునుగూర్చిన యొకచిత్రకథ, శత్రులు
మిత్రులుగూడఁ దలయూఁచిన పద్యములు.

సురుచిర నెంతఁ? తాదృశుని గొండొక యోగ్యునిఁ జేసి వేంకటే
శ్వరుఁ డొనరించె ధర్మపుఁ బ్రసంగ మెసంగు వినంగనం ౨౮౯

చ॥ తిరుపతి వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టు వానికిం
దిరుపతి? వేంకటేశ్వరుని దిట్టి దినంతులు గొట్టుటెంతఁ? యే
మఱఁజన త్రైనవా మనకు మంచికిఁ ద్రిప్పవినంగ మేదియో
జరుపుట యొప్ప వాని కద పాయముఁ జేసినఁ జేయకుండినన్ ౨౯౦

చ॥ హితమువచింపఁ డావానఁగు నెవ్వఁడు వాఁడెవఁడున్ వినండ భా
రతమున నేమి తక్కినపురాణములందున నేమి యెవ్వఁడే
హితముగ్రహించెఁ? నట్లని మఱెవ్వఁడు చెప్పటమానెఁ? చెప్పు టే
చతురునికోయగున్ గణనసల్పి కృతార్థుఁడు వేఱొకండగున్ ౨౯౧

ఉ॥ కావున నేరొనర్చినను గష్టము లోకముకోనమే యశ
శ్శ్రీవిమలీకృతోజ్జ్వలదశేష విశేషదిగంతరాళు లా
ధీవరులెల్ల లోకమునఁ దేలవలెన్ బరిశుద్ధలోకసం
భావితులే సుమీ జగతి భవ్యులు సేవ్యులు కావ్యభావ్యులున్. ౨౯౨

॥ లోకము మెచ్చగాంచు నతిలోకుని యాదవపట్టభద్రు దు
ష్పాకుఁడు దుర్జయుండు శిశుపాలుఁడు వట్టుకతిట్టె దానిచే
నాకటివేల్పుపూజనము లడ్డెనె? సాక్షికలోక మెన్నఁడున్
లోకములోనఁ జేర దరిలోకపు శోకము కీర్తికే యగున్. ౨౯౩

ఖరముఖాసురకోటి కఠాకఠార్భటిలేక రాముకీర్తికి నట్టిరాణ యెట్లు?
శిశుపాలదుర్విపాత్యశుపన్పశలు లేక కృష్ణుకీర్తికి నట్టికెలన మెట్లు?
కనకకశిపుదుష్టకష్టచేష్టలులేక నరసింహుకీర్తి కాగరిమ యెట్లు?
ఖలనృపాలకహాలాహాలహాళాహాళి లేక కల్కికీర్తికి నట్టి కలిమి యెట్లు?
తే॥గీ॥ఎంతవాఁడేని విమతులాక్రాంతసాయ। మాదరింపక పేరెక్కఁడట్టులగుట
నిరతనత్కీర్తి దాతల నిర్గుణస్వరూపుల నుతించి కీర్తిఁ బ్రేరేపవలయు.

మ॥ నుతియింతున్ మనరామకృష్ణకవులన్ సుస్నార్యధర్మైక న
ద్గతులన్ సూనృతవాగరాతుల, వృథాదంభాశుఘోషానృత
వ్రతులన్ దాదృశకొంత్రవుంగవుల, నశ్లీలావవాదప్రద
[illegible]తల వారివీరిహితులన్ బ్రాంచద్యశోదాతలన్. ౨౯౪

మ॥ దయచే [illegible]ం దిట్టుటయ మేల్ దైవాదులన్, బూర్వపు
జయ: శ్రీ విజయుండు శాపహతులై శాసించి రీతోర్వ, త
న్నాకర్ణము దీనియం దగపడున్ దైన్యంబు గన్పట్టదా
ణక్లేశముసున్న తుల్యము ఫలైశ్వర్యంబు రాజించినన్.

కలికిన్ మంగళమస్తు దానికి సిరిన్ గల్పింప [illegible] బుధు
లకున్ మంగళమస్తు నిస్తులవచోరూఢిన్ గలిన్ ద్రుంచు నా
ర్యులకున్ మంగళమస్తు వేదమత శాస్త్రోక్తార్యధర్మైకవ
ర్తులకున్ మంగళమస్తు గీరతవచోదుగ్ధాబ్ధికిన్ మంగళమ్.

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు
గీరతాఖ్యాయమ్మునందు గురుదక్షిణ
యను ద్వితీయభాగము
సంపూర్ణము.

